పి. గణపతిశాస్త్రి

# ప్రాచీన గాథాలహరి

## 3

కవిచక్రవర్తి : ఇతర కథలు

యం. శేషాచలం అండ్ కో
మద్రాసు : మచిలీపట్నము : సికింద్రాబాదు.
MSCo

ప్రథమ ముద్రణ :

ఫిబ్రవరి, 1963

Praacheena Gaathaa Lahari

Vol. 3 : Kavi Chakravarti & Other Stories
[Stories from Sanskrit Classics]
by P. Ganapathi Sastri

సాదా ప్రతి రూ.

మేలు ప్రతి రూ.

ముఖపత్ర చిత్రం : శ్రీ బాపు




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
వారి 'ఇంటింటా స్వంతగ్రంథాలయం'
ప్రణాళిక చందా దారులకొఱకు
ప్రత్యేక ప్రచురణ

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు,
రాష్ట్రపతిరోడ్డు - సికింద్రాబాదు.

# పరిచయము

భారతీయసాహిత్యంలో కథానికారచన అత్యంత ప్రాచీనము. పంచతంత్రకథలు ప్రపంచభాష లన్నింటిలో నికి అనువదించుకొన్నారు. కథాసరిత్సాగరము, దశ కుమారచరిత్రము, సింహాసనద్వాత్రింశత్సాలభంజిక మొద లయిన ప్రాచీన సంస్కృతగ్రంథాలలో మనోజ్ఞములయిన కథ లెన్నో గోచరిస్తున్నాయి.

ప్రాచీనగాథాలహరి కథ లేవీ పురాతన సంస్కృత వాఙ్మయంలోని కథానికల కనువాదాలు గాని, అనుసరణలు గాని కావు. అయితే మన పురాతన సంస్కృతాదిసారస్వ తాలలో అక్కడక్కడ గోచరించిన చిన్నచిన్న సన్నివేశాలు, సంఘటనలు, కథలు కొన్ని వేర్వేరు వినూతనకల్పనలతో, వివిధ పాత్రచిత్రణలతో విశేషంగా మార్చి ఈ రచనలు కొనసాగించాను. ప్రాచీన గాథాలహరిలోని అయిదారు కథలకు కల్హణకవి రాజతరంగిణిలోని కొన్ని చిన్నకథలు మాతృకామాత్రాలు. ఇలాగే బౌద్ధ వాఙ్మయ గాథలు కొన్ని వేర్వేరు కల్పనలతో చాలావరకు స్వతంత్రంగా రచించాను. ప్రాచీనగాథాలహరిలోని కొన్ని కథలు కేవలం చారిత్రకాలు. మరికొన్ని చారిత్రిక పూర్వరంగంతో కల్పిం చిన స్వతంత్ర కథలు. మరి కొన్నిటికి చిన్నచిన్న ప్రాస్తావిక శ్లోకాలే మాతృకలు. మొత్తంమీద ఈ రచన లన్నింటి లోను కథాశరీరకల్పనం చాలావరకు సరికొత్త పంథాలో

నడిచింది. ఒక్క పౌరాణిక కథలలో మాత్రమే కొంతవరకు యథాతథంగా మాతృకానుసరణం జరిగింది.

ఈ కథానిక లీవిధంగా రచించ వలసినదని ప్రోత్సహించినవా రాంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారు. వారివి సుమారొక పదాదిన్నర పాటు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురింప జేయించారు. ఆంధ్ర పత్రికాధిపతుల కిదే నా కృతజ్ఞత.

మిత్రులు శ్రీ వెణుతురుపల్లి రామలింగస్వామిగారు ప్రస్తుతం బొంబాయిలో సైనమైడ్ ఇండియా లిమిటెడ్ సంస్థలో మార్కెటింగ్ డైరెక్టరు. చిరకాలంనుండి ఆ మహానగరంలో ఆంధ్రమహాసభ, ఆంధ్రవిద్యాసంస్థల నిరంతరాభివృద్ధికి అవిరళకృషి చేసిన, చేస్తున్న ప్రముఖులు.

సుమారు ఇరవైఅయిదేళ్ల క్రితం నాటి మాట. ఆనాటి నా కవితావ్యాసంగం క్రమశః మా కిద్దరికీ నిరంతర స్నేహార్ద్రిత సమకూర్చింది. కవితతోబాటు వేర్వేరు కళల పరిశీలనం వారి కారవ ప్రాణము. జీవితంలో ఇటువంటి ప్రగాఢ రసాత్మక హృదయు లెంతోమంది గోచరించరు. అవ్యాజమయిన ఆయన ఆత్మీయతాభిమానమే నాయెడల ఇంతటి స్నిగ్ధత రేకెత్తించిన దని ఒకొ్కక్కప్పుడు నా కనిపిస్తుంది. ప్రాచీనగాథాలహరి ఈత్మతీయసంపుటి కృతిస్వీకరణమే దీని కొక తిన్నని తార్కాణ. ఇది ఎంతోకాలంనించి సంకల్పించుకొన్న అభిలాష, ఇప్పటి కీవిధంగా చక్కగా నెర

వేరినదన్న సంపూర్ణసంతృప్తి కలిగించిన వారి కిదే నా కృతజ్ఞత.

ఈ కథానికల రచన సుమారుగా అయిదు పదుల వరకు కొనసాగింది. వీటిలో వేర్వేరు రీతుల కథానికలు కొన్ని చేర్చి సంపుటాలుగా వెలువరించాలని నా సంకల్పం. మిత్రులు శ్రీ మద్దూరి నరసింహరావుగారిది విని ప్రాచీన గాథాలహరి క్రమక్రమంగా కొన్ని ప్రత్యేక సంపుటాలుగా, ఒకటికొకటి అనుస్యూతంగా కాక దేని కది స్వతంత్రంగా ప్రకటించాలని నిశ్చయించారు. సహృదయులు, రసజ్ఞులు అయిన వారీ విషయంలో నా కిచ్చిన చేయూత ఎన్నటికీ మరవరానిది.

విఖ్యాత విద్వాంసులు శ్రీ టి. వి. రంగాచార్యులు గారీ సంపుటి సంకలనంలో, ముద్రణంలో నా కెన్నో విధాల తోడ్పడ్డారు. వారి కిదే నా వినతి.

చెన్నపురము
15-1-63

పి. గణపతిశాస్త్రి

నడిచింది. ఒక్క పౌరాణిక కథలలో మాత్రమే కొంతవరకు యథాతథంగా మాతృకానుసరణం జరిగింది.

ఈ కథానిక లీవిధంగా రచించ వలసినదని ప్రోత్స హించినవా రాంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక శంభు ప్రసాద్ గారు. వారివి సుమా రొక ఏడాదిన్నర పాటు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురింప జేయించారు. ఆంధ్ర పత్రికాధిపతుల కిదే నా కృతజ్ఞత.

మిత్రులు శ్రీ వేణుతురుపల్లి రామలింగస్వామిగారు ప్రస్తుతం బొంబాయిలో సైనమైడ్ ఇండియా లిమిటెడ్ సంస్థలో మార్కెటింగ్ డైరెక్టరు. చిరకాలంనుండి ఆ మహానగరంలో ఆంధ్రమహాసభ, ఆంధ్రవిద్యాసంస్థల నిరంత రాభివృద్ధికి అవిరళకృషి చేసిన, చేస్తున్న ప్రముఖులు.

సుమారు ఇరవై అయిదేళ్ల క్రితం నాటి మాట. ఆనాటి నా కవితావ్యాసంగం క్రమశః మా కిద్దరికీ నిరంతర స్నేహార్ద్రత సమకూర్చింది. కవితతోబాటు వేర్వేరు కళల పరిశీలనం వారి కారవ ప్రాణము. జీవితంలో ఇటువంటి ప్రగాఢ రసాత్మక హృదయు లెంతోమంది గోచరించరు. అవ్యాజమయిన ఆయన ఆత్మీయతాభిమానమే నాయెడల ఇంతటి స్నిగ్ధత రేకెత్తించినదని ఒక్కొక్కప్పుడు నా కని పిస్తుంది. ప్రాచీనగాథాలహరి ఈతృతీయసంపుటి కృతిస్వీకర ణమే దీని కొక తిన్నని తార్కాణ. ఇది ఎంతోకాలంనించి సంకల్పించుకొన్న అభిలాష. ఇప్పటి కీవిధంగా చక్కగా నెర

వేరినదన్న సంపూర్ణసంతృప్తి కలిగించిన వారి కిదే నా కృతజ్ఞత.

ఈ కథానికల రచన సుమారుగా అయిదు పదుల వరకు కొనసాగింది. వీటిలో వేర్వేరు రీతుల కథానికలు కొన్ని చేర్చి సంపుటాలుగా వెలువరించాలని నా సంకల్పం. మిత్రులు శ్రీ మద్దూరి నరసింహారావుగా రిది విని ప్రాచీన గాథాలహరి క్రమక్రమంగా కొన్ని ప్రత్యేక సంపుటాలుగా, ఒకటికొకటి అనుస్యూతంగా కాక దేని కది స్వాతంత్రింగా ప్రకటించాలని నిశ్చయించారు. సహృదయులు, రసజ్ఞులు అయిన వారీ విషయంలో నా కిచ్చిన చేయూత ఎన్నటికీ మరవరానిది.

విఖ్యాత విద్వాంసులు శ్రీ టి. వి. రంగాచార్యులు గారీ సంపుటి సంకలనంలో, ముద్రణంలో నా కెన్నో విధాల తోడ్పడ్డారు. వారి కిదే నా వినతి.

చెన్నపురము
15–1–63

పి. గణపతిశాస్త్రి

---



శ్రీ వెణుతురుపల్లి రామలింగస్వామిగారు

# కృతి బహుమా

ఆత్మీయ మిత్రులు శ్రీ వి. ఆర్. స్వామిగారికి

ఏనాటి మాట! మన మిరువుర మ్మలనాడు
సౌహార్ద్రపూరితస్వాంతాల పులకించి,
సాహితీమధురసాస్వాదాల మైమరిచి,
తేనెవాకలె తీర్చిదిద్దితిమి కలలతో!

జీవిత మ్మొక చిత్రచిత్రమైన అగాధ
భావనాలంకృత ప్రాచీన నవగాథ!
మధురకథగా నీవు మలుచుకొంటివి మనికి!
బ్రతుకులోతులనుండి కత లల్లితిని నేను!

మన చిరంతనమైత్రి ఘనసంస్కృతికి, పురా
తన కథానికల నూతనవకుళమాల, నీ
కెనలేని కానుకగా హృదయాన గూర్చి, నే
ననుకొంటి నిది ధన్య మయ్యెనని మిత్రమా!

చిరకాల మ్మిది, సహృదయ
వరగణ్యత నంది మన కపారానందా
కరమై బాంధవపరిమళ
భరితమ్మై సర్వదా శుభంకర మగుతన్.

# వి ష య సూ చి క

# కవిచక్రవర్తి

ఆనాటి అర్ధరాత్రి వేళ ఉజ్జయినీ నగరం అంతా శిశిరర్తు హిమవర్షంలో వెన్నెల వెలుగులలో తెల్లని దుప్పటి కప్పుకొన్నట్టు తళ తళ మెరిసింది. రాజప్రాసాదంలో హర్ష విక్రమాదిత్య చక్రవర్తి హంసతూలికా తల్పంపై నిద్రిస్తున్నాడు అలా కొంతకాలం గడిచే సరికి జివ్వుమనే చలిగాలి గవాక్షాల తెరలు తొలగించుకొని రివ్వుమని లోపల ప్రవేశించింది. ఆ చలిగాలికి చక్రవర్తికి మెలకువ వచ్చింది. శయనాగారంలో హసంతికలు జాజ్వల్యమానంగా వెలిగిపోతున్నాయి. కాని దీపాల కాంతులు కొంచెం మందగించాయి. నూనెపోసి ప్రజ్వలింపజేసే పరిచారకులు పార్శ్వభవనాలలో గాఢంగా నిద్రపోతున్నారేమో అనుకొన్నాడు చక్రవర్తి. లేకపోతే ఆ దీపికలలా ఎందుకు సన్నగిలిపోతున్నాయి ? ఆ సమీపంలో ఎక్కడా ఆ పరిచారకుల అలికిడే వినిపించలేదు.

“ఎవరక్కడ?” అని పిలిచాడు హర్షచక్రవర్తి. వెంటనే ఒక వ్యక్తి శయ్యాగారంలో ప్రవేశించి దీపికల ప్రమిదలలో నూనెపోసి ప్రజ్వలింప జేశాడు. మళ్ళీ అవి జాజ్వల్యమానంగా వెలిగాయి. చక్రవర్తికి లోపలికి వచ్చిన వ్యక్తి సామాన్య పరిచారకుడులా కనిపించలేదు.

"ఎవరా వచ్చినది?" అని ప్రశ్నించాడు.

"మహాప్రభూ! నేను! మాతృగుప్తుణ్ణి!" అన్నాడా నూతనవ్యక్తి.

"మాతృగుప్త కవీశ్వరులా?" అని చక్రవర్తి లోలోపల కొంచెం ఆశ్చర్యపోయాడు! ఆకాశంలో తారకలు దట్టంగా కమ్ముకొన్న మంచు తెరలు తొలగించుకొని లేత లేత వెన్నెలలో సన్న సన్నని చిరునవ్వులు చిలకరించాయి.

చక్రవర్తి ఒక్క నిట్టూర్పు విడిచి—

"ఇప్పటికి ఎంత రాత్రి గడిచింది?" అని ప్రశ్నించాడు.

"రాత్రి చాలావరకు గడిచిపోయింది. ఇక మిగిలింది సరిగ్గా జామున్నరమాత్రమే" అని సమాధానం ఇచ్చాడు మాతృగుప్తకవి.

చక్రవర్తి ఆ దీపకాంతిలో కవి ధరించిన దుస్తులు జాగ్రత్తగా పరకాయించి చూచాడు. అతడు ధరించినవన్నీ జీర్ణ మలిన వసనాలే!

"ఎముకలు కొరికే చలిలో ఎలాంటి చింకిపాతలు కట్టుకున్నాడో!" అనుకున్నాడు హర్ష విక్రమాదిత్యుడు. కాని ఆభావమేమీ ముఖంమీద కనబడనీయలేదు. చక్రవర్తి ఏదో ప్రశ్నించే ధోరణిలో ఉన్నాడని గ్రహించి మాతృగుప్తుడు అతని శయ్యకు దగ్గరగా నిలుచున్నాడు. చక్రవర్తి ప్రశ్నించాడు:

"ఇంత రాత్రివేళ మీ కింత స్పష్టంగా కాలమానం ఎలా తెలిసింది?"

మాతృగుప్తుని కాక్షణంలో చక్రవర్తి కవితాభిమానం స్ఫురణకు వచ్చింది. ఒక క్షణంసే పుండి అతడడిగిన ప్రశ్నకు సమాధానంగా ఒక శ్లోకం చదివాడు.

చలి ఎముకలు కొరికివేస్తున్నదనీ, అదే పనిగా హాసంతిక లూదడం వల్ల పెదవులు బెరడుకట్టుకుపోయాయనీ, ఆకలి మూలాన గొం తెండిపోయినదనీ, ఆయా కారణాలవల్ల నిద్రాదేవత అవమానిత యైన ప్రియురాలివలె దూరదూరంగా తొలిగిపోయినదనీ, సత్పాత్రదత్తమైన వసుధవలె రాత్రి ఎంతసేపటికీ గడవడం లేదనీ ఆ శ్లోక తాత్పర్యం.

ఆ విధంగా నిద్రపట్టకపోవడం వల్లనే అంత విస్పష్టంగా కాలమానం తెలుసుకోవడం జరిగినదని మాతృగుప్తుడా శ్లోకం ద్వారా చక్రవర్తికి ధ్వనింపజేశాడు.

హర్ష విక్రమాదిత్య చక్రవర్తి ఎంతో శ్రద్ధగా ఆ శ్లోకం విని ఒక్క చిరునవ్వు నవ్వి మళ్ళీ హాయిగా కళ్ళు మూసుకొని నిద్రపోయాడు.

మాతృగుప్తుడు చిరిగిపోయిన ఉత్తరీయంతో ఒళ్ళంతా కప్పుకుని చలిలో గజగజ వణికిపోతూ ఆ శయ్యాగృహం ద్వారం దాటి ఇవతలికి వచ్చివేశాడు. అక్కడే వట్టి కటికినేలమీద చదికిలపడి ఒక్క పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు. తన దుర్దశ తలుచుకుంటూంటే అతని కళ్ళంట కవోష్ణబాష్పాలవిరళధారగా ప్రవహించాయి.

మాతృగుప్తకవి ఉజ్జయినికి వచ్చిన తరువాత అప్పుడే ఒక సంవత్సరం గడిచిపోయింది. హర్ష విక్రమాదిత్యుడు ఆ కాలంలో భారతవర్షానికంతటికి చక్రవర్తి. అంతటి మహాచక్రవర్తి ఆస్థానంలో ప్రవేశం లభించినా మాతృగుప్తకవికి దారిద్ర్యపీడ తొలగలేదు. అది నానాటికీ శ్రుతిమించి పోయింది. అతనికి అప్పుడే నల నిండాయి. ఇంతకు పూర్వం అతడు ఎన్నెన్నో రాజాస్థానాలు సందర్శించాడు. ఎన్నెన్నో రాజసభలలో తన కవితాచాతుర్యం ప్రదర్శించాడు. ఇక దేశసంచారం విరమించుకొని మిగిలిన జీవితం అంతా ఒకే ఒక ఆస్థానంలో గడిపి వెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. వెంటనే సకుటుంబంగా ఉజ్జయిని నగరం చేరుకొన్నాడు.

అదృష్టవశాత్తూ త్వరలోనే అతనికి చక్రవర్తి ఆస్థానంలో ప్రవేశం లభించింది. మొదటలో చక్రవర్తికి మాతృగుప్త కవియెడల కొంతవరకు గౌరవాదరాలేర్పడ్డాయి. తరవాత కొంతకాలానికి ఆ గౌరవాదరాలన్నీ నశించిపోయి కేవలం తటస్థదృష్టిమాత్రమే మిగిలింది. ఇటీవల కొంచెం అనాదరణకూడా ప్రారంభమైనది.

మాతృగుప్తుని అనంతరం విక్రమాదిత్యుని ఆస్థానం సందర్శించిన విద్వాంసులకు, కవీశ్వరులకు చక్రవర్తి ఎన్నెన్నో సత్కారాలు చేశాడు. మొదటగాని, ఆటుపిమ్మటగాని మాతృగుప్తుని కటువంటి

సత్కారం ఎన్నడూ జరగలేదు. మొట్టమొదట ఏదో కొంచెం గౌరవభావం ఉండేది. ఇప్పుడదికూడా పూర్తిగా నశించిపోయింది. ఈ దురదృష్టపరిణతికి కారణమేమో మాతృగుప్తుని కవగాహన కాలేదు. పోనీ, చక్రవర్తి కఠిన హృదయుడేమో అనుకుంటే అదీ నిజంకాదు. అనేకానేక విద్వాంసులు, కవీశ్వరులు చక్రవర్తి ఆదర కటాక్షానికి పాత్రులై ఎన్నోవిధాల వైభవైశ్వర్యాలతో తులతూగుతున్నారు. మాతృగుప్త కవి అంటే సాటి విద్వాంసులు, కవీశ్వరులు ఎంతో ఆప్యాయంగా ఆదరించేవారు. కాని ఒక్క చక్రవర్తికే అతని యెడల కర్కశమైన కాఠిన్యభావం ఏర్పడింది.

చక్రవర్తి అంతటితో ఆగలేదు. సామాన్య పరిచారకులు నిర్వహింప వలసిన పనులు కూడా మాతృగుప్తునికే అప్పజెప్పేవాడు. చిట్టచివరికి చక్రవర్తి శయ్యాగారంలో దీపికలు, హసంతికలు ప్రజ్వలింపజేసే నీచదాస్యంకూడా మాతృగుప్తకవిమీదే పడింది. అయినా అతడేమీ చలించక తన కప్పజెప్పినది ఎలాంటి చిన్నపని అయినా ఎంతో జాగ్రత్తగా నిర్వహిస్తూండేవాడు. అది చక్రవర్తి దాసదాసీజనం చెయ్యవలసిన పని. అయినా మాతృగుప్తుడు తన కది ఒక తలవంపుగా భావించలేదు. మిగిలిన విద్వాంసులు, కవులు చక్రవర్తి మాతృగుప్తుని యెడల వహించే కాఠిన్యాని కెంతో కుంగిపోయేవారు. కాని దానికి హేతువేమో ఎవ్వరికీ అంతు చిక్కలేదు.

ఇక మాతృగుప్తుని కుటుంబ పరిస్థితులు కూడా నానాటికీ అధ్వాన్నమయిపోయాయి. ఆరు మాసాలకు పూర్వం అతని ఏకైక పుత్రుడు రోగంతో తీసుకుని తీసుకుని చిక్కి శల్యమైపోయి హఠాత్తుగా చనిపోయాడు. ఆ విచారంతో అతని గృహిణి సర్వమంగళకు కూడా ఏవో దీర్ఘ రోగ చిహ్నాలు ప్రారంభమైనాయి. ఆమె పరిస్థితి కూడా నానాటికీ తీసికట్టుగానే ఉంది. అయినా మాతృగుప్తుడు చక్రవర్తి సేవలో ఏమరలేదు.

అతడా చలిలో ఏవేవో ఆలోచనా పరంపరలలో మునిగి తేలుతూంటే తిరిగి రివ్వున చలిగాలి వీచింది. కవి చిరుగుల ఉత్తరీయం మళ్ళీ గట్టిగా కప్పుకున్నాడు. ఆ ప్రయత్నంలో అది మరింత చిరిగింది.

అతడొక్క నిట్టూర్పు విడిచి ఆ లేతవెన్నెలలో తారకావగుంఠనంతో సాగిపోయే విభావరి కేసి తిలకించాడు. ఆ రజని ఆతని భావనా నేత్రాల కొక రమణీయాభిసారికగా భాసించింది. ఆ భావనతో అతని హృదయంలో కవితావాహిని పొంగి పరవళ్ళు తొక్కింది.

ఇలా మరికొంతకాలం గడిచిపోయింది. హర్ష విక్రమాదిత్య చక్రవర్తి తన రహస్యభవనంలో మహామాత్యునితో కలిసి రాజ్యవ్యవహారాల మంతనాలలో మునిగిపోయాడు. అది కాశ్మీరరాజ్య వ్యవహారం. ఆ కాలంలో అది హర్ష చక్రవర్తికి లోబడిన సామంతరాజ్యం. అయినా చాలావరకది సర్వస్వతంత్ర రాజ్యమే. అందువల్లనే ఆ కాలంలో కాశ్మీరరాజన్యులు చక్రవర్తి బిరుదు వహించేవారు. ఆ రోజుల్లో హిరణ్యుడనే రాజా రాజ్యం పరిపాలిస్తూండేవాడు. ఆతని సోదరుడు తోరమాణునికి, ఆతనికి చుక్కెదురు! అందువల్ల హిరణ్యుడు తోరమాణునికి ఆజన్మ కారాగార శిక్ష విధించాడు. చిరకాలంగా అతడా కారాగారంలోనే కృశించి కృశించి చివరి కొకనాడా దుఃఖంతోనే కాలధర్మం చేశాడు. అతని రాణి ఏకైక పుత్రుడు ప్రవరసేనుడు ఆ దుఃఖాఘాతం భరించలేక తీర్థయాత్రకై వారణాశికి వెళ్ళిపోయాడు. అటుపిమ్మట కొన్ని సంవత్సరాలకు హిరణ్యుడు కూడా క్రమక్రమంగా రోగగ్రస్తుడై స్వర్గస్థుడయినాడు. ఆ పరిస్థితులలో కాశ్మీర మహామాత్యుడే రాజ్యాధికారం చేపట్టి రాజ్యపరిపాలన సాగించవలసిన అవాంతరం ఏర్పడింది. అలా కొన్ని నెలలు గడిచినా కాశ్మీర రాజ్యం ఉత్తరాధికారి ప్రవరసేనుడింకా శ్రీనగరం చేరుకోలేదు. అంతలో అతని జ్ఞాతులు యశోవర్మ, విక్రమవర్మ ఆ రాజ్యాధికారం ఆపద్ధర్మ దృష్ట్యా తమ ఒక్కరికే సంక్రమించవలెననీ, ఆ విధంగా ధర్మనిర్ణయం చెయ్యవలసిందనీ ప్రార్థిస్తూ హర్షవిక్రమాదిత్య చక్రవర్తికి వేరువేరుగా విజ్ఞప్తులు పంపించుకొన్నారు. ఆ ధర్మనిర్ణయమే చక్రవర్తి కొక విషమ పరీక్షగా పరిణమించింది. కొంత గాఢంగా ఆమథనపడిన తరువాత చక్రవర్తి మహామాత్యునితో ఇలా అన్నాడు :

"న్యాయంగా కాశ్మీర రాజ్యానికి ఉత్తరాధికారి ప్రవరసేనుడు ఆయనకి రాజ్యాధికారం విషయంలో ఇంతటి ఉపేక్ష ఏల?"

"అధికార విషయంలో ఆయనకంతటి ఉపేక్షాభావమేమీ లేదు. కాని జనకులు తోరమాణులా విధంగా దుర్మరణం చెందడంతో సంసారంమీద విరక్తిచెంది తీర్థయాత్రకు వెళ్ళిపోయారు." అన్నాడు మహామాత్యుడు.

"ఇంతవరకూ శ్రీనగరానికి తిరిగి రాకపోవడానికి కారణం?"

"అదే నాకవగాహన కావడంలేదు. ఎప్పటికి తిరిగివచ్చేదీ కూడా నిశ్చయంగా తెలియదు."

చక్రవర్తి తిరిగి కొంత గాఢంగా ఆలోచించి —

"మరి యశోవర్మ విక్రమవర్మల అర్హతానర్హత లెట్టివి?" అన్నాడు.

"ప్రవరసేనుల తరువాత కాశ్మీర రాజ్యానికిక ఉత్తరాధికారులు వారే."

"ఇద్దరు ఎలా కాగలరు?"

"ఇద్దరూ సమాన దాయాదులే."

"మరి వారి ప్రత్యేక సామర్థ్యాలెట్టివి?"

"నా దృష్టికి యశోవర్మే సర్వవిధాలా సమర్థులని అనిపించింది."

చక్రవర్తికీ నిర్ణయం రుచించలేదు. 'కొంతవరకు విక్రమవర్మే సమర్థుడేమో' అని సూచించాడు. మహామాత్యుడు దానికేమీ సమాధానం చెప్పక కొంతసే పూరుకుని, నెమ్మదిగా —

"చిత్తం! అలాగే నిర్ణయింపవచ్చును" అన్నాడు. అంతేగాని ఆ నిర్ణయానికి అవుననిగాని, కాదనిగాని నిష్కర్షగా సమాధానం చెప్పలేదు.

దానిమీద చక్రవర్తి నాలుగైదు నిమిషాలవరకూ ఏమీ అనలేదు. మహామాత్యుడు చక్రవర్తి ముఖభంగిమ పరీక్షిస్తూ —

"త్వరగా ఏదో ఒక నిర్ణయం చెయ్యకపోతే కాశ్మీరంలో కల్లోలం సంభవించవచ్చును!" అన్నాడు.

చక్రవర్తి దానికేమీ సమాధానం చెప్పలేదు. అలాగే ఆ విషయాన్ని గురించి ఆలోచిస్తూ పరిసరోద్యానం వైపు దృష్టి ప్రసరింపజేశాడు. ఆ ఉద్యానవనంలో అక్కడక్కడ వసంతర్తు సౌందర్య సూచనలు కొన్ని స్ఫురించాయి. ఎక్కడో మూల మూలల దాగిన ఒక కోకిల వచ్చీరానట్టుగా పంచమస్వరం ఆలాపించింది. అది వినగానే చక్రవర్తి ముఖం ఒక్కసారిగా వికసించింది. ఆ ముఖంలో డోలాందోళన భావం అంతా ఒక్కసారిగా అదృశ్యమైపోయింది. నెమ్మదిగా అడుగులు వేస్తూ అంతఃపురం వైపు వెళ్ళిపోయాడు.

మాతృగుప్తుని గృహిణి సర్వమంగళ రుగ్మత ఆరోజు కారోజు బాగా చెయ్యి దాటిపోయింది. మాతృగుప్తు డామె కనేకవిధాల చికిత్స చేయించగా చేయించగా కొంతవరకు ప్రాణభయం తప్పినదని అనిపించింది. అలాంటి విషమఘట్టాలలో కూడా అతడు తన సేవా విధులన్నీ నిర్వర్తిస్తూనే ఉన్నాడు. అయినా చక్రవర్తి కతని విషయంలో ఏర్పడిన అనాదరణలో మార్పేమీ గోచరించలేదు.

ఒకనా డత డుదయమే నిద్రలేచి కవితా వ్యాసంగంలో ఉండగా చక్రవర్తి కంచుకి అతని కెదురుగా ప్రత్యక్షమైనాడు. వెంటనే నిలుచున్నపాటుగా చక్రవర్తి సన్నిధికి రావలసిందని సవినయంగా విన్నవించాడు. మాతృగుప్తుడు తొందర తొందరగా తాతల కాలంనాటి కాశ్మీరశాలువ పైన కప్పుకుని కంచుకితో కలిసి చక్రవర్తి సన్నిధికి వెళ్ళిపోయాడు.

చక్రవర్తి తన రహస్య భవనంలో సింహాసనంమీద కూర్చుని దీర్ఘంగా ఏదో ఆలోచిస్తున్నాడు. కొంతసేపటివరకూ హర్ష విక్రమాదిత్యుడు కవి రాకకూడా గమనించలేదు. కవి అలాగే నిలబడి ఉన్నాడు. చక్రవర్తి ఉపేక్షాదృష్టితో అతని ముఖభంగిమ గమనించి, నెమ్మదిగా ఇలా అడిగాడు :

"మీ రెప్పుడైనా కాశ్మీరం సందర్శించారా ?"

"చిన్నతనంలో మా నాయనగారితో కలిసి ఒకసారి కాశ్మీ రాస్థానం సందర్శించాను."

"అయితే కాశ్మీరం మీకు సుపరిచితమే నన్నమాట!"

"చక్రవర్తీ! అది సాక్షాత్తూ భూతల స్వర్గమే!" అన్నాడు కవి.

"నేనొక అత్యంత ముఖ్యమైన దౌత్యవ్యవహారంలో మిమ్మల్ని నియోగిస్తున్నాను.

'ఈ దౌత్య వ్యవహార మేమై ఉండునా' అని కవి లోలోపల మథనపడ్డాడు

"ఒక లేఖ మీ చేతి కందిస్తున్నాను. అది అత్యంత భద్రంగా తీసుకుపోయి కాశ్మీర మహామాత్యుల కందించాలి,"

కవి అలాగే అత్యంత శ్రద్ధాభక్తులతో అతని మాటలు వింటున్నాడు.

"ఆ లేఖావ్యవహారం అత్యంత రహస్యం!" అన్నాడు చక్రవర్తి.

కవి నిర్ఘాంతపోయాడు.

"లేఖా రహస్య భంగానికి శిరశ్ఛేదమే శిక్ష!" అని ముగించాడు చక్రవర్తి.

మాతృగుప్తు డింకా ఆ ఆఘాతంలోనుంచి కోలుకోలేదు. కొంత సేపటివరకూ అలాగే మాట్లాడకూరుకుని తలవంచుకొని అతివినయంగా—

"చిత్తం! అలాగే! అయితే తమకింకా నామీద విశ్వాసం కలగ లేదే అని కించపడుతున్నాను." అన్నాడు.

"విశ్వాసం కుదరకపోతే మిమ్మల్ని దౌత్యంలో నియోగించి ఉండనుగదా! లేఖాప్రాముఖ్యం తెలుపుడు చెయ్యడానికే నేనింతగా నొక్కి నొక్కి వక్కాణిస్తున్నాను. తక్షణం మీరు కాశ్మీరం వెళ్ళి పోవాలి!" అన్నాడు చక్రవర్తి.

"తమ ఆజ్ఞ ప్రకారం నేనీ సాయంకాలమే కాశ్మీరానికి బయలుదేరి పోతున్నాను" అన్నాడు మాతృగుప్తుడు. వెనువెంటనే చక్రవర్తి దగ్గర సెలవుతీసుకుని స్వగృహానికి మరలిపోయాడు.

మార్గంలో అతని హృదయంలో ఎన్నెన్నో ఆలోచనావల్లిక లల్లుకుపోయాయి. "చక్రవర్తికీ దౌత్యం నిర్వహించడానికిక తగిన అధికారులెవరును లభించనేలేదా? ఇంతటి సామాన్య దౌత్యకృత్యానికి నేను తప్ప మరెవరూ దొరకనేలేదా?" అని ఎన్నెన్నో విధాల మథన పడ్డాడు మాతృగుప్తుడు. అతని గృహిణి సర్వమంగళ ఆరోగ్యం ఇంకా కోలుకోనేలేదు. ఆమె అతని దృష్టికి చిక్కి శల్యమైపోయిన చంద్ర రేఖలా స్ఫురించింది. కవి నెమ్మదిగా ఆమెకు తన కాశ్మీర ప్రయాణ విషయం తెలియజేశాడు. ఎంతోకాలంనించి కాశ్మీరం చూడాలని ఉన్నదనీ, తానుకూడా వెంటవస్తాననీ ఆమె పట్టుపట్టింది.

"ఇంతటి నీరసస్థితిలో నీ వెలా రాగలవు సర్వమంగళా!" అన్నాడు మాతృగుప్తుడు.

"ఎప్పుడూ మీ రింతే! నన్నెప్పుడూ వెంటతీసుకుని వెళ్ళనే వెళ్ళరు!" అన్నది సర్వమంగళ. తరువాత బుడిబుడి దీర్ఘాలు ప్రారంభించింది.

అంతటి అనారోగ్యస్థితిలో ఆమెను విడిచిపెట్టి కాశ్మీరం వెళ్ళడం అతని కిష్టం లేదు. అయినా వెళ్ళక తప్పదు!

"మళ్ళీ ఒక మాసంలోపుగానే తిరిగి వచ్చేస్తాను. అప్పుడు తిరిగి మనమిద్దరము కాశ్మీరం వెడదాము" అని అతడామె నోదార్చాడు.

"మీరు మళ్ళీ వచ్చేసరికి నేను బ్రతికి ఉంటేగా!" అని ఆమె అతనికేసి జాలిగా చూసింది. వెంటనే ఆమె కళ్ళల్లో కన్నీరు మున్నీరుగా ప్రవహించింది. ఆమాట అతనికి శుభసూచనగా స్ఫురించలేదు. అయినా, ఎంతో ఆప్యాయంగా ఆమెనోదార్చి, చికిత్సకు, గృహ నిర్వహణకు తగిన సౌకర్యా లేర్పాటుచేసి మాతృగుప్తుడు కాశ్మీరానికి ప్రయాణమైనాడు.

అతడు కనిపించినంతవరకు ఆమె అలాగే నిశ్చలంగా అతనికేసి చూసింది. ఆ కనుచూపులోనే ఆమె ప్రాణాలన్నీ నిలబడ్డాయి. ఆ దృష్టి కవి హృదయాన్ని చీల్చివేసింది! మాతృగుప్తుడు జీవచ్ఛవంలా అడుగులు వేసుకుంటూ అక్కడినించి కదిలి వెళ్ళిపోయాడు. కాశ్మీరానికి అతి త్వరితంగా వెళ్ళిపోవడానికి వీలుగా అతనికి గజాశ్వాందోళికాది వాహనాలెన్నో ఏర్పాటు చేశారు. చక్రవర్తి తలుచుకున్నప్పుడిలాంటి వాటి కేమికొదవ! కాని అతని ప్రయాణ సన్నాహం తిలకించిన ఉజ్జయినీ నగర పౌరులందరు "చక్రవర్తి ఎంతటి కఠినాత్ముడు! సామాన్య రాజ్యాధికారులు నిర్వహించవలసిన దౌత్య వ్యవహార మేదో కవీశ్వరుని నెత్తిమీద పడవేయడం ఏమిన్యాయం! ఏమైనా మాతృగుప్తుడు చాలా దురదృష్టవంతుడు!" అని తలకొకవిధంగా చక్రవర్తిని నిందించారు. మాతృగుప్తుడా అవమాన భారంతోనూ, గృహిణీ చింతతోనూ కుంగిపోతూ క్రమక్రమంగా కొంత కాలానికి కాశ్మీరదేశం చేరుకొన్నాడు.

కాశ్మీర సౌందర్యం తిలకించేసరికి మాతృగుప్తుని ప్రయాణఖేదం చాలావరకు సన్నగిల్లి పోయింది. నిర్మల స్వచ్ఛ జలాలతో కలకలలాడే సరోవరాలూ, దూర దూరంగా స్ఫురించే ధవళ హిమవన్నగ శిఖరాలూ సందర్శించేసరికి అతని హృదయం నిశ్చలమానస సరోవరంలా కలకదేరింది. దానిలో సర్వమంగళ సువర్ణ విగ్రహచ్ఛాయ చూచాయగా ప్రతిఫలించినట్లయింది.

శ్రీనగరం చేరుకోవాలంటే అత డింకా చాలాదూరం ప్రయాణం చెయ్యాలి. అలాగలాగ కొంతదూరం సాగిపోగా తలవని తలంపుగా అతనికొక అదృష్టం కలిసివచ్చింది. కాశ్మీర మహామాత్యుడు అనతి దూరంలో ఒక సమీపనగరంలోనే ఉన్నాడనీ, రాజ్యవ్యవహార పర్యవేక్షణ నిమిత్తం అక్కడికి వచ్చాడనీ తెలిసింది. మాతృగుప్తుడు శ్రీనగర ప్రయాణం మానివేసి తిన్నగా ఆ సమీపనగరానికే ప్రయాణమై రెండు రోజులలోనే ఆ నగరం చేరుకొన్నాడు.

మహామాత్యుని విడిది చేరుకోగానే హర్ష విక్రమాదిత్య చక్రవర్తి దూత దర్శనానికై వేచిఉన్నాడనీ, తక్షణమే దర్శనం ఇప్పించవలసిందనీ ప్రతీహారుల ద్వారా సందేశం పంపించాడు.

మహామాత్యుడా సందేశం వినీ వినగానే ద్వారందగ్గరకు వచ్చి సగౌరవంగా మాతృగుప్తుని తన రహస్యభవనంలోనికి తోడుకుపోయాడు.

కవికి అక్కడ మహామాత్యుడేకాక కొంతమంది సైన్యాధిపతులు, దండనాయకులు మొదలైన ఉన్నతాధికారులుకూడా కనిపించారు. వారందరి సమక్షంలోను కవి చక్రవర్తి తనకిచ్చిన సువర్ణపేటికను సగౌరవంగా మహామాత్యునికి సమర్పించాడు. అది చక్రవర్తి ముద్రాంకితమైన స్వర్ణపేటిక. చక్రవర్తి తన లేఖ అతి జాగ్రత్తగా దానిలోనే భద్రపరిచాడు.

మొదట మహామాత్యుడా లేఖ చదువుకొన్నాడు. చదువుతూనే నిలువునా నిర్ఘాంతపోయాడు! అలా కొంతసేపుండి తరువాత అది ఇద్దరు ముగ్గురు దండనాయకులకు కూడా చూపించాడు. వారు మొట్టమొదట తమ కన్నులే నమ్మలేకపోయారు! మాతృగుప్తుడక్కడ చక్రవర్తి దూత కుచితమైన ఒక సింహాసనంలో కూలబడిపోయి ఒక వేడినిట్టూర్పు విడిచిపెట్టాడు.

మహామాత్యుడు సవినయంగా అతనిని సమీపించి సగౌరవంగా ఇలా అడిగాడు:

"తమరేనా మాతృగుప్తులు?"

"ఔను!"

"తమరు కవీశ్వరులేకదా!"

మాతృగుప్తుడౌననలేదు గాని 'ఔ'నన్నట్టుగా శిరఃకంపంచేసి చిరునవ్వు నవ్వాడు. వారావిధంగా పరీక్షించడానికి గల కారణమేమో అతనికి బోధపడలేదు. ప్రశ్నార్థకంగా వారివైపు చూశాడు.

మహామాత్యుడు సవినయంగా "ఈ క్షణంనుంచీ తమరే కాశ్మీరాధీశ్వరులు!" అన్నాడు.

మాతృగుప్తుడది విశ్వసించలేదు!

"హర్ష విక్రమాదిత్య చక్రవర్తి తమ స్వహస్త ముద్రాంకితమైన శ్రీముఖంలో తమరిని కాశ్మీర రాజ్యాధీశ్వరులుగా ప్రతిష్ఠించారు!" అన్నాడు కాశ్మీరమంత్రి. వెంటనే కాశ్మీరచక్రవర్తిసన్నిధిని నిలుచున్నట్టుగా మాతృగుప్తుని సన్నిధిని చేతులు జోడించి నిలుచున్నాడు. మిగిలిన దండనాయకులు కూడా లేచి నిలబడి చేతులు జోడించారు. మాతృగుప్తుడా వెనకటి ఆశ్చర్యాఘాతంలోనుంచి ఇంకా బాగా తేరుకోనేలేదు! అంతలోనే ఇంకొక ఆశ్చర్యాఘాతం! మహామాత్యుడు తిరిగి ఇలాఅన్నాడు: "ఈ క్షణంనుంచి కాశ్మీరం సర్వస్వతంత్ర రాజ్యంగానే వ్యవహరించవలెననీ, ఉజ్జయినీసామ్రాజ్య సామంతరాజ్యంగా వ్యవహరింపరాదనీ వారీ శ్రీముఖంలో ఆజ్ఞాపిస్తున్నారు."

మాతృగుప్తుని కింకా అనుమానం తీరలేదు! నెమ్మదిగా చక్రవర్తి లేఖకోసం చేయిచాచాడు. మంత్రి సవినయంగా అది మాతృగుప్తుని కందించాడు.

మాతృగుప్తుడా లేఖలో ప్రతి అక్షరమూ ఎంతో జాగ్రత్తగా పరిశీలించాడు. మహామాత్యుడు చెప్పినదంతా అక్షరాలా యథార్థమే! దానిలో ఎక్కడా ఇక సందేహానికి కాస్కారమే లేదు!

ఆటుపిమ్మట మంత్రి మరునాడే శుభముహూర్తం ఏర్పాటు చేయించి శ్రీనగరంలో పట్టాభిషేక మహోత్సవం జరిపించబోతున్నామనీ, ఆనాడే శ్రీనగరానికి తరలిపోతున్నామనీ, దానికి ఆజ్ఞాముద్ర ఇప్పించవలసిందనీ తిరిగి సగౌరవంగా విజ్ఞప్తి చేశాడు.

మాతృగుప్తుని కిక దాని కంగీకారముద్ర వేయక తప్పలేదు. ఆ పట్టాభిషేకం జరపవలసిన దివసంకూడా చక్రవర్తి ఆ లేఖలో ఉట్టంకించి ఉండడంవల్ల అది మార్చడాని కెవరికీ ధైర్యం కలుగలేదు.

మరునాడు కాశ్మీర రాజధాని శ్రీనగరంలో మాతృగుప్తునికి యథావిధిగా సామ్రాజ్య పట్టాభిషేకం జరిగిపోయింది. శ్రీనగరమే కాక కాశ్మీరమండలం అంతా ఆనాడు ఉత్సవ కోలాహలంలో తలమునక లయిపోయింది.

మాతృగుప్తుని కా పట్టాభిషేక సమయములో రెండే రెండు ప్రధాన విషయాలు స్ఫురించాయి. వాటిలో మొదటిది హర్ష విక్రమా

దిత్య చక్రవర్తి తనయెడల కనబరచిన అపారమైన ఔదార్యం! అది తలచుకున్నప్పుడు ఆనందబాష్పాలతో కలిసిన అభిషేకజలాలు అవిరళ ధారలుగా అతని శరీరంమీద ప్రవహించాయి.

రెండవది అతని గృహిణి విషయం. వివాహమైన క్షణంనుంచీ ఆ సహధర్మచారిణి అనేకమైన కష్టసుఖాలలో అతనికి తోడునీడగా, చేదోడు వాదోడుగా నిలబడింది. ఆమె తనతోపాటు కాశ్మీరం వస్తానని ఎన్నెన్నోవిధాల కాళ్ళావేళ్ళాపడి బతిమాలింది. అనారోగ్యం వల్ల ఆమెను తనవెంట తీసుకురాలేదు. ఆమె అనారోగ్యం ఎలా ఉన్నదో తెలియదు. ఏకైక పుత్రుని మరణదుఃఖంతో ఆమె కుమిలి కుమిలి కృశించిపోతున్నది. ఆమె అతని సరసన కూర్చొని చక్రవర్తినీ గౌరవం పొంది ఆనందించవలసిన సమయమిది. ఆమె లేకుండానే హఠాత్తుగా అతడీ చక్రవర్తి గౌరవం పొందడం జరిగింది. అది తలుచుకోగానే అతని ఆనందబాష్పాలు దుఃఖాశ్రుధారలై ప్రవహించాయి. అయినా అతడా శోకం అంతా లోలోపలనే సంభింపజేసుకొన్నాడు.

అటుపిమ్మట విక్రమాదిత్య చక్రవర్తిక కృతజ్ఞతా సూచకంగా అమూల్యమైన కానుక లేవేవో పంపించాలని అనుకొన్నాడు. ఆ కానుకలు సమాన గౌరవ ప్రపత్తితోనే పంపించాలిగాని సామంత ప్రభువుగా పంపరాదు! అది చక్రవర్తి ఆజ్ఞ! ఆ విధంగా సమాన సార్వభౌమ గౌరవంతో చక్రవర్తికి కానుకలు పంపించడానికి అతని హృదయం అంగీకరించలేదు. ఆ విషయం తలుచుకోవడమే అతనికెంతో లజ్జాకరంగా పరిణమించింది. వెంటనే ఒక భూర్జపత్రంపై ఒకే శ్లోకం రచించి అది చక్రవర్తి కాశ్మీర మహామాత్యునికి పంపించిన స్వర్ణపేటికలోనే ఉంచి తక్షణమే అది వేగరుల ద్వారా విక్రమాదిత్య సార్వభౌమునికి పంపించే ఏర్పాటు చేయించాడు.

“చక్రవర్తీ! నీలోని ఆత్మోత్కర్ష సూచనామాత్రంగానైనా స్ఫురించనీయలేదు! ఛాయామాత్రంగానైనా భాసించనీయలేదు! మహాప్రభూ! నీ వితరణ నిశ్శబ్దజలధరవర్షం! నీ అనుగ్రహం ఫలరూపంలోనే ప్రత్యక్షమైనది! అని శ్లోక తాత్పర్యం.

అటుపిమ్మట వెంటనే సర్వమంగళకు ఈ శుభవార్త తెలియజెయ్యడానికి జవనాశ్వాలపై నలుగురు వేగరులను ఉజ్జయినీనగరానికి పరిగెత్తించాడు.

సర్వమంగళ కేమాత్రం ఆరోగ్యంగా ఉన్నా వెంటనే ఆమెను కాశ్మీరానికి తోడ్కొని రావలసిందని ఆజ్ఞాపించాడు. ఒకవేళ శరీరారోగ్యస్థితి దీర్ఘ ప్రయాణానికి అనుకూలం కాకపోతే ఆమె చికిత్సకై ఉజ్జయినీ నగరంలో రాజవైద్యుల నేర్పరచవలసిందని ఆజ్ఞాపించాడు. అటుపిమ్మట పదిహేను రోజుల వరకు నిద్రాహారాలు లేకుండా ఆ వేగరుల రాకకోసం ఎదురుతెన్నులు చూచాడు. ఆ పదిహేను రోజులూ అతనికి మహాయుగాలుగా గడిచాయి. చివరికి వేగరులు వచ్చారు.

మాతృగుప్తుడు కాశ్మీరానికి బయలుదేరి వెళ్ళిన మరునాటినించి సర్వమంగళ రోగం మళ్ళీ తిరగబెట్టింది. క్రమంగా అది బాగా ముదిరిపోయింది. ఇక ఆమె జీవించదని అందరూ నిశ్చయించారు. ఇంతలో వేగరు అతికష్టంమీద ఆ శుభవార్త ఆమె చెవిలో వేశారు. ఆ మాట వినీ వినగానే ఆమె ముఖం ప్రత్యూషపు ఒక్కసారిగా తామరపూవులా వికసించింది! మరుక్షణంలో ఆ ఆనందాఘాతం ఆమె హృదయాని కొక వజ్రాఘాతంలా పరిణమించింది. వెంటనే ఆమె మరణించింది. వేగరు లా వృత్తాంతం అంతా చక్రవర్తికి విన్నవించారు.

మాతృగుప్త చక్రవర్తి ఆ మాట వింటూనే మొదలు నరికిన తరువులా అక్కడే కూలబడిపోయాడు!

## 5

గృహిణీమరణంతో మాతృగుప్తునికి వజ్రాఘాతం తగిలినట్లయింది. ఎంతోకాలం దాకా అతడా ఆఘాతంలోనించి కోలుకోలేదు. అయినా అతడా దుఃఖభారం పైకి ఏ మాత్రం వ్యక్తం కానీయలేదు. పైపైకి చాలా ఉల్లాసంగానే కనబడుతూండేవాడు. కాని లోలోపల ఆ శోకం ఆరని చిచ్చులా రగిలి అతని హృదయాంతరాళ జీవనాళాలను దహించివేసింది.

కాశ్మీర మహామాత్యుల కుటుంబాలకు సంబంధించిన బ్రాహ్మణు లెందరో అతనికి తమ కన్యకల నిచ్చి వివాహం చెయ్యాలని ఉవ్విళ్ళూరారు. ఆ ప్రస్తావన వచ్చినప్పుడు మాతృగుప్తుడొక్క నిట్టూర్పు విడిచే వాడు. ఆ పైన మహామాత్యులిక ఆప్రయత్నంవల్ల లాభం లేదని ఆ విషయం విడిచిపెట్టి వేసేవారు.

మాతృగుప్తుని లోలోపల నిరంతరం ప్రవహించే శోకవాహిని అతని హృదయాని కొక అపూర్వమైన ఆర్ద్రత కలిగించింది. అతడు శ్రీనగరంలో ఎన్నెన్నో దేవతాగారాలు నిర్మింపజేశాడు. ప్రత్యేకంగా మాతృగుప్తేశ్వరాలయమనే మహేశ్వరాలయం నిర్మింపజేశాడని కల్హణ మహాకవి రాజతరంగిణిలో పేర్కొన్నాడు.

తమ పూర్వుల సంప్రదాయం ప్రకారం మాతృగుప్తుని కొకమారు యజ్ఞం చెయ్యవలెనని సంకల్పం కలిగింది. యజ్ఞసంభారాలు సేకరించడం పూర్తిఅయిపోయింది. అంతలో ఒకనాడు అతని కొక యజ్ఞపశువు దీనాక్రందనం వినిపించింది. వెంటనే ఆ యజ్ఞం నిలిపివేసి మిగిలిన యజ్ఞపశువుల నన్నిటినీ విడిచి పెట్టించివేశాడు. అంతేకాక కాశ్మీర రాజ్యంలో ఏ విధమైన జంతుహింసా జరగ కూడదని నిషేధించాడు!

ఒకసారి హయగ్రీవవధ మహాకావ్యం రచించిన భర్తృమేంఠకవి అతని సందర్శనార్థమై వచ్చాడు.

అది చైత్రమాసం. సూర్యోదయకాంతు లింకా రాజగృహ ద్వారంలో నిలిపిన సువర్ణ మంగళకలశాలపై ప్రతిఫలించలేదు. ఆ సమయంలో కాశ్మీర మహామాత్యునికి కూడా మాతృగుప్తచక్రవర్తి దర్శనం లభించదు. కాని మాతృగుప్తుడు మహాకవి, చక్రవర్తి అనే ఆశతో భర్తృమేంఠకవి ఆ సమయంలోనే అతనిదర్శనానికి వచ్చాడు. అతని ఆశ నిరాశకాలేదు. ద్వారపాలకులు కవి నామధేయం ఉచ్చరించగానే చక్రవర్తి తొందరతొందరగా తన అభ్యంతర మందిరంలో నుంచి సభాభవనంలోనికి వచ్చివేశాడు. భర్తృమేంఠకవి ఈ అపూర్వ గౌరవాని కెంతో సంతోషించాడు.

కవి తన హయగ్రీవవధ మహాకావ్యం పఠించడం ప్రారంభించాడు.

చక్రవర్తి అలాగే శ్రద్ధగా ఆ కావ్యం ఆలకించాడు. ఆ కావ్యపఠనం అలా పదిరోజులదాకా కొనసాగింది. మాతృగుప్తచక్రవర్తి ఆ కావ్యపఠనం జరుగుచున్నంతసేపూ ఒక్కనాడు ఒక్క చిన్న చిరునవ్వైనా చిందించలేదు. అదంతా అలాగే తటస్థదృష్టితో విని ఊరుకున్నాడు. దానితో కవి హృదయంలో వెలిగే ఆశాదీపం కాస్తా కొండెక్కిపోయింది. ఎలాగో అలాగ కావ్యపఠనం పూర్తిఅయింది. కవి తన భూర్జపత్రగ్రంథం విసుగుగా నేలమీద పడవేశాడు. చక్రవర్తి అది చూచి వెంటనే ఆ సమీపంలో ఉన్న బంగారుపళ్ళెరం తీసుకువచ్చి అది అతిభద్రంగా ఆ పళ్ళెరంలో ఉంచాడు. దానితో భర్తృమేంఠ కవికి చక్రవర్తి కా కావ్యంమీద కలిగిన మహాగౌరవం స్ఫురించింది. అతని ముఖం సువర్ణదర్పణంలాగా వికసించింది. తరువాత చక్రవర్తి అతనిని అపార ధనరాసులతో సత్కరించాడని వేరే వ్రాయనక్కరలేదుగదా !

ఆ విధంగా కాశ్మీరంలో మాతృగుప్త చక్రవర్తి పరిపాలన మూడు నెలలు తక్కువగా అయిదుసంవత్సరాల ఒకరోజువరకు నిరంతరాయంగా కొనసాగిందని కల్హణుని రాజతరంగిణి పేర్కొంటున్నది.

అయితే ఆ అవధికి చాలా కాలానికి పూర్వమే ప్రవరసేనుడు తిరిగి కాశ్మీరానికి వచ్చివేశాడు. జీవితంపై తీవ్రవిరక్తితో అతడెన్నెన్నో పుణ్యక్షేత్రాలు సందర్శించాడు. ఆ విరక్తిలో అతనికి కాశ్మీరానికి తిరిగి రావాలనే అనిపించలేదు. తరవాత కర్ణాకర్ణిగా మాతృగుప్తుని పట్టాభిషేకవార్త తెలిసింది. దానితో అతని హృదయంలోని రక్తం అంతా ఒక్కసారిగా రెండు కళ్ళలోకి ప్రవహించింది! పాలవంటి క్షత్రియవంశంలో అవతరించిన క్షత్రియచక్రవర్తులు పరిపాలించే కాశ్మీర రాజ్యంలో ఒక బ్రాహ్మణ కవి పట్టాభిషిక్తుడైనాడు! కాశ్మీర రాజ్యానికీ, కాశ్మీర రాజవంశీయులకూ అది ఎంతటి తలవంపు! అనుకొన్నాడు ప్రవరసేనుడు! వెంటనే విక్రమాదిత్యుని నిర్మూలించివేసి తదనంతరం కాశ్మీరరాజ్యం తిరిగి చేపట్టాలని అతడొక దృఢప్రతిజ్ఞ పట్టాడు. మరుక్షణంలోనే తల్లితో కలిసి కాశ్మీరరాజ్యానికి వచ్చివేశాడు. కాని తనరాక ఎవరికీ తెలియనీయకుండా అతి రహస్యంగా దాచివేశాడు.

అనతికాలంలోనే నిగూఢంగా శ్రీనగరంలో ప్రవేశించాడు. ఇద్దరు ముగ్గురు వృద్ధ కాశ్మీర మంత్రులను రహస్యంగా కలుసుకొని చూచాయగా వారికి తన సంకల్పం తెలియజేశాడు. వారు శాయశక్తులా అతని ప్రతిజ్ఞా నిర్వహణకు సాయపడగలమని వాగ్దానం చేశారు.

"మాతృగుప్తుడు సమర్థుడేనా?" అన్నాడు ప్రవరసేనుడు.

"మేము మొట్టమొదట ఇలాగే శంకించాము. పోనుపోను వారి దక్షత విక్రమాదిత్య చక్రవర్తి శక్తిసామర్థ్యాలనుగూడా మించిపోయిన దేమో అనిపించింది" అన్నాడు మంత్రి.

"ఓహో! అలాగా!"

"వారు కవిమాత్రులని అనుకోవడం కేవలం పొరబాటే!" అన్నా డింకొక మంత్రి.

"ఈ బ్రాహ్మణ కవీశ్వరుని కింతటి శక్తిసామర్థ్యా లెలా కలిగాయో!" అని ఆశ్చర్యపోయాడు ప్రవరసేనుడు.

"ఏదైనా ఉజ్జయినీ మహామాత్యుల వంశంలో ఉద్భవించా రేమో!" అన్నాడు మరిఒక మంత్రి.

ఆటుపిమ్మట మంత్రులందరూ మాతృగుప్త చక్రవర్తిని సదభ్రష్టుణి చెయ్యడ మెలాగా అని ఆలోచించడం ప్రారంభించారు. ప్రవరసేనుడు తమ ప్రథమకర్తవ్యం అది కాదన్నాడు.

"మనం ముందుగా నిర్మూలించవలసింది విక్రమాదిత్య చక్రవర్తిని!"

"ముందుగా వంటఇంటి కుందేటి పనిపట్టడమే సుకరం!" అన్నాడు తిరిగి ఇంకొక మంత్రి.

"కాని మాతృగుప్తునికి విక్రమాదిత్యు డడ్డుపడితే—?"

"ఆ విషయం అప్పుడే ఆలోచించుకోవచ్చును!" అన్నాడు మరి ఒక మంత్రి.

కాని ప్రవరసేనుడు దాని కంగీకరించలేదు. విక్రమాదిత్యుని నిర్మూలనానంతరమే మాతృగుప్తునిపై విప్లవం లేవదీయడం సుకరమనీ, అదే సరియైన మార్గమనీ నిశ్చయించాడు. మంత్రుల కా నిశ్చయమే

సరియైనదని అంగీకరించక తప్పలేదు. వెనువెంటనే మంత్రుల తోడ్పాటుతో విక్రమాదిత్యునిపై దండెత్తి పోవడానికి తగిన సైన్యాలు రహస్యంగా సిద్ధపరచడానికి తగిన ఏర్పాటులన్నీ జరిగిపోయాయి. ఆ ఏర్పాటులన్నీ మొట్టమొదట మాతృగుప్తుని గూఢచారులకు గూడా తెలియనంతటి నిగూఢంగా జరిగిపోయాయి.

# 6

మాతృగుప్తునికి భార్యా వియోగం వల్ల జీవితం ఎంత దుర్భరమైనా, కాశ్మీరరాజ్యకార్యనిర్వహణలో అతడొక క్షణమైనా ఏమరలేదు. ఆవిధంగా నిరంతరం రాజ్యకార్యాలలో మునుగుతూ తేలుతూ ఉండడంవల్లనే అతనికి మనశ్శాంతి బాగా లభించింది. కాని ఏమాత్రం తీరిక దొరికినా ఆవేళలో అతనికి సర్వమంగళ స్ఫురణకు వచ్చేది. వెంటనే అతనికి సార్వభౌమాధికారము, భోగ భాగ్యాలు మొదలైనవన్నీ కేవలం నిస్సారంగా స్ఫురించేవి.

అలా కొంతకాలం గడిచింది. ఒకనాడు మాతృగుప్తుడు తన ప్రాసాదంమీదనించి పరిసరోద్యానవన సౌందర్యం తిలకిస్తున్నాడు. అప్పుడే సూర్యాస్తమయం అయింది. ఆకాశంలో సన్నని చంద్రవంక మెరిసింది. దూరదూరంగా గోచరించే మహాసరోవరంలో అక్కడక్కడ కొన్ని హంసమిథునాలు కదలాడుతున్నాయి. ఆ నిర్మల సరోవరంలో వాటితోబాటు వాటి ప్రతిబింబాలుకూడా ప్రశాంతంగా సాగిపోతున్నాయి. అప్పుడే ఉదయిస్తున్న తారకలా గభీరజలాల్లో వెండిమీనుల వలె తళతళ మెరిసిపోతున్నాయి. అంతలో విశాల సరోవరం అవతలి వైపునుండి ఒక చిన్ననౌక హంసలా నెమ్మదిగా తేలివచ్చింది. దానిలో యువతీయువకు లిద్దరు విహరిస్తున్నారు. ఆ యువతిచేతిలో ఒక పసికందు! నౌక అలికిడికి బెదరిపోయిన రంగు రంగుల మీనులు పైకెగురుతూ తిరిగి నీటిలో మునిగాయి. వెంటనే ఆ సరోవరంలో చిన్నిచిన్ని వర్తులరేఖ లేర్పడ్డాయి. అవి నీటిలో ప్రతిఫలించిన చంద్రవంక కాంతులలో ముత్యాలహారాలలా తళతళ మెరిసిపోయాయి. మాతృగుప్త చక్రవర్తి నేత్రాలా సౌందర్య డోలికలలో ఉయ్యాల లూగాయి.

తరవాత అలా రెండు మూడు నిమిషాలు గడిచిపోయాయి. మాతృగుప్తుని సింహాసనానికి వెనకగా మనోజ్ఞమైన అందెలరవళి వినిపించింది! అత డాశ్చర్యపడి వెనక్కి తిరిగి చూచాడు. ఎదురుగా ఏడువారాల నగలు ధరించిన సర్వమంగళ! ఆమెచేతిలో అయిదేళ్ళ కుమారుడు! ఆమె ఆ పసివాణ్ణి మాతృగుప్తుని కందించింది. అత డెంతో ఆప్యాయంగా ఆ పసివాణ్ని ఎత్తుకున్నాడు. అంతలో అతని కేదో అనుమానం తోచింది. "నీకు బాగా నెమ్మదిగా ఉన్నదా? ఇంత దూరం ఒంటరిగా ఎలా ప్రయాణం చేయగలిగావు సర్వమంగళా?" అన్నాడు. ఆమె ఆమాట కేమీ సమాధానం చెప్పలేదు. అలాగే చిరునవ్వు నవ్వుతూ తిరిగి ఆ పసివాణ్ణి తీసుకొని అక్కడే అదృశ్యమైపోయింది! ఆ క్షణంలోనే మాతృగుప్తునికది యథార్థం కాదనీ, స్వప్నమే అనీ స్ఫురించింది. ఆపైన ఏమిజరిగిందో అతనికి స్పృహ లేదు.

లేచి నాలుగువైపులా పరిశీలించేసరికి చుట్టూరా పరిచారకులు కనిపించారు. వా రనేక విధాలుగా పరిచర్యలు చేసినమీదట అతి కష్టంమీద అతనికి తిరిగి స్మృతి కలిగింది.

చక్రవర్తికి ఎదురుగా మహామాత్యుడు కనిపించాడు. వెంటనే— "విక్రమాదిత్య చక్రవర్తి దేహస్థితి ఎలా ఉన్నది?" అని ప్రశ్నించాడు.

మహామాత్యు డా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. కొంచెంసే పూరుకొని చేతులు జోడించి "మహాప్రభూ! నా దొక్క చిన్న మనవి. సావధానంగా చిత్తగించాలి." అన్నాడు.

"నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పరేల?" అన్నాడు మాతృగుప్తుడు కొంచెం అధికారస్వరంతో.

"మహాప్రభూ! విక్రమాదిత్య చక్రవర్తికి బాగా అస్వస్థతగా ఉన్నదని మనకు తెలిసి పక్షం రోజులే అయింది. అప్పటినుంచి యామయామానికీ వేగరులు ఉజ్జయినికి పరుగులు పెడుతూనే ఉన్నారు. ఈ గడియకు చేరుకోవలసిన వేగరు లింకా తిరిగిరాలేదు. మరి తమకు నే నేమని మనవి చెయ్యగలను!" అన్నాడు.

తరవాత అమాత్యుడు ఒక నిమిషం వరకూ ఏమీ మాట్లాడలేదు. తిరిగి చక్రవర్తి ముఖభంగిమ పరిశీలిస్తూ — "నాదొక్క మనవి!" అన్నాడు.

చక్రవర్తి ప్రశ్నార్థకంగా బొమముడి విరిచాడు.

అమాత్యుడు కొంత సంకోచిస్తూ "తమరు తిరిగి వివాహం చేసుకొని తమవంశం నిలబెట్టవలెనని నా ప్రార్థన" అన్నాడు.

మాతృగుప్తుడు కొంచెం సేపటివరకు మాటలాడ కూరుకుని ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు.

"ఈ విషయం మీ రొకటిరెండుమారులు నాకు విన్నవించి ఉన్నారు ... కాని నేనొక దురదృష్టవంతుణ్ని! ఈ దురదృష్టం ఇంకొకరికికూడా సంక్రమింప జెయ్యనేల ?" అన్నాడు.

వెంటనే మాతృగుప్త చక్రవర్తి ముఖం ఉద్యానవనంవైపు తిప్పి వేశాడు. అమాత్యుని కతని కనుగొలకులలో రెండు చిన్న కన్నీటి బిందువులు స్ఫురించాయి. చక్రవర్తి రాజ్యాధికారం స్వీకరించి అప్పుడే కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. కాని మంత్రికి చక్రవర్తి ముఖంలో ప్ర ప్రథమంగా నేడే బాష్పబిందువులు స్ఫురించాయి! ఆపైన అత డా విషయం మరి ప్రస్తావించడానికి సాహసించలేదు!

అలా ఒక నిమిషం గడిచిపోయింది. ఇంతలో ప్రతీహారి ప్రవేశించి — "ఉజ్జయినీ నగరంనించి వచ్చిన వేగరులు తమ దర్శనం కోరుతున్నారు" అన్నాడు అమాత్యునితో. అత డది వింటూనే వేగరుల వార్తలు తెలుసుకోవడానికి తొందర తొందరగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

మాతృగుప్త చక్రవర్తి కతడు తిరిగి వచ్చేవరకూ క్షణ మొక యుగంలా గడిచింది. అంతలో మంత్రి తిరిగి వచ్చాడు. అతడు మొదట చిరునవ్వు నవ్వాడు. తరవాత ప్రసంగంలో కొంత పూర్వరంగం కల్పించి క్రమ క్రమంగా, నెమ్మది నెమ్మదిగా మాతృగుప్తునికి హర్ష విక్రమాదిత్యుని హఠాన్మరణ వార్త తెలియజేశాడు. మాతృగుప్త డా మాట విని నిలుచున్న పాటుగానే శిలాప్రతిమలా స్తంభించి పోయాడు.

విక్రమాదిత్యుని మృతితో తలవని తలంపుగా తన ప్రతిజ్ఞ నెరవేరిపోయిందని ప్రవరసేనుడు చాలా సంతోషించాడు. తన సైన్యం అంతా ఇక శ్రీనగరంలో విప్లవం లేవదీయడానికి వినియోగించవచ్చుననీ, తద్వారా మాతృగుప్తుని తేలికగా తొలగించ వచ్చుననీ ఆశించాడు. కాని ఇటీవల మాతృగుప్తుడు కూడా సైన్యం సమాయత్తపరిచాడనీ, శత్రువిచ్ఛేదానికి సకల ప్రయత్నాలూ చేస్తున్నాడనీ తెలిసింది. ప్రవరసేనుడు లోలోపల మాతృగుప్తుని జాగరూకత కెంతో మెచ్చుకొన్నాడు. కాని తన ప్రయత్నాల కొక పెద్దవిఘాతం ఏర్పడినదే అని ఎంతైనా మథనపడ్డాడు.

ఆ తరువాత కొన్ని దినాలకు మాతృగుప్త చక్రవర్తి హఠాత్తుగా రాజ్యపరిత్యాగం చేశాడనీ, తాత్కాలికంగా కాశ్మీర రాజ్యపరిపాలన వ్యవహారం అంతా మహామాత్యునికే అప్పజెప్పాడనీ తెలిసింది. మొట్టమొదట ప్రవరసేనుడది విశ్వసించలేదు. పిమ్మట వేగులవారిద్వారా ఆ వార్త నిశ్చయమేనని స్పష్టపడిపోయింది. మాతృగుప్తుడావిధంగా కాశ్మీర రాజ్యసంరక్షణకై బలాలన్నీ సమాయత్తపరిచినా, హఠాత్తుగా రాజ్య పరిత్యాగం చెయ్యడానికిగల కారణమేమో ప్రవరసేనునికి బోధపడలేదు. ఇక కాశ్మీరరాజ్యం కూడా తేలికగా తన హస్తగతమైపోగలదనీ, తన ప్రతిజ్ఞ నెరవేరిపోయినదనీ ఎంతైనా సంతోషించాడు. కాని మాతృగుప్త చక్రవర్తి హఠాత్తుగా రాజ్య పరిత్యాగం చెయ్యడానికి కారణం? అది తెలుసుకోవడం తన ప్రయత్నాల కత్యంతావశ్యకమని ప్రవరసేనుడు నిశ్చయించాడు. వెంటనే మాతృగుప్తుని సందర్శించ వలెనని అనుకొన్నాడు. కాని రాజ్య వ్యవహారాలనుగురించి ప్రసంగించదలుచుకొన్నవారి కెవరికీ మాతృగుప్త చక్రవర్తి దర్శనం లభించడంలేదు! రాజ్య పరిత్యాగం చేసినప్పటినించీ మాతృగుప్తుడు కేవలం కవిపండిత గోష్ఠితోనే కాలక్షేపం చేస్తున్నాడు. రాజ్యవ్యవహారాలు సంప్రదించ దలుచుకొన్నవారి నందరినీ వెంటనే మహామాత్యుని సన్నిధికి పంపించి వేస్తున్నాడు. అందువల్ల పండితవేషంతోనే మాతృగుప్తుని సందర్శించ వలెనని ప్రవరసేనుడు నిశ్చయించాడు.

అటుపిమ్మట విద్వాంసుని వేషం వేసుకొని మాతృగుప్తుని సందర్శనం కోసం బయలుదేరాడు.

అప్పటికి చైత్రం కొంతవరకు గడిచింది. మాతృగుప్తుడు రాజభవన పరిసరోద్యానవన సౌందర్యం తిలకిస్తున్నాడు. రాజప్రాసాదానికి నాలుగువైపులా అల్లిబిల్లిగా అల్లుకొన్న ద్రాక్ష పందిరులపై ప్రాతఃకాల సూర్యకిరణా లప్పుడప్పుడే ప్రసరిస్తున్నాయి. ఆ కాంతులలో ద్రాక్షాఫలగుళుచ్ఛాలు సువర్ణచ్ఛాయలతో మెరుస్తున్నాయి. రంగురంగుల చిలక లా ఉద్యానవనంలో బారులుదీరి విహరిస్తూ చిత్రవిచిత్రమైన వసంతోత్సవతోరణాలలా కదలాడుతున్నాయి.

ప్రవరసేనుడు ద్వారంలో నిలబడి మాతృగుప్తుని ముఖవైఖరి పరిశీలించాడు. అతని విశాలనేత్రాలు ప్రాతఃకాల సౌందర్య శోభలో మునకలు వేస్తున్నట్టున్నాయి. ఒక్క నిమిషం అలాగే నిలబడి ప్రవరసేనుడు మాతృగుప్తునికి నమస్కరించి ఎదురుగా ఒక సుఖాసనంలో కూర్చున్నాడు. కొంత ప్రసంగం గడిచినతరువాత మాతృగుప్తునికి తన నిజనామధేయము, తన జిజ్ఞాస తెలియజేశాడు. మాతృగుప్తుడు దాని కాశ్చర్యపడలేదు. ప్రవరసేనుని రాకవిషయం అత డంతకుపూర్వమే అవగాహన చేసుకున్నాడు. కొంతవరకు మౌనభావం వహించి నెమ్మదిగా ఇలా అన్నాడు:

“మీ రెప్పుడైనా సూర్యకాంత మాణిక్యం పరిశీలనగా చూశారా?”

“చూడకేమి? అయినా ఎందు కలా ప్రశ్నిస్తున్నారు?”

“ఆదిత్యుని అస్తమయంతో సూర్యకాంతమణి దీప్తి తగ్గిపోతుంది. విక్రమాదిత్య చక్రవర్తి అస్తమించినపిమ్మట మరి నాదీప్తీ అంతే!”

అంతటి ప్రభుభక్తి విశ్వాసాలతో అన్న ఆ వాక్యం మొట్టమొదట ప్రవరసేనుని కెంతో ఆశ్చర్యం కలిగించింది. అయినా అది అత డంతగా విశ్వసించలేదు. నెమ్మదిగా ఇలా అడిగాడు:

“మా సైన్యసన్నాహం చూచి తమ రీవిధంగా రాజ్యత్యాగం చేశారేమో అని లోకం భావిస్తున్నది. నిజమేనా?”

"లోక ప్రవాదానికి నేనాశ్చర్యపడడం లేదు. ఆ ప్రవాదం మీ వంటివారు విశ్వసించినందుకే నే నాశ్చర్యపడుతున్నాను. అయినా మించిపోయినదేమీ లేదు! రణరంగంలో ఒకసారి బలాబలాలు పరీక్షించుకుందాము. సరేనా?" అని మాతృగుప్తుడతనివైపు చూచాడు.

ప్రవరసేనునికి తన తప్పిదం తెలిసిపోయింది. మాతృగుప్తుని ఔదార్యంతోబాటు నేడతని ధైర్యసాహసాలు కూడా చవిచూచాడు.

ఒక నిమిషంవరకూ అత్యాశ్చర్యదృష్టితో అతని ముఖం పరిశీలించాడు. మాతృగుప్తుడు ఒక్క చిన్న నవ్వు నవ్వి ఇలా అన్నాడు:

"విక్రమాదిత్య చక్రవర్తి కేవలం కవితా గౌరవంతో నాకీ సామ్రాజ్యప్రదానం చేశారని మీరు భ్రమిస్తున్నారు! ఒక్క సంవత్సరం పాటు అహోరాత్రాలూ నా దక్షత పరీక్ష చేసినమీదటే నాకీ సామ్రాజ్య ప్రదానం జరిగింది."

ప్రవరసేనుని కా విషయం మరింత ఆశ్చర్యం కలిగించింది. అతని హృదయంలో మాతృగుప్తునిమీదా, అతని అర్హతమీదా కలిగిన అపోహ లన్నీ ఒక్కసారిగా పటాపంచలైపోయాయి. క్రమక్రమంగా ఇంతటి మహితాత్ముడే ఇంకా కాశ్మీరం పరిపాలించడం సముచితమనే గౌరవ భావం కూడా కలిగింది.

"తెలియక నేనేమో ప్రసంగించాను! నన్ను మన్నించండి!" అన్నాడు. దానిమీద మాతృగుప్తుడు—"రాజ్యత్యాగం చేసినా నా ఔద్ధత్యం ఇంకా నన్ను విడిచిపెట్టలేదు! ఇందువల్ల మొట్టమొదటగా మీరు మన్నించవలసినది నా ఔద్ధత్యమే!" అన్నాడు.

ఆ వినయప్రసంగంతో ప్రవరసేనుని కంఠం స్తంభించిపోయింది. ఒక దేవతామూర్తిని చూచినట్లు మాతృగుప్తునికేసి చూచి సవినయంగా ఇలా అన్నాడు:

"విక్రమాదిత్యులు మీకీ రాజ్యప్రదానం చేసిన హేతువేమో ఇప్పుడిప్పుడే నాకవగతమయింది. వారు చేసినట్టుగానే నేనుకూడా ఈ కాశ్మీరరాజ్యం తిరిగి మీకర్పిస్తున్నాను. దయుంచి నా ప్రార్థన మన్నించవలసినదని కోరుతున్నాను!" అన్నాడు.

"మీరు కొంచెం పొరబడుతున్నారు. ఒక చక్రవర్తి ఇతరుల దగ్గర దానం స్వీకరించగలడా? ఇది తెలిసిఉండీ మీరిలా ప్రార్థించడం భావ్యమేనా?" అని ఒక చిరునవ్వు నవ్వాడు మాతృగుప్తుడు. ఆటుపిమ్మట ప్రవరసేనునికి మాతృగుప్తుని యెడల పూజ్యభావం ఇనుమడించింది. ఎలాగైనా తన ప్రార్థన మన్నించవలసినదని అనేక విధాలుగా ప్రాధేయపడ్డాడు. దానికి మాతృగుప్తు డొక్క నిట్టూర్పు విడిచి నెమ్మదిగా ఇలా అన్నాడు:

"ప్రవరసేనా! నా జీవిత సహధర్మచారిణి సర్వమంగళ, ఏకైక వంశాంకురము దివంగతులైనారు. కవితా ప్రియులైన విక్రమాదిత్య చక్రవర్తులు స్వర్గానికి విజయంచేశారు. బాల్యంనుంచీ కవిచక్రవర్తిని కావలెనని ఆకాశహార్మ్యాలు నిర్మించుకొన్నాను! అవన్నీ నేలపాలై పోయాయి. మరి నేను దేనిని చూచుకొని ఈ సామ్రాజ్యభారం వహించను!"

"మీరు కాశ్మీరప్రజ విషయమే విస్మరిస్తున్నారు!"

"లేదు! ఇకనించి సర్వసమర్థులైన మీరే ప్రజాపరిపాలకులు!" అన్నాడు మాతృగుప్తుడు.

"అది ఎన్నటికీ జరగనేరదు. తాము జీవించి ఉన్నంతకాలము తమరే కాశ్మీరాధీశ్వరులు! మేమంతా మీ భృత్యులమే!"

అని చెప్పి ప్రవరసేనుడు నెమ్మదిగా అక్కడినించి వెళ్ళిపోయాడు.

చక్రవర్తి ప్రవరసేనునిలో హఠాత్తుగా కలిగిన అద్భుత పరిణామానికెంతో ఆశ్చర్యపడ్డాడు.

ఆటుపిమ్మట నాలుగైదు రోజులకు మాతృగుప్తుడు సన్న్యసించాడనీ, వెంటనే వారణాసీ నగరానికి వెళ్ళిపోయాడనీ ప్రవరసేనుని కొక వార్త తెలిసింది. అనంతరం మాతృగుప్తుని ఆజ్ఞాప్రకారంగా కాశ్మీర మహామాత్యుడు రాజ్యాధికారం స్వీకరించవలసినదని ప్రవరసేనుని ప్రార్థించాడు. ఆ పరిస్థితులలో ప్రవరసేనుని కది స్వీకరించక తప్పలేదు.

మాతృగుప్తుడటుపిమ్మట పది సంవత్సరాలు జీవించాడు. అంతవరకూ ప్రవరసేనుడు మాతృగుప్తుని ప్రతినిధిగానే కాశ్మీరరాజ్యం పరిపాలించాడు. కాశ్మీరరాజ్యాదాయం అంతా మాతృగుప్తునికే పంపించేవాడు. మాతృగుప్తుడా ఆదాయంఅంతా తిరిగి కాశ్మీరానికే పంపించి, దానిలో స్వల్పాదాయం మాత్రమే స్వీకరించి, అది విద్వాంసులకు, కవీశ్వరులకు, యతీశ్వరులకు, యాచకులకు, దీనులకు దానం చేసేవాడట!

పామరులు విశ్వసింపలేరనే భయంతో విశ్వసనీయమైన యథార్థ విషయాలే వ్రాస్తున్నానని కల్హణుడు రాజతరంగిణి పీఠికలో పేర్కొన్నాడు! ఆ కల్హణుడే విక్రమాదిత్య మాతృగుప్త ప్రవరసేనుల చరిత్రలు మూడూ మూడు పునీతమార్గాలలో ప్రవహించిన ఆకాశ గంగానదీ ప్రవాహాలవంటివని ముక్తకంఠంతో ప్రశంసించాడు!



# రాజ్యాభిషేకం

## 1

భీమ దుర్యోధనుల చిత్రవిచిత్ర గదాయుద్ధ కౌశలం ప్రేక్షకులనందరినీ దిగ్భ్రాంతిలో ముంచివేసింది. వారి నిద్దరినీ మాటిమాటికీ ప్రో-కంగా అభినందించే కురువృద్ధుల జయజయ ధ్వానాలు మిన్నందుకొన్నాయి.

కౌరవ పాండవకుమారుల అస్త్రవిద్యాభ్యాసం పూర్తికాగానే ద్రోణాచార్యుడు వారి అస్త్రవిద్యాకౌశలం పరిశీలించవలసినదని సవినయంగా ధృతరాష్ట్ర చక్రవర్తికి విన్నవించుకొన్నాడు. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి, భీష్ముడు మొదలైన కురువృద్ధులంతా తమకోసం ప్రత్యేకంగా ఏర్పరిచిన సింహాసనాలమీద సమాసీనులై అత్యద్భుతమైన కుమారుల అస్త్రవిద్యా ప్రదర్శన కెంతో ఆనందించారు. విదురుడు అంధ దంపతు లిద్దరికీ ఆయా కౌరవ పాండవ కుమారుల అస్త్రవిద్యా చాతుర్యాలు వేర్వేరుగా విన్నవిస్తూంటే వారిద్దరూ అదంతా ప్రత్యక్షంగా చూచినట్టే ఆనందించారు. అంధులైన వారి కనుగొలుకులలో ఆనంద బాష్పా లొక్కమారుగా ఆవిర్భవించాయి. కుమారుడు భీమసేనుని గదాయుద్ధకౌశలం చూచి కుంతి ఎంతైనా సంతోషపడింది.

క్రమక్రమంగా ప్రాతఃకాల సూర్యకిరణాల కాంతులు భీమ దుర్యోధనుల గదాదండాలపై ప్రచండంగా ప్రకాశించాయి. వారిద్దరూ ఒక రొకరికి తీసిపోకుండా అలాగే నిలిచి గదాయుద్ధం కొనసాగించారు.

అలా కొంతసేపు గడిచిపోయేసరికి సభాస్తారుల జయజయ ధ్వానా లింకా బాగా ఎక్కువైపోయాయి. వారంతా అంతకుపూర్వం అనేకమంది కురుకుమారుల అస్త్రవిద్యాచాతుర్యాలు పరిశీలించారు. అవన్నీ అత్యాశ్చర్యకరంగానే ఉన్నాయి. కాని భీమ దుర్యోధనుల గదాయుద్ధఘోరణే వేరు. కనుకనే సభాస్తారుల అభినందన ధ్వానా లావిధంగా ఆకాశం అందుకున్నాయి.

భీమ దుర్యోధనుల గదాయుద్ధంలో ఇంకొక విడ్డూరం పుట్టింది. ఇంతకు పూర్వం సభాసదులంతా అస్త్రవిద్యాచాతుర్యం మెరయించిన కౌరవపాండవ కుమారులందరినీ అభినందిస్తూ జయజయధ్వానాలు చేశారు. కాని ఇప్పుడు సభలోనివారంతా రెండు పక్షాలుగా చీలిపోయారు. కొందరు ప్రత్యేకంగా భీమసేనుణ్ణి అభినందిస్తూ హర్షధ్వానాలు చేశారు; మరికొందరు దుర్యోధనుణ్ణి అభినందిస్తూ హర్షధ్వానాలు చేశారు.

క్రమక్రమంగా సభ్యులలో పక్షపాతాలు బాగా పెచ్చు పెరిగి పోయాయి. భీమ దుర్యోధనులు కూడా మరింత పట్టుదలతో పెనగు లాడడం ప్రారంభించారు. అలా ఎంతసేపు పోరాడినా వా రొకరొకరికి కొంచెమైనా తీసిపోలేదు. వారిద్దరూ మరింత అభినివేశంతో పోరా డటం మొదలుపెట్టారు. అభినివేశాలు చూచినకొద్దీ సభ్యులలో క్రోధావేశాలు, ప్రతిజ్ఞలు, పట్టుదలలు మరింత పెచ్చుపెరిగిపోయాయి.

ద్రోణాచార్యుడా వ్యవహారం అంతా బాగా జాగరూకతతో పరిశీలిస్తూనే ఉన్నాడు. క్రమంగా భీమదుర్యోధనుల గదాయుద్ధం శ్రుతిమించిపోగలదనీ, కురువృద్ధులకు మనస్తాప హేతువు కాగలదనీ ఆచార్యునికి భయం వేసింది. వెంటనే అతడు గదాయుద్ధం విరమించ వలసినదని అశ్వత్థామ ద్వారా వారిద్దరికీ ఆజ్ఞాపించాడు. తిరిగి సభలో జయజయధ్వనాల కలకలం చెలరేగింది. క్షణంలో భీమదుర్యోధను లిద్దరూ తమ గదాయుద్ధం విరమించివేశారు.

ఆచార్యుడు క్షణంలో రంగ మధ్యంలో నిలబడ్డాడు. తన ప్రియాంతేవాసి అర్జునుని ధనుర్విద్యా కౌశలం కళ్ళారా చూచి ఆనందించవలసిందని కురువృద్ధు లందరికీ సవినయంగా విన్నవించాడు. అర్జును డంతలోనే విల్లమ్ములు ధరించి రంగమధ్యంలో నిలబడ్డాడు.

బంగారు కవచం ధరించిన అర్జును డా సభామధ్యంలో నిలబడగానే సదస్యు లందరూ చకితులై క్షణకాలం రెప్పపాటు లేకుండా అతనివైపే తిలకించారు. నీలమేఘ శ్యామలమైన అర్జునుని శరీరంమీది సువర్ణ కవచం నల్లనల్లని మబ్బుపై మెరిసే మెరుపులా తళ తళ లాడింది. అర్జును డంతలోనే తన ధనుర్విద్యా కౌశల ప్రదర్శన మపక్రమించాడు.

ఆ శూరుని అస్త్రవిద్యా కౌశలం కురువృద్ధు లందరినీ ఆశ్చర్య సాగరంలో ముంచివేసింది. జయజయధ్వానాల కలకలంతో సదస్యుల చెవులు గళ్ళుపడిపోయాయి. ఆ సమయంలో కుంతీదేవి ఆనందాని కిక అంతేలేదు! ఆమె నేత్రాంతాలలో ఆనంద బాష్పా లవిరళధారలుగా ప్రవహించాయి. ఆ కలకలం విని ధృతరాష్ట్రు డదిరిపడి దానికి కారణ మేమని విదురుణ్ణి ప్రశ్నించాడు. విదురు డర్జునుని అపూర్వ చాతుర్య ధోరణి అంతా ఆవృద్ధ నృపతి కెరిగించాడు.

ఆ ఆనందవార్త వినగానే ధృతరాష్ట్రుని కంఠం గద్గద భారంతో వణికిపోయింది.

"నేటికిగదా నా వీనులకు సాఫల్యం కలిగింది! కుంతీ కుమారులు త్రేతాగ్నుల్లా ప్రజ్వలిస్తూ ఇక మా కురుకులదురితం అంతా నిశ్శేషంగా నశింపజేయగలరు!"

అని అనేక విధాలుగా కౌంతేయులను, తత్రాపి అర్జునుణ్ణి అనేక విధాల ప్రశంసించాడు. అర్జును డా సమయంలో అనేకమైన దివ్యాస్త్రాలు ప్రయోగించి అపూర్వమైన తన అస్త్రచాతుర్యం మెరయింపజేశాడు. అత్యద్భుతమైన ధోరణులలో, అనేక చిత్రవిచిత్ర గతులలో బాణపరంపరలు ప్రయోగించాడు. అతని చాతుర్యం తిలకిస్తున్న సభాస్తారుల కిక శరీరాలపై స్మృతులే సడలిపోయాయి.

అంతలో రంగద్వారంలో ఒక భయంకరమైన భుజాస్ఫాలనం వినిపించింది. అత్యాశ్చర్యంతో అర్జునుని అస్త్రచాతుర్యం తిలకిస్తున్న సభ్యులందరి చూపులూ ఒక్కమారుగా అటువైపు తిరిగాయి.

బాల సూర్యునివలె ధగద్ధగాయమానంగా వెలిగిపోతూ కర్ణుడక్కడ ప్రత్యక్షమైనాడు. అతని చెవుల సహజకుండలాలు రెండు రెండు నక్షత్రాలలా ప్రకాశించాయి.

కర్ణుడు రంగద్వారంలో నిలబడినవారి నందరినీ ఒ త్తిగించుకుంటూ క్షణంలో రంగమధ్యానికి వచ్చి, ముందుగా కృపాచార్యునికి, ద్రోణాచార్యునికి సవినయంగా నమస్కరించాడు. వెంటనే అర్జునునివైపు తిరిగి వర్షాకాలమేఘంలా గర్జించాడు :

"నీ వొక్కడవే ఈ మహాస్త్రవిద్యలన్నీ నేర్చుకొన్నానని విర్రవీగుతున్నావేమో! వీటిలో కొన్నింటిని నేనూ అభ్యసించాను. నీవు చేసిన అద్భుతాలన్నీ నేనూ చేసి చూపించగలను. అవి చూచిన ఈ పెద్ద లంతా ఇంతకన్నా ఆశ్చర్యపోతారు."

ఆ పరుషవచనాలు వినీవిన నే అర్జునుని కెంతైనా కోపంవచ్చింది. కాని దుర్యోధను డామాటలు విని సంతోషంతో ఉబ్బితబ్బిబ్బై పోయాడు.

వెంటనే కర్ణుడు ద్రోణుని అభ్యనుజ్ఞ తీసుకొని అర్జునుడు ప్రదర్శించిన అద్భుతాలన్నీ ప్రదర్శించాడు. అతని అద్భుతశక్తి చూచి అక్కడి వారంతా శిలాప్రతిమల్లా నిశ్చేష్టులైపోయారు. ఆ అపూర్వ చాతుర్యం వేనోళ్ళ ప్రశంసించారు.

దుర్యోధను డానందం పట్టలేని అత్యాదరంతో అతన్ని గాఢంగా కౌగలించుకొన్నాడు :

"కర్ణా! ఈ క్షణం నించీ నాతో చెలిమి చెయ్యవలసిందని నిన్నభ్యర్థిస్తున్నాను. నాకు, నా బంధువులకు హితైషివై నా కౌరవ రాజ్యం అంతా స్వయంగా నడిపించవలసిందని నిన్ను ప్రార్థిస్తున్నాను."

అని ఎంతో ఆప్యాయంగా కర్ణుణ్ణి ప్రార్థించాడు. దుర్యోధను డంతటివాడు తన్నావిధంగా ప్రార్థించినందుకు కర్ణుని హృదయం ఆనందసాగరమై ఉప్పొంగింది.

"నా అస్త్రచాతుర్యానికి నీవింతగా ఆశ్చర్యపడవలసినది ఏమి ఉంది? మీ అందరి ఎదుటా పార్థునితో కలిసి ద్వంద్వయుద్ధం చెయ్యాలని నే నెంతో కాలంగా ఉబలాటపడుతున్నాను! అదే నా కోరిక."

అనతి దూరంలో నిలబడి అదంతా తిలకిస్తున్న అర్జునుని కా మాటలు వినిపించాయి. అంతవరకూ తనలో బయలుదేరిన ఆగ్రహం అంతా లోలోపలే నిగ్రహించుకొన్న అర్జునుడిక ఓరిమి వహించలేక పోయాడు:

"పిలవనిదే, తగుదునమ్మా అని ఇక్కడికి సిద్ధమై నీ యిష్టం వచ్చినట్లు కారుకూతలు కూస్తున్నావా? తులువా! నీకు పరాత్మతారతమ్య జ్ఞానం బొత్తిగా లోపించిపోయిందే!"

అదివిని కర్ణుడంతకన్నా రెచ్చిపోయాడు:

"ఈ మాటల కేమిలే! నీనోటికి తగిన సమాధానం నా శస్త్రాస్త్రాలతో ఇస్తున్నాను. రా!"

అని గట్టిగా గర్జించాడు. అంతటితో ఊరుకోలేదు:

"ఈ రంగభూమి కొకరు పిలవవలసిన అవసరం ఏమి ఉంది! వీరవరేణ్యు లందరూ ఇక్కడికి రావడాని కర్హులే! ఇక్కడికి రాకూడదని అడ్డగించడాని కింకొకరికీ అధికారం లేదు."

అని యుద్ధ సన్నద్ధుడై అర్జునుని మీదిమీదికి వెళ్ళిపోయాడు.

దుర్యోధను డా విధంగా కర్ణునికి ద్వంద్వయుద్ధాని కనుజ్ఞ ఇవ్వడంలో ఆశ్చర్యంలేదు. కర్ణు డా విధంగా ఉరకలు వేసుకుంటూ మీదిమీదికి వచ్చి పడుతున్నప్పు డిక ఉపేక్షించి ఊరుకోవడం పాండవుల కెవ్వరికీ భావ్యంగా కనిపించలేదు. వారుకూడా ఆ ద్వంద్వయుద్ధాని కర్జునుని కనుజ్ఞ ఇచ్చారు.

వెంటనే ఆ ఇద్దరి మధ్య భయంకరమైన ద్వంద్వయుద్ధం ప్రారంభమైంది. వారిద్దరూ ఒకరొకరిమీద ఘోరాస్త్రాలు ప్రయోగించుకొన్నారు.

ఆ ద్వంద్వయుద్ధ ప్రారంభంతో సభ్యులందరిలోనూ పక్షపాతాలు బాగా బలిసిపోయాయి. ధృతరాష్ట్ర చక్రవర్తి, మిగిలిన కౌరవ కుమారులూ కర్ణునియెడల పక్షపాతం వహించారు. ద్రోణాదు లంతా అర్జునునియెడల పక్షపాతం దాల్చారు. అయి ఆ పక్షపాతాలు పైకి మాత్రం బాహాటంగా వెల్లడి కాలేదు. అవి జయజయ ధ్వానాలలోనే అణిగిపోయాయి.

అంతలో కర్ణుని మేఘాస్త్రం కమ్ముకుని అర్జును డదృశ్యుడై పోయాడు. అదిచూచి కుంతీదేవి దుఃఖం కుమిలిపోతూ కూర్చున్నపాటుగానే నేలమీది కొరిగిపోయింది. విదురు డామెకు శీతలోపచారాలు చేయించి నెమ్మదిగా ఓదార్చాడు. అర్జునుడు వాయవ్యాస్త్రం ప్రయోగించి తనపై కమ్ముకొన్న కారుమేఘాల నన్నిటిని ఒక కనురెప్పపాటుకాలం చెదరగొట్టి వేశాడు. కుంతీదేవి తిరిగి సేదదేరింది.

అంతలోనే కర్ణార్జును లిద్దరికీ శస్త్రాస్త్రాలతో తిరిగీ భయంకరమైన ద్వంద్వయుద్ధం ప్రారంభమైంది.

కృపాచార్యుడు ద్వంద్వయుద్ధం మర్యాదలన్నీ తెలిసిన మనీషి. అతడు భయంకరంగా సాగిపోతున్న కర్ణార్జునుల ద్వంద్వ యుద్ధం క్షణకాలం అతి జాగ్రత్తగా పరిశీలించాడు. వారియుద్ధం అంతటితో ఆగిపోయేటట్లు కనిపించలేదు. వెంటనే మెరుపులా వచ్చి వారిద్దరి మధ్యా నిలుచున్నాడు. తక్షణం ఆ ద్వంద్వయుద్ధం ఆపివేయవలసిందని ఆజ్ఞాపించాడు :

"కర్ణా! అర్జునుడు కుంతీదేవి కుమారుడు. పాండవులకు శ్రేష్ఠుడు. నీ వితనితో యుద్ధం కొనసాగించే పక్షంలో ముందుగా నీ కులగోత్రాలు తెలియజెయ్యడం ం ఆ పైన అర్జునుడు నీ కెదురుగా నిలిచి పోరాడగలడు. అంతవరకు ఈ ద్వంద్వయుద్ధం ధర్మసమ్మతం కాదు"

ఆ మాటలు వినగానే కర్ణుని చేతులలోని విల్లమ్ము లప్రయత్నంగా జారి నేలమీద పడిపోయాయి. అతడు సూతకులజుడు. తన కుల గోత్రా లుచ్చరించడానికే అతనికి నోరాడలేదు. వల్లమాలిన సంకోచంతో అతని శిరస్సు నేలవైపు ఒరిగిపోయింది.

అది చూచి దుర్యోధనుడు కృపాచార్యుని సన్నిధికి వచ్చి విరుచుకు పడ్డాడు:

"ఆచార్యా! రాజ్యాధిపత్యానికి మూడు విధాలైన అర్హత లున్నాయని పెద్దలంటారు. కులీనుడు, శౌర్యవంతుడు, సేనాబలశాలి రాజ్యాధిపత్యాని కర్హులు. కర్ణుడు రాజు కాకపోవడంవల్లనే ఇత డర్జునునితో ద్వంద్వ యుద్ధాని కనర్హుడని తాము సెలవిస్తున్నారు. నేనీ క్షణం లోనే కర్ణుని కంగరాజ్యాభిషేకం చేస్తున్నాను."

అని, భీష్మ ధృతరాష్ట్రుల అభ్యనుజ్ఞ స్వీకరించి వెంటనే కర్ణునికి అంగ రాజ్యాభిషేక సన్నాహాలు చేయించాడు.

క్షణంలో కర్ణుణ్ణి బంగారు సింహాసనం మీద కూర్చోబెట్టి సకల రాజచిహ్నాలతోను, మర్యాదలతోను అతని కంగరాజ్యాభిషేకం చేయించాడు. వేలకొలది భూసురులకు గోసహస్రాలు దానాలు చేయించాడు. అక్షతలతోబాటు భూసురుల ఆశీర్వచన సహస్రాలు కోకొల్లలుగా కర్ణుని శిరస్సుపై వర్షించాయి.

ఆ మహాగౌరవానికి కర్ణు డెంతో ఆనందించి దుర్యోధనుని గాఢంగా కౌగలించుకొన్నాడు.

"ఇంతటి మహాగౌరవం చేసిన నీ ఋణం నే నే విధంగా తీర్చుకోగలను!" అని అత్యాదరదృష్టితో దుర్యోధనుని వైపు చూచాడు.

"కర్ణా! నీ సఖ్యమే నేను కోరుకొనే వరం!" అన్నాడు ఆయన.

కర్ణుని జనకుడు–సూతు డిది చూచి నిలువునా నిర్ఘాంతపోయాడు. ఎక్కడో దొరికిన తన శిశు వీనా డింతవాడై నాడు గదా అని పరమానందభరితుడై నాడు. కర్ణుణ్ణి కౌగలించుకొని ఆనందాశ్రువులతో అతని శిరస్సు తడిపివేశాడు.

భీమసేనుని కా మహోత్సాహం చూచీ చూడగానే ఒక్కసారిగా అరికాలిమంట నెత్తికెక్కింది. కర్ణునివైపు తిరిగి ఒక్క విషపు నవ్వు నవ్వాడు:

"తోలు కర్ర చేతబట్టి రథము తోలుకోవలసిన నీకు అర్జునునితో సరిసమానంగా ఎదుట నిలిచి పోరాడే అర్హత ఎక్కడనించి వస్తుంది?

"ఇక ఈ క్షణంనించీ అంగ రాజ్యాధిపతి నైనానని విర్రవీగుతున్నావేమో! అది ఉత్తమ క్షత్రియరాకుమారులు చేపట్టవలసిన రాజ్యం! మంత్రపూతమైన పురోడాశం భక్షించే అర్హత యాజకునికే గాని కుక్కకెక్కడిది?"

అని కర్ణుణ్ణి గడ్డిపరకలా ఈసడించి వేశాడు. పాపం! కర్ణుని కా సమయంలో ఏమనడానికీ పాలుపోలేదు. వెలవెలబోయిన ముఖంతో ఆకాశంవైపు చూస్తూ నిలుచున్నాడు.

అంతలోనే దుర్యోధనుడు మళ్ళీ భీమునిమీద విరుచుకుపడ్డాడు.

"భీమా! నీ వీ విధంగా మాట్లాడడం న్యాయమేనా? లేడి కడుపున పులి పుట్టడం ఎక్కడైనా విన్నామా? ఇంతటి మహా తేజశ్శాలి అధమాన్వయంలో జన్మిస్తాడా? అదీకాక మహావీరుల పుట్టుపూర్వోత్తరా లెవరు నిర్ణయించగలరు? కుమారస్వామి జెల్లులో జన్మించలేదా? ద్రోణాచార్యులు కుంభంలో జన్మించలేదా? అంతవర కెందుకు? మీ రంతా ఎలా జన్మించారో ప్రపంచానికే తెలియదా?

"కర్ణుడు అంగరాజ్యానికేగాదు, భూమండలానికంతటికీ ఏకచ్ఛత్రాధిపత్యం వహించగల దక్షుడు!"

అని కర్ణుణ్ణి స్వయంగా తన వెంట రాజగృహానికి తీసుకుపోయాడు.

కుంతీదేవి హృదయంలో కర్ణుణ్ణి గురుతుపట్టింది. కాని ఆ రహస్యం పైకి వెల్లడించడాని కిష్టంలేక తెలిసీ తెలియనట్టుగా మాట్లాడ కూరుకొన్నది.

'ఇంతకాలానికి అర్జునుని కెదురుగా నిలిచి నీవా నేనా అని పోరాడగల వీరాధివీరుడు లభించాడు గదా' అని దుర్యోధనుడా నాటి రాత్రి గుండెలమీద చెయ్యి వేసుకొని హాయిగా నిద్రపోయాడు.

# భాగ్యశాలిని

## 1

"అమ్మా! ధర్మం తల్లీ!"

శ్రావస్తీనగరంలో రత్నవర్ధన శ్రేష్ఠి భవంతి ప్రాంగణంలో నిలబడిన ఒక బిచ్చగత్తె అలాగే రెండు మూడు మారులు గొంతెత్తి పిలిచింది.

"భోజనాల వేళ ఇప్పుడు బిచ్చం వెయ్యడానికి వీలులేదు పో!"

గట్టిగా కసిరికొట్టాడు భవంతి వీధిగుమ్మంలో నిలబడిన ద్వారపాలకుడు.

నిజానికప్పటికి రత్నవర్ధన శ్రేష్ఠి భవంతిలోని వారందరూ సుష్ఠుగా భోజనాలు ముగించారు.

శ్రేష్ఠి ప్రాసాదం పై అంతస్తులో సుఖంగా హంసతూలికాశయ్యకానుకుని కూర్చుని ఆ బిచ్చగత్తెవైపు పరిశీలనగా చూచాడు.

ద్వారపాలకుడు ఆమెవైపు గుడ్లురిమిచూచి మళ్ళీ గట్టిగా కసిరాడు. తిరిగి ఆమె అతన్ని బతిమాలుతుంది :

"మా ప్రాణాలకి మాయదారి కాటకం దాపరించడం మూలాన మేమిలా పట్టెడన్నంకోసం పాకులాడవలసిన అవసరపట్టింది బాబూ! లేకపోతే మేమింతగా ప్రాధేయపడతామా? మేమెప్పుడైనా

మీ గుమ్మంముందు నిలబడి ఇలా దేవురించామా?...పోనీ, ఈ పసివాళ్ళ కైనా పట్టెడన్నం పెట్టించండి!"

పసివాళ్ళనిద్దరిని ముందుకు నెట్టి ద్వారపాలకుని వైపు పతిజాలిగా చూసింది భిక్షుకి. దానితో అతడు తన అధికారానికి గట్టిదెబ్బ తగిలిందని అహంకరించాడు.

'ఇన్ని మారులు చెప్పినా నామాట కెదురు తిరుగుతుందా నిర్భాగ్యురాలు!' అనుకుని ఆమె మీది మీదికి వెళ్ళి విరుచుకు పడ్డాడు:

"నీకు కాదూ చెప్పేది? పో! పో!"

భవంతి ద్వారం దభాలున మూసివేసి లోపలికి వెళ్ళిపోయాడా ద్వారపరిచారకుడు.

"పోనీలే! బాబూ! ఇంత మాత్రానికంత కోపమెందుకు నాయనా! వెళ్ళిపోతానులే!"

ఒక్క చిరునవ్వు నవ్వి ఆమె ఆ పసివాళ్ళ నిద్దరినీ వెంటబెట్టుకొని మిట్ట మధ్యాహ్నం మండుటెండలో మరి ఒక భవంతి ద్వారం దగ్గరికి వెళ్ళిపోయింది.

శ్రేష్ఠి భవంతి పై అంతస్తులో ఆపసోపాలు పడుతూ ఆమె చిరునవ్వునవ్విన తీరు తలుచుకుని కొంచెం మథనపడ్డాడు.

సామాన్యంగా యాచకులు మెడపట్టుకుని గెంటినా చూరుపట్టుకుని వేళ్ళాడతారు. ఒకపట్టాన మరి విడిచిపెట్టరు! ముష్టి వెయ్యకపోతే అనేకవిధాల శాపనార్థాలు పెట్టందే మరి అక్కడనించి కదలరు.

తత్రాపి అవి గడ్డు కరువురోజులు. ఆ పిల్లలిద్దరూ ఆకలితో నకనక లాడుతున్నారు. అయినా ఆ బిచ్చకత్తె పరుషంగా పల్లెత్తు మాటయినా అనలేదు. పైగా లీలగా ఒక్క చిరునవ్వు నవ్వి అక్కడినించి వెళ్ళిపోయింది.

ఆ ధోరణి చూచి 'ముష్టెత్తుకోవడం ఆమె కంతగా అలవడలే'దని శ్రేష్ఠి గ్రహించుకొన్నాడు. ఆమె వెళ్ళిపోయాక ఆ పసివాళ్ళిద్దరికీ పట్టెడన్నం పెట్టించాలని అనుకోకపోలేదు. అంతలోనే పరిచారకుడు దభాలున ఆ భవంతి తలుపు మూసివెయ్యడము, ఆమె వెంటనే అక్కడినించి వెళ్ళిపోవడము జరిగిపోయాయి.

శ్రేష్ఠి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు:

"దేశంలో ద్వాదశవర్ష క్షామమే పట్టుకున్నట్టుంది. ఎంతమంది కని ముష్టి వెయ్యగలం! మేము మాత్రం సంసారులం కామా! ఇంతకీ ఎవరి ప్రారబ్ధాని కెవరు కర్తలు! అంతా ఆ పరమేశ్వరలీల!"

మనస్సులో ఒకమారు పరమేశ్వరధ్యానం చేసుకుని ఆ విధంగా సమాధాన పడ్డాడు శ్రేష్ఠి.

అయినా అతని మనస్సులో చూచాయగా కొంచెం కించ కలగక పోలేదు. సింహద్వార పాలకుణ్ణి పిలిచి నెమ్మదిగా అడిగాడు:

"ఇందాకా నీవు పంపించి వేసిన ఆ బిచ్చగత్తె నెక్కడో కొంచెం తీలగా చూచినట్టే ఉందే!"

"అవును బాబూ! ఆ అమ్మ ఈ మధ్యనే బిచ్చానికి బయలు దేరింది. పూర్వం మన పశువుల కొట్టంలో పనిచేసిన పెద్దగొల్ల కూతురు సుప్రియ. తెల్లారి లేచింది మొదలు ఊరంతా ముష్టివాళ్లే! ఎంతమంది కని ముష్టి వెయ్యగలం!"

"అవునుగాని ఆ పసివాళ్ళెవరు?"

"ఎవరో దిక్కు మొక్కు లేకుండా వీధులమ్మట తిరిగే పసివాళ్ళ నిద్దరిని వెంట బెట్టుకుని ముష్టికి బయలుదేరి ఉంటుంది. తనొక్కర్తీ వస్తే ముష్టి వెయ్యరని భయమేమో!"

"పోనీ, పట్టెడన్నం పడవేయించలేక పోయావా? చేత్తో లేదంటే పోయేదిగా!"

"ఎంతమంది కని వెయ్యగలం బాబూ! తెల్లవారింది మొదలు పొద్దస్తమానమూ ఒకటే కాకిగోల!"

"నిజమే మరి! పైగా ఈ ఏడాది ఈ వల్లమాలిన కరువొకటి వచ్చిపడింది! ఎంతమందికని వెయ్యగలం!"

అంటీ అంటనట్టుగా నిట్టూర్చాడు శ్రేష్ఠి. అప్పటికి తన మీద విరుచుకు పడబోయే నింద తప్పిపోయిందిగదా అని చల్లచల్లగా అక్కడి నించి జారుకున్నాడు పరిచారకుడు. శ్రేష్ఠి మళ్ళీ నిట్టూర్చాడు.

రత్నవర్ధనుడు శ్రావస్తీనగరంలో అంతటా బాగా పేరుమోసిన పెద్ద శ్రేష్ఠి. రత్నవ్యాపారంలో రెండుచేతులా డబ్బు గడించాడు. కలిగిన నలుగురు కొడుకులూ చేతికందివచ్చి అతనికి చేదోడు వాదోడుగా ఉన్నారు. భవంతి అంతా మనమలతోను, మునిమనమలతోను కలకల లాడుతూంది. శ్రేష్ఠి అన్నివిధాలా అదృష్టవంతుడే! అతని కేలోటూ లేదు. కాని, పాపం, అతని కెప్పుడూ సుఖమనేది లేదు. ఎప్పుడూ ఏదో ఒక బెంగ, దిగులు పట్టుకుని పీడిస్తూంటాయి.

ఆ నలుగురు కుమారుల్నీ తనంతటి గొప్పవారిని చెయ్యాలని అతని కొక తహతహ. ఇంతా కష్టపడి ఆర్జించిన ఈ ఐశ్వర్యం అంతా ఏక్షణంలో ఏమైపోతుందో అని ఇంకొక బెంగ! పైగా ఆ కరువు రోజుల్లో శ్రావస్తీ నగరపరిసరాల్లో బందిపోటుదొంగలు కొందరు విచ్చల విడిగా తిరుగుతున్నారని ఒక వదంతి వ్యాపించింది. అది విన్నప్పటినించి అతని కింక నిద్రపట్టడమే గగనమైపోయింది. ఒక వేళ తెల్లతెల్లవారే వేళ కొంచెం కోడి కునుకు పట్టినా బందిపోటు దొంగలు భవంతిలో పడి తన రత్నాలన్నీ దోచుకుపోతున్నట్లే కలవచ్చేది! గడిచిన రాత్రి అంతా అతని కొక్క కునుకు పట్టలేదు.

ఆ దిగులుతో లేనిపోని ఆపద లేవో ఆలోచిస్తూ సతమతమై పోతున్న శ్రేష్ఠికి సుప్రియ పెదవులపై మెరిసిన చిరునవ్వు అతి విచిత్రంగా స్ఫురించింది.

‘‘ఇంత ఉన్నవాళ్ళకే ఈ దిగుళ్ళన్నీని! లేనివాళ్ళలాంటి వాళ్ళ నైనా చూచి హేళనగా నవ్వుకుంటారు! వాళ్ళకేం !’’

అలా ఏవేవో ఆలోచిస్తూ ఏదో మథనలోపడ్డాడు శ్రేష్ఠి. ఆ చింతాభారంలో అతని కెలాగో అలాగ ఒక చిన్న కునుకు పట్టింది.

మిట్టమధ్యాహ్నం దాటింది. సుప్రియ పసివాళ్ళిద్దరినీ వెంట బెట్టుకొని తన కుటీరానికి తిరిగివచ్చింది.

అది శ్రావస్తీనగర పరిసరంలో ఒక పెద్ద మర్రినీడలో కట్టిన కుటీరం. సుప్రియ ఆ కుటీరంలో ప్రవేశిస్తూనే తండ్రికీ, పసివాళ్ళకూ

ఇంత అన్నం పెట్టి మిగిలిందేదో తానుతిని మర్రినీడలో రాలిన పండుటాకు లలో మేనువాల్చి హాయిగా నిద్రపోయింది. ఆమె తండ్రి అంతకు పూర్వమే కుటీరంలో ఒకమూల కునికిపాట్లు పడుతూ కూర్చున్నాడు. పనివాళ్ళిద్దరూ మర్రినీడల్లో నెమరులువేస్తున్న మేకపిల్లలతో చెలగాటాలాడడం మొదలు పెట్టారు.

తండ్రికి సుప్రియ ఒక్కత్తే కూతురు. అత డంతకు పూర్వం రత్నవర్ధనుని గోష్ఠంలో పనిచేస్తూ, తనకున్న చిన్నకొండ్ర కాస్తా దున్నుకుంటూ కాలక్షేపం చేసేవాడు. క్రమంగా పెద్దతనం పైబడినకొద్దీ అతని కా కొట్టంలో పనిచెయ్యడం బాగా బరువనిపించింది. కొంతకాలం నించి ఆ పని మానేసి తనకున్న కొండ్ర దున్నుకుంటూ కాలక్షేపం చేశాడు. కాని అనావృష్టితో ఆ కొండ్రి కూడా బీడుపడిపోయింది.

ఇక గత్యంతరం లేక తత్త్వాలు పాడుకుంటూ శ్రావస్తీ నగర వీధుల్లో యాయవారం ప్రారంభించాడు. మండు వేసగి చండ్రనిప్పులు చెరగడం ప్రారంభించేసరి కతని శరీరంలో మిగిలిన జవసత్త్వాలన్నీ ఉడిగిపోయాయి. క్రమక్రమంగా కాలు కదపలేని సితిగూడా ఏర్పడింది. ఆ పరిస్థితులలో ఇక సుప్రియ ఒక్కత్తే అతని కండగా నిలిచింది.

ఆమె కప్పటికి పద్దెనిమిదేళ్ళు నిండాయి. ఆ పిల్ల నొక అయ్య చేతిలో పెట్టి సుఖంగా ఇహలోకయాత్ర చాలించాలని తండ్రి సంకల్పం. కాని ఆ ఏటి కాటకంవల్ల అతని కా పూట గడవడమే గగనమై పోయింది. పెళ్ళిమాట తలపెట్టడాని కిక వ్యవధి ఎక్కడిది? అతడు మంచం పట్టడాని కదికూడా ఒక కారణమే.

కాని చిన్నప్పటి నించీ సుప్రియ కా చింతలేవీ పట్టనేలేదు. తల్లి ఆమెకు బాగా చిన్నతనంలోనే ఇహలోకయాత్ర చాలించింది. అప్పటి నించీ తండ్రే ఆమె నల్లారుముద్దుగా పెంచి పెద్దదాన్ని చేశాడు.

సుప్రియ ఎప్పుడూ కలకలలాడుతూ నవ్వుతూ పేలుతూ ఉంటుంది. ఎప్పుడైనా ఒకప్పుడైశ్వర్య భోగభాగ్యాలు చవి చూచిన వారికి తమ భవిష్యత్తును గురించిన మథన బయలుదేరడం సహజం. నిత్య దరిద్రుల కటువంటి చింతకే ఆస్కారంలేదు. వా రొక విధమైన కష్టభూయిష్ఠ

జీవితాల కలవడతారు. అందుచేత ఉన్నంతలోనే కొంత తృప్తిపడడం వారి కలవడుతుంది. భవిష్యత్తులో ఎదుర్కోబోయే ఆపదల భీతివల్ల వారికి వర్తమానమే సుఖంగా ఉన్నట్టు స్ఫురిస్తుంది.

నిత్య సంతోషిత్వము, ఇరుగు పొరుగుల మీద ఒకింత జాలి సుప్రియకు సహజంగా అలవడ్డాయి. శ్రావస్తీ నగరంలోను, ఆ పరిసరాలలోను క్షామదేవత వికట తాండవం విజృంభించినా ఆమె ఎన్నడూ కెంగటిల్లి పోలేదు.

ఒకనాడామె భిక్షాటనానికి వెళ్ళి తిరిగి వస్తూంటే మధ్యే మార్గంలో దిక్కూ మొక్కూ లేని ఇరువురనాథ బాలకులు తటస్థపడ్డారు. వారిని చూడగానే ఆమె ఎంతో ఆప్యాయంగా తనతోకూడా తోడుకు పోయింది. కన్న తల్లిలా కాపాడింది. తనకు దొరికినంతలో కొంత తండ్రికి, ఆ పసివారికి పెట్టి, మిగిలినదానితోనే తాను తృప్తిపడింది.

శ్రావస్తిలో ఆనాటికానాటికి కరువెక్కువై పట్టణ పరిసరాలన్నీ శ్మశాన ప్రాయంగా మారిపోయాయి. అయినా సుప్రియ గుండె ధైర్యం కోలుపోలేదు. భిక్షుకుల ముఖాలలో దరిద్రదేవత నిత్యమూ తాండవిస్తూంటూంది. కొంచెం పెట్టి పుట్టినవారు వారిని చూస్తూ చూస్తూనే దూర దూరంగా తొలగి పోవడానికిదీ ఒక కారణమే! సుప్రియ ముఖమెప్పుడూ చిరునవ్వులు చిలకరిస్తూండడంవల్ల ఏదో విధంగా ఆమెకు కొంచెం భిక్షాన్నం దొరికేది. అసలు పేరేమయినా, నిత్యమూ కళకళలాడు తూండడంవల్లనే ఆమెకు సుప్రియ అనే పేరేర్పడింది. క్రమక్రమంగా అదే ఆమె పేరుగా స్థిరపడింది.

వేసవి బాగా విజృంభించిన కొద్దీ శ్రావస్తిలో అన్నాతురుల హాహాకారాలెక్కువైనాయి. ఆ మండుటెండ ధాటికి తాళలేక చెట్ల మీది పత్రాలలాగే ఎండుటాకుల్లా నేలమీద రాలి పడ్డాయి.

ఆ భీకర క్షామంలో బంధుప్రేమ కూడా విడిచి అందరూ ఆత్మ ప్రాణ సంరక్షణ తాపత్రయంలో పడ్డారు.

ఇక ఆ సమయంలో దిక్కూ మొక్కూలేని దీనుల మాట పట్టించు కునే వారెవరుంటారు!

శ్రావస్తిలో కొందరు శ్రీమంతులూ, ధర్మాత్ములూ కలిసి కొంత కాలంవరకూ అన్నార్తుల హాహాకారాలు తగ్గించారు. కాని క్షామ పీడ తగ్గే సూచన లేవీ కనిపించలేదు. ఆకలిబాధ కోర్వలేక కొందరు ప్రాణాలరచేత పట్టుకొని దేశాంతరాలు వెళ్ళిపోయారు. మరి కొందరు మధ్యే మార్గంలోనే ప్రాణాలు విడిచారు. మిగిలినవారు జీవచ్ఛవాలుగా జీవించారు. క్రమక్రమంగా ఆ దుర్భర క్షామపీడ ఇరుగుపొరుగు రాజ్యాలకు కూడా పాకింది.

ఆ విషమ ఘట్టంలో ప్రాణాలరచేత పెట్టుకొని క్షణ మొకయుగంగా గడుపుతున్న నగర పౌరుల కొక చల్లనివార్త చెవిని పడింది. శాక్యసింహుడు- గౌతమబుద్ధుడు శిష్య సమేతంగా శ్రావస్తికి విచ్చేయుచున్నాడన్న వార్త చల్లని జల్లులా పట్టణం అంతటా వ్యాపించింది.

ఆమహామహుని పాదధూళి సోకినంతనే శ్రావస్తిలో సకలారిష్టాలూ వాటంతటఅవే తొలగిపోగలవని కొంద రెంతో సంతోషించారు. మరి కొందరు 'దైవకృతాని కెంతటి వారయితే మాత్రం ఏమి చెయ్యగలరు!' అని చప్పరించేశారు.

ఆనోటా ఆనోటా వ్యాపించిన బుద్ధదేవుని ఆ ఆగమన వార్త వినగానే సుప్రియ ముఖంలో ఒక్కమారుగా వేయి చిరునవ్వులు విరిశాయి.

అంతవరకూ ఆమె కా మహాపురుషుని పేరుమాత్రమే చెవినపడింది. అంతేగాని సందర్శనభాగ్యం ఎన్నడూ లభించలేదు. శ్రావస్తీ నగరంలో గౌతముని రాకను గురించిన వింత వింత గాథ లెన్నో వ్యాపించాయి. చివరి కొకనాడు గౌతముడు శ్రావస్తి కనతిదూరంలో ఉన్న పంచవటీ ఛాయలో విడిదిచేశాడన్న వార్త సుప్రియ చెవిని పడింది.

ఆనాటి సాయంకాలం శ్రావస్తి శ్రావస్తి అంతా పంచవటివైపు నడిచిపోతున్నట్లే కనిపించింది. రాజులూ, రాజబంధువులూ రథాలమీదా, గజాందోళికాది వాహనాలమీదా తథాగతుని సందర్శనభాగ్యం

పొందాలనే తహతహతో తొందర తొందరగా వెళ్ళిపోతున్నారు. కొందరా మహావ్యక్తి కర్పించాలని చిత్రవిచిత్రమైన కానుక లెన్నో తీసుకుపోతున్నారు. వాహన భాగ్యం లేని సామాన్యజనం కాలినడకనే సాగిపోతున్నది.

వారందరినీ చూస్తూంటే సుప్రియ తానుకూడా బుద్ధుని సందర్శన భాగ్యం పొందాలని ఎంతో ఉబలాటపడింది. తనతోబాటెలాగైనా తండ్రినికూడా తీసుకుపోవాలని ప్రయత్నించింది. కాని రుగ్మతవల్ల అది కొనసాగలేదు.

ఇక మిగిలినవారు పసిపిలలు. సుప్రియ వారిద్దరికీ ఆ మాట చెప్పింది పిల్లలిద్దరూ ఏదో ఉత్సవం చూడబోతున్నామనే ఉత్సాహంతో ఎగిరి గంతేశారు.

సుప్రియ ఎంతో కష్టపడి ఎక్కడో ఒక పోకదొన్నె సంపాదించింది. దానినిండా మేకపాలు పిండి దానిమీద ్రి ఆకొకటి మూత వేసింది. ఆ దొన్నె ఎంతో జాగ్రత్తగా చేతోపట్టుకుని నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ పంచవటివేపు బయలుదేరింది. ఆ పసిపిల్లలిద్దరూ ఆమె అడుగులలో అడుగులు వేసుకుంటూ వెంట వెంటనే నడిచివెళ్ళారు.

దారిలో సుప్రియ కొకటే మథన! తానిచ్చిన ఆ మేకపాలాయన ఆప్యాయంగా స్వీకరిసాడా? అసలా జనసమ్మర్దంలో తానాయన పాదసన్నిధికి చేరుకోగలదా?

అసలు నిరుత్సాహపడడమనేది ఆమె కలవాటేలేదు. గుండె ధైర్యం చిక్కబట్టి అలాగే ముమ్మందుకు సాగిపోయింది.

సుప్రియ కెదురుగా జనం తండోపతండాలుగా మూగి ఒకరొకరిని తోసుకుంటున్నారు. ఆమె కిక అడుగే పడలేదు! ఆ పిల్లలిద్దరినీ వెంటబెట్టుకొని ఆయన నొక్కమారు సందర్శించడ మెలాగ? ఉత్కంఠతో సుప్రియకు కళ్ళమ్మట నీళ్ళపర్యంతం అయింది.

అప్పటికి సూర్యాస్తమానం అయింది. సందర్శనానికి వచ్చిన వారంతా మళ్ళీ తిరుగుముఖాలు పట్టారు. క్రమక్రమంగా జనం పలచబడ్డారు.

కొంచెం చీకటి పడింది. నల్లనల్లని మర్రినీడలో పండువెన్నెల పాలవెల్లువలా ప్రవహించింది. అప్పుడు బుద్ధదేవుని చుట్టూ పరివేష్టించి కూర్చున్నవారంతా చాలావరకు పలచబడిపోయారు. అంతా కలిసి రెండు మూడు వందల మందికంటె ఎక్కువ ఉండరు.

అంతవరకూ ఎక్కడో ఒక మారుమూల నిలుచున్న సుప్రియ పసివారి నిద్దరినీ వెంటబెట్టుకొని నెమ్మదిగా బుద్ధదేవుని సమీపానికి వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేసింది. పసివారిద్దరి చేతా సాష్టాంగ నమస్కారాలు చేయించింది. తానెంతో భద్రంగా పోక దొన్నెలో సేకరించిన మేకపాలెంతో భక్తిగా ఆయన పాదాలముందర సమర్పించింది.

గౌతమబుద్ధుడవి స్వీకరించినట్లుగా కొంచెం తల పంకించి చిన్న చిరునవ్వు మెరిపించాడు. సుప్రియ కంతటితో పూర్తిగా సంతృప్తి కలిగింది. బుద్ధదేవుని పాదాల కనతిదూరంగా కూర్చుని నిశ్చలదృష్టితో ఆ తేజోమూర్తి వైపే చూచింది. ఆక్షణంలో ఆమె హృదయం లోని సంతోష సాగరతరంగా లానందబాష్పాలలో వెల్లువలై ప్రవహించాయి.

సుప్రియ బుద్ధదేవుని కెదురుగా కూర్చున్న పౌరవర్యుల నందరిని పరిశీలించి చూచింది. వారిలో చాలా మంది ఆమెకు చిరపరిచితులే! మొట్టమొదటగా రత్నవర్ధనశ్రేష్ఠి ముఖం ప్రత్యక్షమయింది. ఇంకా కొంచెం దూరంలో శ్రావస్తిలో గొప్ప కృషీవలస్వామిగా ప్రసిద్ధికెక్కిన క్షీరస్వామి ప్రత్యక్ష మయ్యాడు. అటుపిమ్మట బుద్ధదేవుని కెదురుగా శ్రావస్తి నగర దండనాయకుడు చండసేనుని ముఖం కనిపించింది. ఇంకా సుప్రియ గుర్తెరిగిన శ్రావస్తీనగర పౌరు లెందరెందరో తలవని తలంపుగా అక్కడ ప్రత్యక్షమయ్యారు.

ఏదైనా ధర్మ ప్రసంగం ఉపక్రమించే ముందొక అరగడియ వరకూ గౌతమ బుద్ధుడు కేవలం మౌనమే అవలంబించడం ఒకపరిపాటి. ఆ విషయం శ్రావస్తీవాసులందరూ అంతకు పూర్వమే విన్నారు. అందు చేత సదస్యులంతా తథాగతుని ధర్మ ప్రసంగాని కెదురుచూస్తూ నిశ్చల దృష్టులతో బుద్ధదేవుని పెదవుల కదలిక నిరీక్షిస్తూ కూర్చున్నారు.

అంతవరకూ ఆకల్లాడని మర్రికొమ్మల్లో పక్షుల కలకల రవాలప్పు డప్పుడే మేల్కొన్నాయి. పాలవెన్నెల చల్లని ప్రవాహంలో ఆ పరిసరమంతా అపూర్వానంద డోలికలలో ఓలలాడింది.

ఆ క్షణంలో సదస్యుల హృదయాలలో జీవుల జననమరణాలను గురించి, దైనందిన ధర్మాధర్మాలను గురించి, చిత్రవిచిత్రమయిన స్వర్గాది లోకాలను గురించీ ఎన్నెన్నో జిజ్ఞాస లావిర్భవించాయి. గౌతమబుద్ధుడందరి ముఖాలూ ఒకక్షణం సేపతినిశితంగా పరిశీలించాడు.

# 4

ఇంకొక క్షణంలో గౌతమబుద్ధుని పెదవు లలవోకగా విడిపడ్డాయి:

"నాయనలారా! నా కీవేళ శ్రావస్తిలో అంతటా ఆర్తుల హాహాకారాలే వినిపిస్తున్నాయి!"

గౌతమబుద్ధుని పెదవులనుండి ఒక వేడి నిట్టూర్పు వెలువడింది. సదస్యులందరూ శ్రావస్తివైపు దృష్టులుసారించి చెవులురిక్కించి శ్రద్ధగా విన్నారు. కాని వారికి శ్రావస్తిలో అన్నార్తుల హాహాకారా లేవీ వినిపించ లేదు. మరి గౌతమబుద్ధదేవుని కెలా వినిపించాయి! ఆయన కేదో దివ్య దృష్టి ఉన్న దేమోనని వారంతా ఎంతో ఆశ్చర్యపడ్డారు! తిరిగి గౌతమ ముని గభీరవాణి మారుమోగింది:

"మీరంతా వారందరికీ పట్టెడన్నం పెట్టించే మార్గమేదైనా ఆలోచించండి! పాపం! ఎంతమంది క్షుధార్తు లాకలిబాధకోర్వలేక అల్లల్లాడి పోతున్నారో! నాయనలారా! ఈ విషయమేమైనా ఆలోచించారా!"

సదస్యులలో శ్రద్ధాళువుల నేకులు గౌతమదేవుని పాదధూళి సోకగానే శ్రావస్తిలో వ్యాపించిన క్షామపీడ అంతా ఒక్కక్షణంలో హరించుకు పోగలదని అనుకున్నారు!

అసలా విషయమే తలపెట్టని శ్రీమంతులు కొందరామహాత్ముని ముఖతః ధర్మసూత్రాలేవో తనివి తీరా విని తరించాలని నిరీక్షిస్తూ కూర్చున్నారు.

అంతేగాని అక్కడ కూర్చున్నవా రెవరికీ అంతవరకూ ఆ జిజ్ఞాసే బయలు దేరలేదు! అందుచేత వారెవరికీ ఆ ప్రశ్న కేమని సమాధానం చెప్పాలో తెలియలేదు. అందరూ ఒకరొకరి ముఖాలకేసి చూస్తూ కూచున్నారు. అంతలో బుద్ధదేవుని గభీరవాణి ప్రతిధ్వనించింది:

"నే నింత దూరంనుంచి ఇక్కడికి వచ్చినది ప్రత్యేకం దీని కోసమే!"

తిరిగి ఆ కరుణామూర్తి పెదవులనుండి ఇంకొక వేడి నిట్టూర్పు వెలువడింది. కొంతమంది శ్రీమంతులిక ఆనాడు తమ తత్త్వజిజ్ఞాసలు తెలుపుడు చేసుకునే అవకాశమే లేదని చల్లచల్లగా తమ భవంతులకు జారుకున్నారు.

మరి కొంతమంది సభామధ్యంలోనించి లేచి వెళ్ళడానికి వీలు లేక, మరి గత్యంతరం లేక, ఆవలిస్తూ, చిటికెలు వేస్తూ అలాగే కూర్చుండి పోయారు.

రత్నవరసుధా సభామధ్యంలోనే కూర్చున్నాడు. అతనికి ఎటుపోవడానికీ దారి కనబడలేదు. అంతలో గౌతముముని దృష్టి అతనిపై పడింది. శ్రేష్ఠి కొంచెం తలవంచుకొని తన గోడు వెళ్ళబోసు కున్నాడు. అతగాడు లెక్కలు కట్టడంలో గట్టిదిట్ట.

"ఈ విషయం నేను కొంచెం సావధానంగానే ఆలోచించాను. మన మహానగరంలో అనావృష్టి దోషంవల్ల అయిదారు వేల మందిదాకా అగతికులయినారు. కాటకం కాస్త మళ్ళు ముఖం పట్టేదాకా వీరంద రికీ ఇంత అన్నంపెట్టి, ఆదరించాలంటే అధమం పూట కొక వంద గుండిగల అన్నమైనా వార్చాలి!

"ప్రస్తుతం నా ధాన్యాగారంలో ఉన్న ధాన్యం వీరందరికీ ఒక్క పూట పట్టెడన్నం పెట్టించడానికి కూడా చాలదేమో నని భయపడు తున్నాను."

శ్రేష్ఠి ఆపైన వంచిన తల మరి పైకెత్తలేదు! ఆపైన సదస్యు లందరి చూపులూ క్షీరస్వామిమీద పడ్డాయి. అతడు తన బుజంమీద ఉత్తరీయం ఒకమారు సవరించుకొన్నాడు:

"ఒక్క చుక్కైనా వర్షం పడక ఈ ఏడాది నా పొలాలన్నీ పట్టి బీళ్ళుగా మారిపోయాయి. నా పురులలో ఉన్న ధాన్యం అంతా కలిపితే ఈ ఏటి కేడాదీ మా కుటుంబ గ్రాసానికే సరిపోదేమోనని భయపడుతున్నాను. నాకున్న బలగం మీ కందరికీ తెలిసిందే గదా! ఏమైనా ఇంకో నాలుగు గింజలు మిగిలితే అవి విత్తనాలకైనా పనికి వస్తాయని అట్టే పెట్టించాను. నా దగ్గర మిగిలిన ధాన్యం అంతా అంతే! ఆపైన తమరందరూ ఎలా సెలవిస్తే అలాగే చేస్తాను! సెలవియ్యండి!"

ఇంకా అత డలాగే ఏదో ఘోష ప్రారంభించబోయాడు.

అంతలో చండసేనుడు తన ఒరలోని బాకు పైకిలాగి సగర్వంగా లేచినిలబడ్డాడు:

"నే నీ క్షణంలో నా సైన్యాలను, ఈ అస్త్రాలను వెంట బెట్టుకుని పరరాజన్యుల రాజ్యాలమీదికి దండెత్తిపోతాను! శత్రువు లందరినీ క్షణంలో సంహరించివేస్తాను! పదివారాలలో ప్రజలందరికీ పదిసంవత్సరాల వరకూ సరిపోయే ధాన్యరాసులు తరలించుకొని వస్తాను! సెలవిప్పించండి! వెంటనే బయలుదేరి వెళ్ళిపోతాను!"

అతని మాటలు విన్న సదస్యులందరికీ ముచ్చెమటలు పోశాయి. కాని ప్రస్తుతం అంతకంటే గత్యంతర మేమీలేదని వారిలో చాలామంది నిశ్చయించారు! కొందరు వెనువెంటనే సాధువాదాలు చేశారు! అంతలో గౌతమముని పెదవులు విడివడ్డాయి:

"నాయనా! నీవు వెళ్ళి తిరిగివచ్చేవరకూ శ్రావస్తిలోని అస్త్రారు లందరూ మల మల మాడిపోవలసిందేనా! కొంచెం శాంతించి సావధానంగా ఆలోచించుకో!"

చండసేనుని కిక ఏమనాలో తెలియలేదు. అత డలాగే దిగాలు పడి ముచ్చెమటలు కక్కుతూ కూర్చున్నాడు.

గౌతమముని మరికొంత సేపటివరకూ మౌనముద్ర వహించి కూర్చున్నాడు. ఎంతసేపటికీ ఎవరూ ఇంకొక మార్గం చూపించలేక పోయారు.

గౌతము డుసూరుమని నిట్టూర్చి లేచి నిలుచున్నాడు. ఇక ఆయన అక్కడినుంచి బయలుదేరి వెళ్ళిపోయేవేళ సమీపించిందనీ, ఇక ఆ మహాపురుషుడు తమ నగరంలో ఒక్కక్షణమైనా నిలవడనీ, ఆయన కిక తమ మీద దయతప్పిందనీ అందరూ భయపడ్డారు!

అంతలో సుప్రియ తన చిన్నిజోలె ఆకరుణామూర్తి ముందుంచి జాలి తొణికిసలాడే గద్గదస్వరంతో విన్నవించింది:

"మహాప్రభూ! మాలాంటి అన్నార్తు లందరినీ ఇలా వదలి వెళ్ళిపోవడం తమకు ధర్మంకాదు! ఒక్కక్షణం ఆగండి!

"ఇక్కడ కూర్చున్నవారందరూ ఇంతో అంతో ఉన్నవారే! నాకొక్కతెకు మాత్రం ఏమీ లేదు! కాని ఈ చిన్నజోలె, ఈపసివాళ్లు చల్లగా ఉంటే నేనీ అన్నం లేనివారి నందరినీ ఎన్నాళ్లయినా పోషించ గలను!"

కొంద రామెమాటలు విని నిర్ఘాంతపోయారు! మరికొందరామెకు మతిభ్రమణమే కలిగిందని అనుకొన్నారు. అంతలో సుప్రియ మళ్ళీ విన్నవించింది:

"మీ దయ ఉంటే వీళ్లందరి ధాన్యాగారాలలోని ధాన్యము నాదన్నమాటే! నేను జోలె చేతబుచ్చుకుని బయలుదేరితే నాకందరూ తలోదోసెడు బియ్యం పెట్టకపోరని గట్టి ధైర్యమే ఉంది. మీచల్లని చూపు కొంచెం నామీద పడితే నేనెంతమంది నయినా, ఎన్నాళ్ళయినా పోషించగలను! మామీద తమకింత దయకలిగితే ఈ కరువు కాటకాలొకలెక్కా?"

కరుణార్ద్రమయిన సుప్రియ అమృతవాణి విన్న సదస్యులందరి శిరస్సులూ ఒక్కమారుగా కిందికి వంగిపోయాయి.

ఆనందాశ్చర్య విస్ఫారితమైన గౌతముని దృష్టి లీలగా సుప్రియ మీదికి ప్రసరించింది.

"తల్లీ! నీ వింతటి భాగ్యశాలినివని అనుకోలేదు సుమా! నీవంటి వారొక్కరుంటే చాలు! ఈ శ్రావస్తి కేమిలోటు?

"రా! నేనుకూడా నీవెంట వస్తున్నాను! రా!"

గౌతమబుద్ధుడు లేచి నిలుచుని ఎంతో ఆప్యాయంగా ఆమె శిరస్సు నిమిరాడు. నగరవాసు లాక్షణంనించీ తమ ఇళ్ళలో దాచుకొన్న ధాన్యరాసులన్నీ సుప్రియ కెదురుగా కుప్పలుగా పోశారు.

ఆనాటి శ్రావస్తీ నగరంలోనూ, నగర పరిసరాలలోనూ ముందుగా శాక్యసింహుని అపార కరుణామృత వృష్టి కురిసింది.

ఆ పైన తొలకరి నీలమేఘా లాక్కుమ్మడిగా కుంభవృష్టి కురిపించాయి!



# మహాప్రస్థానం

## 1

హిమాచలం పాండవు లందరికీ ఎదురుగా ఒక మహాశరత్కాల మేఘంలా ప్రత్యక్షమైంది. వారందరూ ఆ పర్వత శిఖరాగ్రాలపై దృష్టులునిలిపి ఎత్తిన తల లిక దింపకుండా తదేకధ్యానంతో అలాగే సాగిపోయారు. అంతవరకూ చెక్కుచెదరకుండా మహాప్రస్థాన యాత్ర సాగించిన వారందరి శరీరాలూ హిమాచల శిఖర సందర్శనంతో ఒక్కసారిగా అలిసి సొలిసినట్లుగా దిగాలుపడిపోయాయి.

శ్రీకృష్ణ నిర్యాణం జరిగిపోగానే అర్జునుడు అనేకమైన యాతన లనుభవిస్తూ శ్రీకృష్ణుని అష్టమహిషులను, మరికొందరు యాదవ కుమారులను అతికష్టంమీద ఇంద్రప్రస్థ నగరానికి తీసుకురాగలిగాడు. మధ్యే మార్గంలో దస్యు లనేకులు యాదవులపై విరుచుకుపడి యాదవ మహిళల ననేక విధాలుగా హింసించారు. ఆ సమయంలో అనితర సాధారణమైన అతని శస్త్రాస్త్రసంపత్తి అంతా ఎందుకూ కొరగాకుండా వ్యర్థమైపోయింది.

ఆ విధమైన విధివైపరీత్యం అతని మనస్సంతా కలగించివేసింది. అటుపిమ్మట అత డొకమారు వ్యాసమహర్షిని సందర్శించాడు. కాల పురుషుని లీలలవల్లనే అవన్నీ ఆ విధంగా జరిగిపోయాయనీ, ఆ విష

యంలో విచారించడంవల్ల ప్రయోజనమేమీ లేదనీ, ఇక పాండవేయు లందరూకూడా మహాప్రస్థానానికి తరలిపోయే సమయ మాసన్నమైన దనీ వ్యాసమహర్షి అతని కాదేశించాడు. తిరిగి హస్తినాపురానికి రాగానే అర్జునుడా వృత్తాంతం అంతా ధర్మరాజాదుల అందరికీ తెలియజేశాడు.

శ్రీకృష్ణ నిర్యాణవార్త విన్నప్పుడే ధర్మరాజు హృదయంలో మహాప్రస్థాన సంకల్పం బయలుదేరింది. వ్యాససందేశం వినగానే ఆ సంకల్పం మరింత దృఢపడింది. మిగిలిన పాండవులందరూ తమ సంకల్పం కూడా అదే అనీ, తామిక ఒక క్షణమైనా హస్తినాపురంలో నిలువజాలమనీ అన్నారు.

వెనువెంటనే వారందరూ పరీక్షిత్కుమారునికి పట్టాభిషేకం చేసి, పౌరజానపదు లందరిదగ్గిరా సెలవు తీసుకొని యథావిధిగా సన్న్యాసాశ్రమం స్వీకరించి మహాప్రస్థాన యాత్ర కుపక్రమించారు.

దుర్ద్యూతపరాజితులై కేవలం కట్టుబట్టలతో పాండవు లరణ్యావాసానికి బయలుదేరినప్పుడు కూడా హస్తినాపుర పౌరు లావిధంగా విలపించలేదు! హస్తినాపురం అంతా ఆనాడొకేకంఠంతో విలపించినట్టుగా ఘోషించింది!

ధర్మరాజు వారి నందరినీ ఓదార్చి తిరిగీ వెనుదిరిగి చూడకుండా హస్తినగర ద్వారం దాటి వెళ్లిపోయాడు. అతని వెనువెంటనే భీమార్జున నకుల సహదేవులూ, ద్రౌపదీదేవీ క్రమక్రమంగా ఒకేవరుసలో నడిచి వెళ్ళిపోయారు.

హస్తినాపురద్వారం దాటగానే వారిని ఒక శునకంకూడా వెంటాడింది. మొట్టమొదట వారెవ్వరూ ఆ విషయమే గమనించనే లేదు. పౌరజానపదులందరూ ధర్మరాజాదులందరినీ చాలదూరం వరకూ సాగనంపి తిరిగి స్వగృహాలకు తరలిపోయారు. కాని ఆ శునకంమాత్రం వారిని విడిచిపెట్టలేదు.

అనంతరం సుభద్ర, పరీక్షిత్కుమారుడు మొదలైన రాజబంధువు లందరూ ధర్మరాజాదుల దగ్గిర సెలవుతీసికొని తిరిగి హస్తినాపురానికి

మరలిపోయారు. అయినా ఆ నోరులేని ప్రాణి పాండవులందరినీ అలాగే అనుసరిస్తూ నడిచిపోయింది.

అటుపిమ్మట కొన్నిరోజులకు అగ్నిదేవుని ఆజ్ఞప్రకారం అర్జునుడు తన గాండీవంకూడా సముద్రంలోనికి విసిరివేశాడు. అది సముద్రంలో పడిపోగానే వేయిపిడుగు లొక్కసారిగా మోగినంతటి ప్రళయభీకర ధ్వని వినిపించింది. ఆ ధ్వనికి ఆ పరిసరారణ్యావృక్షాలన్నీ దద్దరిల్లిపోయాయి! అయినా ఆ ప్రాణి వారిని విడిచిపెట్టకుండా అలాగే తోకాడించుకొంటూ వారి వెనువెంటనే సాగిపోయింది. అంతటి భక్తి విశ్వాసాలతో తమ వెంట నడిచివస్తున్న దానిని కాదనడానికి వారెవరికీ మనస్కరించలేదు! పైగా వారందరూ దాని నెంతో ఆప్యాయంగా ఆదరిస్తూ తమ వెంట తోడుకుపోయారు.

ఆ విధంగా మహా నదీనదాలూ, దుర్గమారణ్యాలూ దాటుకుంటూ కొంతకాలానికి వారంతా హిమవత్పర్వత ప్రాంతానికి చేరుకున్నారు.

వారందరూ నిశ్చలయోగనిష్ఠులై తదేకజ్ఞాన దృష్టితో హిమవన్నగ శిఖరా లవలోకిస్తూ నెమ్మది నెమ్మదిగా తమ మహాప్రస్థాన యాత్ర సాగిస్తున్నారు. అది ఒక నాటితో ముగిసిపోయే యాత్రకాదు. మృత్యుక్షణం వరకు నిరంతరాయంగా కొనసాగవలసిన మహాయాత్ర! మృత్యుద్వారమే ఆ యాత్ర చరమలక్ష్యం! అంతకంటె దానికి వేరే మరిఒక చరమావధి ఏమీ లేదు. అయితే నిశ్చల యోగనిష్ఠులైనవారు మాత్రమే ఆ భయంకర మృత్యుద్వారం అధిగమించి విముక్తులై పుణ్యలోకాలు చేరుకోగలరు. అందువల్లనే వారంతా నిరంతనిశ్చలయోగనిష్ఠులై అచంచల వీక్షణాలతో మహాహిమాలయంవైపు నడచిపోయారు. అయితే ఆ శునకం మాత్రం కేవలం వారి యెడల ఏర్పడిన అపూర్వ భక్తివిశ్వాసాలవల్లనే ఆ విధంగా వారి వెంటనంటి సాగిపోయింది.

అంతలో ద్రౌపదీదేవి హఠాత్తుగా నేలపై పడిపోయింది. ఒక క్షణ కాలం వారంతా వెనుదిరిగి చూచారు. ఆమె ముఖంలో ఎక్కడా జీవచైతన్యం స్ఫురించలేదు! వెంటనే ఆమె మరణించింది.

తిరిగి పాండవులూ, ఆ శునకమూ అలాగే ముమ్ముందుకు సాగిపోయారు. పాండవేయు లందరి హృదయాలలోను ఒక్కమారుగా

ఎన్నెన్నో పూర్వస్మృతి విద్యున్మాలిక లుదయించాయి. అయినా వారెవరూ తమ నిశ్చలయోగ లక్ష్యం విడనాడలేదు. అందరూ అలాగే సాగిపోతున్నారు.

"ఆమె కా విధంగా యోగచ్యుతి కలగడానికీ, ఆ హఠాన్మృతికీ హేతువేమిః పాంచాలీదేవి ఎన్నడూ ఏ విధమైనటువంటి అధర్మమూ ఆచరించి ఉండలేదేః" అని ప్రశ్నించాడు భీమసేనుడు.

నిశ్చల లక్ష్యదృష్టితో పాండవులందరకీ మార్గదర్శిగా సాగిపోతున్న ధర్మరా జతని కీవిధంగా ప్రత్యుత్తరం ఇచ్చాడు:

"ఈమెకు అర్జునుని యెడల పక్షపాతం అత్యధికంగా ఉన్నది. ఆ పాపఫలమే నే డీవిధంగా పరిణమించింది!"

అని ధర్మరాజిక ఒక్క మారైనా వెనుకకు తిరిగి చూడకుండా అదే విధంగా నడిచి పోయాడు.

మరికొంత సేపటికి సహదేవుడు హఠాత్తుగా నేలపై పడిపోయాడు.

"మనందరికీ అహోరాత్రాలూ ఏమరకుండా శుశ్రూష చేసిన సహదేవకుమారుని పతనానికి హేతువేమిటిః" అని భీమసేనుని ముఖతః తిరిగి ఇంకొక ప్రశ్న బయలుదేరింది.

"తనంతటి మహాప్రాజ్ఞు డెవడూ లేడని ఇత డెప్పుడూ విర్రవీగుతూం డేవాడు. ఈ పతనం దాని ఫలితమే!" అన్నాడు ధర్మపుత్రుడు.

ఆ మహాప్రస్థానం ఇంకా మరికొంతదూరం సాగింది. ఆ ఆపత్పరంపరకు మిగిలిన వారెవ్వరూ అంతగా చలించలేదు. కాని భ్రాతృకళత్రమృతి సందర్శించేసరికి నకులుని కిక నడక సాగలేదు. ఉత్తరక్షణంలో అత డొక మొదలునరికిన కదళీతరువులా కూలబడిపోయాడు.

"నకులకుమారు డెన్నడూ క్షుద్రకర్మ లాచరించలేదు! ఎన్నడూ మీమాట కెదురాడలేదు! లోకంలో ఇంతటి మహాసౌందర్యశాలి ఇంకొక డెవ్వడూ లేడని ప్రసిద్ధిపొందినవా డీసుందరుడు. ఇతని కీ విధమైన యోగభ్రంశదుర్గతి పట్టడానికి కారణమేమిః" అని ప్రశ్నించాడు భీమసేనుడు.

"లోకంలో మరి నాఅంతటి అందగాడింకెవడూ లేడనే అహం భావంవల్లనే ఇతనికీ దుర్గతి పట్టింది." అని ధర్మరాజలాగే ఆ నిరంతర మహాప్రస్థానయాత్రలో పడి ముమ్ముందుకు సాగిపోయాడు.

ద్రౌపదీ నకుల సహదేవుల మృతితో అర్జునునిలో అంతవరకూ చెక్కు చెదరకుండా నిలిచిన ధైర్యం అంతా కరిగి నీరైపోయింది. అతడిక నిలబడలేకపోయాడు. వెంటనే నేలపైబడి మరణించాడు.

"పరిహాస ప్రసంగాలలోకూడా ఎన్నడూ అనృతం చెప్పని మహానుభావు డీ అర్జునుడు! అలాంటి మహాపురుషు డీ విధంగా పడిపోవడానికి కారణమేమిటి?" అని తిరిగి ఇంకొక ప్రశ్న వినిపించింది.

"నిజమే! అయితే ఇతడొకమారు ఒక్కరోజులో శత్రువులందరిని నిశ్శేషంగా సంహరించివేస్తానని ప్రతిజ్ఞ చేశాడు. చివరి కా ప్రతిజ్ఞ నెరవేర్చుకోలేకపోయాడు. కనకనే ఇతనికీ దుర్గతి పట్టింది."

అని ఒక సమాధానం వినబడింది. ధర్మరాజిచ్చిన ఆ సమాధానం వింటూనే భీమసేనుడు భూమిమీద పడిపోయాడు. పడిపోయిన ఉత్తర క్షణంలోనే అతడిలా ప్రశ్నించాడు: "మహారాజా! చివరికి నేను కూడా నేలపై పడిపోయాను! నాకిటువంటి పతనం సంప్రాప్తించడానికి కారణమేమిటి? దయ ఉంచి నాకిది తెలియజెయ్యవలసిందని కోరుతున్నాను."

దానికి ధర్మరాజీ విధంగా ప్రత్యుత్తరం ఇచ్చాడు: 'మితిమీరి అతిగా భుజించిన దోషంవల్లనే నీకీ దుర్గతి కలిగింది. నా అంతటి మహాబలశాలి లేడనే గర్వంకూడా దానికి తోడైనది. ఇవే నీపతనానికి హేతువులు!"

అని సమాధానం చెప్పిన ధర్మరాజిక వెనకకు తిరిగి చూడలేదు. నిశ్చలమైన యోగనిష్ఠాబలంతో ధర్మపుత్రుడదే విధంగా అత్యంత నిశ్చల హృదయంతో నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ అలాగే సాగిపోయాడు. ఇక పాండవులెవరూ అనుసరించని అతని వెనువెంట ఒక్క కుక్క మాత్రమే నడిచివెళ్లింది.

అన్ని భీషణ విపత్పరంపర లెదుర్కొన్నా ధర్మపుత్రుని హృదయం కించిత్తయినా చలించలేదు. హిమాచలశిఖరం ఒక్కటే గౌరీశంకర

రూపంతో అతని హృదయంలో సుప్రతిష్ఠితమై చల్లని వెన్నెల వెలుగులు విరజిమ్మింది.

ఆ విధంగా మరికొంతదూరం సాగిపోయే సరికి అతని కట్టెదుట జాజ్వల్యమానమైన దివ్యరథం స్ఫురించింది. వెంటనే దేవేంద్రు డతని ఎదుట ప్రత్యక్షమై మేఘగంభీర స్వరంతో సుస్వాగతవచనాలు పలికి, ఆ మానవశరీరంతోనే దేవత లతన్ని స్వర్గలోకాని కాహ్వానిస్తున్నారనీ, కనక వెంటనే ఆ దివ్యరథం అధిరోహించవలసిందనీ అభ్యర్థించాడు. దానికి ధర్మరాజేమీ ఉబ్బితబ్బిబ్బైపోలేదు. సవినయంగా దేవేంద్రుని కీవిధంగా విజ్ఞప్తి చేశాడు:

"దేవేంద్రా! నా ప్రియసోదరులందరూ మార్గంలో దిక్కు తెలియని దీనులవలె మృత్యువువాత పడిపోయారు. మహారాజపుత్రి అయిన పాంచాలీదేవి అత్యంత సుకుమారి. మహారాజభోగా లనుభవించిన ఆ మహాసాధ్వి కేవలం దిక్కులేని దీనురాలివలె వట్టి నేలపైబడి మరణించింది. నా సహోదరు లందరూ పాంచాలీసహితులై నా వెనువెంటనే స్వర్గలోకానికి రావలెనని కోరుకొంటున్నాను. నాకోరిక మన్నించవలసింది."

దానికి దేవేంద్రు డీవిధంగా సమాధానం ఇచ్చాడు:

"ధర్మరాజా! నీ సహోదరు లందరూ పాంచాలీసహితులై నీకు ముందే స్వర్గానికి వేంచేశారు. మానవశరీర త్యాగం చేసిన ఉత్తర క్షణంలోనే వారందరికీ ఉత్తమలోకాలు సంప్రాప్తించాయి. నీ విక అచిరకాలంలోనే వారందరిని సందర్శించగలవు. మనుష్యశరీరంతో స్వర్గానికి పోయే అపూర్వ భాగ్యం పట్టిన మహానుభావుడవు నీ వొక్కడవే! ఇందువల్ల మరి వెనుకముందు లాలోచించకుండా వెంటనే ఈ దివ్యరథం అధిరోహించవలసినది!"

ఆ ప్రత్యుత్తరానికి ధర్మరా జెంతో ఆనందించి, "మహేంద్రా! పాపం, ఈ కుక్క ఎంతో భక్తిశ్రద్ధలతో మా వెంటనంటి నడిచి వస్తున్నది! దీనిని కూడా నాతోపాటుగా స్వర్గానికి తీసుకుపోవలసిందని ప్రార్థిస్తున్నాను! దీనిని విడిచి స్వర్గానికి పోవడంకన్నా మరి వేరే ఘాతుక కృత్యమేమీ లేదని అనిపిస్తున్నది!" అన్నాడు.

దానికి మహేంద్రు డిలా అన్నాడు.

"రాజా! నీవీక్షణంలో అమర్త్యుడవై నా సమానుడవై నావు! స్వర్గసౌఖ్యాలన్నీ ఇక నీ కరతలామలకాలే! ఈ కుక్కను నీ వెంట బెట్టుకు రాకపోవడంవల్ల వచ్చే ప్రత్యవాయమేమీ లేదు! మరింక దానిమాట తలపెట్టక వెంటనే ఈ రథం అధిరోహించవయ్యా!"

ఆ మాటలకు ధర్మపుత్రు డీవిధంగా సమాధానం చెప్పాడు:

"మహేంద్రా! ఇక నీవుతప్ప నా కెవరూ దిక్కు లేరని కాళ్ళా వేళ్ళా పడిన ఆశ్రితుణ్ణి విడిచిపెట్టడం అంతటి మహాపాతక మేదీలేదనీ, అది బ్రహ్మహత్యాసదృశమైన మహాపాతకమనీ ధర్మవేత్త లుద్ఘోషిస్తున్నారు! అందుచేత తుచ్ఛమైన స్వర్గసుఖం అభిలషించి నేనీ శునకాన్ని విడిచిపెట్టలేను! ప్రాణం పోయినా ఇదే నా దృఢనిశ్చయం!"

దానిమీద శచీపతి పకపకమని ఒక్క నవ్వు నవ్వి అతనితో ఇలా అన్నాడు:

"కుక్క ముట్టిన వస్తు వెంతటి మహత్తరమైనదైనా వెంటనే దానిని దూరంగా విసిరివేస్తున్నారు! ఈ కుక్కను విడిచిపెట్టివేశావంటే స్వర్గసుఖాలన్నీ నీ అరిచేతిలో పడుతున్నాయి! కనక దీనినింక దూరదూరంగా తరిమివేసి అనితర సాధారణమైన ఈ సశరీర స్వర్గసుఖం అనుభవించు! అదిన్నీగాక నీ సహోదరులను, ధర్మపత్నిని విడిచివేసి నీ వొక్కడివే స్వర్గద్వారం చేరుకొన్నావుగదా! నీ పుణ్యకర్మలవల్లనే నీ కింతటి అపూర్వ భాగ్యవిశేషం కలిగింది. ఇంత త్యాగం చేసిన నీకీ చివరిక్షణంలో ఇంతటి మహామోహావేశం కలగడం అత్యాశ్చర్యకరం!"

అటువిమ్మట దేవేంద్రునికి ధర్మరాజీ విధంగా సమాధానం చెప్పాడు:

"మరణించినవా రెంతటి సచ్చారిత్రులైనా, వారి పునర్దర్శనం మరి అసంభవమేకదా! వారి నెవరూ తిరిగి బ్రతికించుకోలేరు! కనకనే నేను మరి నా సహోదరులమాట తలపెట్టలేదు! కాని ఈ శునకం నన్నే నమ్ముకొని నా వెంటనంటి చాలా దూరందాకా నడిచి వచ్చింది. శరణాగతపరిత్యాగము, స్త్రీవధ, బ్రాహ్మణస్వాపహార

ణము, మిత్రద్రోహము ఆశ్రితపరిత్యాగము మహాఘోరపాతకాలని ధర్మజ్ఞులు ప్రవచిస్తున్నారు అందువల్ల నేనీ శునకాన్ని మాత్రం విడిచిపెట్టేది లేదు!''

ధర్మరాజు ఈ విధంగా తన దృఢసంకల్పం తెలియజెయ్యగానే ధర్మదేవత తన శునక స్వరూపం విడిచిపెట్టి అతని కట్టెదుట నిలబడి ఇలా అన్నది:

''రాజా! నీ ప్రాణికరుణ, సచ్చారిత్రము, నీ మేధాప్రభావము అనుపమానమైనవి! పూర్వం ఒకప్పుడు ద్వైతవనంలో యక్షసరోవర తీరంలో నిన్నీవిధంగా పరీక్షించి ఉన్నాను. అప్పుడు భీమార్జునుల కంటె నకులకుమారుడే నాకత్యంత హితుడనీ, ముస్ముందుగా అతనినే బ్రతికించవలసిందనీ ప్రార్థించావు. ఇప్పుడు కేవలం నీ వెంటనంటి వచ్చిందనే కారణంచేతనే ఈ శునకాన్ని విడిచిపెట్టేది లేదని భీష్మించుకొని కూర్చున్నావు. స్వర్గలోకంలోకూడా నీవంటి మహాపురుషులెవరూ కనిపించరు! కనకనే నీకీ అపూర్వమైన సశరీర స్వర్గం లభించింది!''

అటుపిమ్మట దేవతలందరూ ధర్మరాజు నా దివ్యరథంపై కూర్చోబెట్టి వెంటనే స్వర్గలోకానికి తీసుకొనిపోయారు.

దివ్యకాంతులతో దేదీప్యమానంగా వెలిగిపోతున్న ధర్మపుత్రుని చూచి దేవర్షి నారదు డీ విధంగా ప్రశంసించాడు:

''ఆహా! పూర్వ రాజర్షు లెవరూ మానవ శరీరంతో స్వర్గలోకంలో ప్రవేశించలేదు. ఈ పుణ్యపురుషుని కీర్తి పూర్వ రాజర్షుల కీర్తి నంతటినీ తలదన్ని వేసింది! ధర్మపుత్రా! దేవతల దివ్యభవనాలన్నీ అపూర్వ భోగభాగ్యాలతో కలకలలాడుతున్నవి! ఈ మహాభవనాలన్నీ ఎంత మనోజ్ఞంగా ప్రకాశిస్తున్నవో చూడు!''

దేవర్షి వాక్యాలన్నీ కేవలం నిర్లిప్తుడై ఆలకించిన ధర్మరాజతనితో ఇలా అన్నాడు:

''నా సహోదరులూ, ద్రౌపదీదేవీ లేని ఈ స్వర్గసౌఖ్యాలు నాకెంతమాత్రమూ రుచించవు! నాకు వారితోడిదే లోకం! నేనిప్పుడు వారున్నలోకానికే వెళ్ళిపోవాలని కోరుతున్నాను. ఇదే నా తుదికోరిక.''

దానిపై తిరిగీ దేవేంద్రుడు ధర్మజునితో ఇలా అన్నాడు :

“రాజేంద్రా! పూర్వ పుణ్యకర్మరాశి పరిణతి మూలంగానే నీ కి
మహాపుణ్యలోక ప్రాప్తి కలిగింది. ఈ పునీతస్థానంలో మనుష్యస్నేహాల
కిక ప్రసక్తి కలగనే కలగదు! ఇంతటి మహోత్తమగతి కలిగినా నిన్నింకా
మనుష్యస్వభావం విడిచిపెట్టినట్టు కనబడదు. మహారాజా! దివ్యభోగా
లతో జాజ్వల్యమానంగా వెలిగిపోయే ఈ స్వర్గలోకవైభవం అంతా
ఒక్కమారు కళ్ళారా చూడు! ఈ దేవత లెలాంటి దివ్యభోగాలలో
మునిగి తేలుతున్నారో చూడు!”

ఆ వాక్యాలన్నీ అలవోకగా ఆలకించిన ధర్మరాజు తిరిగి ఒక్క
నిట్టూర్పు విడిచిపెట్టి దేవేంద్రుని కిలా విన్నవించాడు :

“సురేశ్వరా! నా సహోదరులూ, పాంచాలీదేవీ కనిపించని ఈ లోకం అంతా నాకు కేవలం నిస్సారంగా కనిపిస్తున్నది. నే నిక నా సహోదరులూ, ద్రౌపదీ ఉన్నచోటుకే వెళ్ళిపోతాను. వెంటనే ద్రౌపదీదేవి కుమారులతో నివసించే లోకానికే నన్ను పోనీ!”

ఆ ప్రార్థన వినగానే దేవేంద్రుని వాక్కొక్కమారుగా స్తంభించిపోయింది! అత్యాశ్చర్య దృష్టితో ధర్మమూర్తి అయిన ధర్మజుని వైపు తిలకిస్తూ అతడు కేవలం శిలామూర్తిలా నిలబడిపోయాడు!

# గాఢానురాగం

## 1

"ఎక్కడికమ్మా! ఇలా అభిసారికలా బయలుదేరుతున్నా వీ చీకటివేళ?"

"కామదేవాయతనానికి"

"అది నాకు తెలియకపోలేదులే! ఇంతగా చీకటిపడ్డాక బయలు దేరా వేమని నే నడిగేది!"

"స్వామి కల్యాణ మహోత్సవం కళ్ళారా చూచివతా మని!"

"కాదు! నీ వెందుకు బయలుదేరి వెళుతున్నావో నే నెరగ ననుకున్నావా?"

అని గట్టిగా నిలబెట్టి అడిగింది రత్నావళిని—ఆమె చెలికత్తె అపరాజిత. రత్నావళి ఆ ప్రశ్నతో తెల్లబోయింది. అయినా ఏమీ ఎరగనట్టే అమాయకంగా ఆశ్చర్యం నటించింది.

"అంత తెలిసినప్పుడు వేరే నన్నడగడ మెందుకో!" అని, రత్నావళి పక్కనే పూలసజ్జలోని వకుళమాలిక తీసి ఒయ్యారం ఒలక బోస్తూ సిగలో తురిమింది.

అపరాజిత ముక్కుమీద వేలువేసుకొని అలాగే విస్తుపోయి చూసింది :

"కాదుగాని రత్నావళీ! గొప్పఇంటి బిడ్డవు! నీకీ సాహసం తగదుసుమా!"

రత్నావళి ఇంకా అలాగే గుంభనగా ఏమీ ఎరగనట్లొకమారు బొమముడి విరిచింది :

"ఏ సాహసం ?"

"చాల్చాలులే నీ నటన! ఈ మధ్యన మీ యిద్దరి హావభావ చేష్టలు నేను గమనించడం లేదనుకొన్నావా? నే నన్నీ ఒక కంట కనిపెట్టి చూస్తూనే ఉన్నానులే! నిన్న నేను దేవాయతనానికి రాలేదని అనుకున్నావేమో! నీ వెనకాలే వచ్చి మీ ఇద్దరి గుసగుసలు పూర్తిగా విన్నాను ... తెలిసిందా?"

ఆ మాటతో రత్నావళి ముఖం బాగా వెలవెలబోయింది. అయినా ఆమె ఇంకా లేని ధైర్యం నటించడం మానలేదు.

"ఉత్తది! అంతా అభూతకల్పన! నేను నమ్మను."

"మీ సంకేతం కూడా చెప్పమన్నావా? అయితే చెబుతున్నాను విను! స్వామి కళ్యాణమహోత్సవసమయంలో సరీగా మంగళసూత్రధారణ కాగానే నీవా నాగర శ్రేష్ఠితో ఆయన భవంతి ప్రాంగణంలో అడుగుపెట్టి తీరతానని మాట ఇచ్చావు ... అవునా? ఇప్పుడేమంటావు!"

ఆ మాటతో రత్నావళికి తన పరాజయం అంగీకరించక తప్పలేదు:

"సరేగాని మే మిద్దరమేగాని అక్కడ ఎవరూ లేరనుకున్నానే! ఇదంతా నీ కెలా తెలిసింది? నీ వప్పు డెక్కడ నిలబడ్డావు?"

"మంటప స్తంభం మాటున! దాని కేమిగాని, నేను చెప్పినదంతా అక్షరాలా నిజమేనా?"

ఆ ప్రశ్నతో రత్నావళి వంచిన తల మరి పైకెత్తలేదు. అలాగే తలవంచి ఒక్క వేడినిట్టూర్పు విడిచిపెట్టింది:

"నీవు చెప్పింది నిజమే!"

ఆ మాటమీద అపరాజిత సన్నసన్నగా చీవాట్లు పెట్టింది :

"రత్నావళీ! పాలవంటి శ్రీ చందన శ్రేష్ఠి వంశంలో పుట్టావే! అభిజాత్యానికి పేరెక్కిన వజ్రశ్రేష్ఠి భవంతిలో అడుగుపెట్టావే! భర్త రత్నశ్రేష్ఠి నీవంటే పంచప్రాణాలూ ఇస్తూ నిన్నెంతో ఆప్యాయంగా చూచుకుంటున్నాడే! నీ వీ విధంగా మీ కులగౌరవం అంతా ఒక్కమారుగా మంటగలిపివెయ్యడం భావ్యమేనా? నా మాట విను! కొంచెం నిదానించుకో!"

ఆ సదుపదేశంతో రత్నావళి శిరస్సింకా కిందికి వంగిపోయింది:

"అపరాజితా! నే నివన్నీ ఆలోచించలేదనుకొన్నావా? కాని నేను నాగర శ్రేష్ఠిని ఆ కళ్యాణోత్సవంలో ఏక్షణంలో చూచానో అప్పటినించీ నామనస్సలాగయిపోయింది. నే నేమిచెయ్యను! ఇవి చేతులుకావు, కాళ్ళనుకో! ఇక పాలముంచినా నీటముంచినా నీదే భారం!"

రత్నావళి ఎంతో ఆప్యాయంగా అపరాజిత రెండు చేతులూ పట్టుకుని అతిదీనంగా బతిమాలింది. అయినా అపరాజిత ఆమె మాట వినలేదు. ఆమె రెండు చేతులతోనూ అతిదీనంగా పట్టుకున్న తనరెండు చేతులూ ఒక్కమారుగా విదిలించి వేసింది:

"చాల్చాలులే! ఊరుకో! ఎవరైనా వింటే నవ్విపోతారు!"

అని గట్టిగా కసిరింది. ఆ తిరస్కారంతో రత్నావళికి తలకొట్టి వేసినట్టయింది. ఆమె అలాగే దిగాలుపడిపోయి పులుకూ పులుకూ అపరాజితవైపు చూచి మళ్ళీ ఉసూరుమని ఒక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టింది

"అపరాజితా! ఎంతగా మళ్ళించినా నా హృదయం అవశమైపోయిందే! మరింక నేనేమి చెయ్యగలను?"

అని అతిదీనంగా బతిమాలుకుంటూ అపరాజితవైపు చూచింది. రత్నావళి కంఠంలో గద్గదిక పొడచూపింది. క్రమంగా రెండు కళ్ళలోనూ రెండు కన్నీటిబిందువు లుదయించాయి. అవి క్రమంగా రెండు పెద్ద ముత్యాలై నెమ్మది నెమ్మదిగా రెండు చెంపలమీదా దిగజారాయి.

"ఈ బుడిబుడి దీర్ఘాల కేమిలే! ఎల్లాగో అలాగ మనసు నిలవరించుకో! ఇంతమాత్రానికే ఇలా బెంబేలుపడిపోతే ఎలా? మగనాలి కింతటి తెగింపు తగదుసుమా!"

ఆ మాటతో రత్నావళి గొంతెండి పోయింది. అయినా సన్నగా గొంతు సవరించుకొన్నది:

"అపరాజితా! నేనెన్నో విధాల మనస్సు మళ్ళించి వేసుకోవాలనే నిశ్చయించాను. కాని రాత్రింబగళ్ళనుక్షణమూ ఆయన నీడ నన్ను వెన్నాడుతున్నట్టే ఉంది. నా బ్రతుకంతా ఒక దుర్భరభారంగా మారిపోయింది. ఆయన ఒక్కమారు కళ్ళబడగానే ఆ బరువంతా తీరిపోయి, హఠాత్తుగా ఆకాశాని కెగిరిపోయినట్లుంటుంది. ఇక నేనేమి చెయ్యగలనో చెప్పు."

ఆ విధంగా బతిమాలిన తరవాత అపరాజిత నిశ్చలంగా చెలికత్తె కేసి చూసింది. రత్నావళి ఆమె మనస్సు ఇంకా కొంచెం కరిగించడాని కదే అదనని కనిపెట్టింది:

"ఆయన్ని చూచినప్పటినించి నాలో ఏదో అంతర్గతజ్వరం కాస్తున్నట్లే ఉంది. నా అనురాగబలం అలాంటిది - ఇదేమి దురదృష్టమోమరి! నేనేమి చెయ్యను!"

అయినా ఇంకొక క్షణంవరకూ అపరాజిత ఆమెకేసి అలాగే పరిశీలనగా చూచింది:

"నీ వేదో వల్లమాలిన గాఢానురాగంతో తల్లడిల్లి పోతున్నావని భ్రమిస్తున్నావుగాని అసలిది అనురాగం కానేకాదు!"

"అయితే ఏమిటిది?"

"కేవలం అనురాగ భ్రమ, పైగా ఆత్మవంచన! అంతే!"

"నీ కెలా తెలుసు?!"

"ఒకసారి పరీక్షగా కళ్ళలోతులు పరిశీలిస్తే అదిఎంతటి గాఢానురాగమో ఇట్టే కనిపెట్టగలను! తెలిసిందా? మీఆయన నట్టింటలేకుండా దేశాంతరం వెళ్ళడంవల్ల తాత్కాలికంగా నీకీ మతిభ్రమణం బయలుదేరింది. అంతేగాని ఇది అనురాగం మాత్రం కాదు. లేనిపోని దాని

కోసం నీ వెందు కింత రొష్టుపడతావు? నా మాట విను. శాస్త్ర తమాయించుకో! చేతులారా పండంటి కాపరం పాడుచేసుకోకు!''

ఆ ఉపదేశం అంతా విని రత్నావళి అలవోకగా సాధిక్షేపంగా ఒక చిరునవ్వు విరజిమ్మింది :

''అపరాజితా! నీ కెప్పుడైనా ఎవరిమీద నైనా కొంచెం గాఢానురాగం కలిగిందా?''

''ఎందు కలా అడుగుతున్నావు?''

''ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పు.''

''ఆ, కలిగింది! ఇంతకంటె పదివేలింతలు ఎక్కువ గాఢానురాగమే కలిగింది. చివరికి నే నాయన్నే వివాహం చేసుకున్నాను. అప్పటినించీ నా మనస్సులో మరి అన్యచింతే బయలుదేరలేదు. తెలిసిందా?''

''ఉత్తది! అబద్ధా లాడుతున్నావు! ఆ మాత్రం గాఢానురాగం చవిచూచిఉంటే నీ వింత నిర్దాక్షిణ్యంగా కఠినశిలలాగ మాట్లాడవు. అంతే!''

దానిమీద అపరాజిత పక్కుమని ఒక్కనవ్వు నవ్వింది! అపరాజిత ప్రౌఢవయః పరిపాకం బాగా చవిచూచింది. రత్నావళికి పట్టుమని ఇంకా ఇరవయ్యేపడి అయినా దాటలేదు! అందుచేత నే అపరాజిత కంత నవ్వు వచ్చింది :

''ముక్కుపచ్చలారని దానవు. నీ వేదో గాఢానురాగంతో వేగిపోతున్నానని భ్రమిస్తున్నావే! ఈ విషయంలో నేనొక పరీక్ష చేస్తాను గాని, ఆ పరీక్షకు నిలబడగలవా?''

''ఏ పరీక్ష?''

''నీ అనురాగం ఎంతటి గాఢమైందో కొంచెం పరీక్షిస్తాను.''

రత్నావళికూడా పక్కుమని నవ్వింది.

''ఎలా పరీక్షిసావు?''

''నీకొక చిన్నకథ చెబుతాను. తరవాత నిన్ను కొన్ని ప్రశ్న లడిగి పరీక్షిసాను.''

"ఎందుకలా పరీక్షించడం?"

"ఇప్పుడే చెప్పానుగా! నీ గాఢానురాగం లోతెంతో పరీక్షించ డానికని!"

"ఆ పరీక్షలో నేను నెగ్గితేనో?"

"నేనే స్వయంగా నిన్ను తోడుకుపోయి నీ ప్రాణేశ్వరుని శయ్యాగారంలో ప్రవేశపెడతాను. సరిగదా?"

"నిజంగా నేనా! ఇదంతా తప్పించివెయ్యడానికే ఈ విధంగా పన్నాగం పన్నుతున్నావా?"

"నిజంగా నే! నాకంత పన్నాగం పన్నవలసినంత అవసరం ఏమి వచ్చింది? నాకిష్టం లేకపోతే బాహాటంగానే ఇది వల్లకాదని చెప్పి ఉందును. నీ అనురాగపరీక్ష కోసమే నే నీకథ చెబుతున్నాను."

"నన్ను చంపుకుతిన్నట్టేనా?"

"ఆ, నిజంగా నిన్ను చంపుకుతిన్నట్లే!"

మళ్ళీ రత్నావళి కొంచెం ఆలోచించింది :

"ఒకవేళ నేనా పరీక్షలో ఓడిపోతేనో?"

"ఓడిపోతే నీకు కలిగింది గాఢానురాగం కాదన్నమాట!"

"కాకపోతే!"

"నీ విక ఈ గుమ్మం కదిలి వీధిలోకి వెళ్ళడానికి వల్లపడదు! తెలిసిందా?"

"ఏమో! నన్నేదో మోసగించాలని ప్రయత్నిస్తున్నావేమో. నాకీ కథా వద్దు! పరీక్షావద్దు! నాదారిన నన్ను పోనీ!"

"ఏదో గాఢానురాగంతో వేగిపోతున్నాననీ, నా హృదయవేదన ఇంకెవరికీ తెలియదనీ ప్రగల్భాలు పలికావే! ఇంతమాత్రానికా ప్రగల్భా లెందుకు? ఆ మాట మొదటే చెప్పలేక పోయావా? నీ వ్యవహారం అంతా నేను మొట్టమొదటే గ్రహించానులే!"

"ఏ వ్యవహారం?"

"నీ అనురాగము, నీ గుండె అంతటి లోతైనవి కావని!"

ఆ ఎత్తిపొడుపు రత్నావళికి బల్లెంలా పొడుచుకుంది. వెంటనే బింకంగా అడిగింది :

"అయితే ఈ కథాపరీక్ష ఎంతసేపు జరుగుతుంది?"

"ఎంతో సేపా! ఒక్క గడియ చాలు !"

"నేను కల్యాణ సమయానికి ఆయన భవంతికి వెళ్లే అవకాశం ఉంటుందా?"

"ఓ, మహారాజులాగ. కాని నీ వా పరీక్షలో నెగ్గితేనే అక్కడికి వెళ్ళడం ! తెలిసిందా?"

"అలాగే! కథ మొదలుపెట్టు!"

"ఇలా ఆదరాబాదరాగా విన్నావంటే పరీక్షలో నెగ్గుడు రావడం చాలాకష్టం. బాగా జాగ్రత్తగా వినాలి మరి!"

"అయితే ఒక్క నిమిషం ఆగు!"

అని రత్నావళి తొందరగా భవంతిలోపలికి వెళ్ళిపోయింది.

కార్తిక కౌముది పలచ పలచని గోక్షీరంలా ప్రపంచంఅంతటా ప్రసరించింది. రత్నశ్రేష్ఠి భవంతి అంతా ఆ వెన్నెల వెలుగు వెల్లువలో ఒక పెద్దనౌకలా నెమ్మది నెమ్మదిగా తేలింది. వెన్నెల వెలుగులు లతా నికుంజాల నలనల్లని నీడలలో తెలతెల్లని పూలగుత్తుల్లా మెరిసిపోయాయి. ఆకాశంనిండా మంచుతెరలు నిశ్చలంగా వేలాడాయి. దూరదూరంగా దేవాలయంలో కల్యాణసన్నాహ మంగళ తూర్యాలు వినవస్తున్నాయి. తూర్యాల ప్రతిధ్వనులు రత్నావళి హృదయంలో మంద్ర మంద్రంగా ప్రతిధ్వనించాయి. ధారానగరం అంతా ఆ లేత లేత వెన్నెల వెలుగుల్లో వేలాడే మంచుతెరలలో దృశ్యాదృశ్యంగా భాసించింది. జివ్వుమనే చలి ప్రాణుల హృదయాలలో వెచ్చవెచ్చని అనురాగదుగ్ధం పొంగించింది.

రత్నావళి తన అభిసారికావేషం అంతా ముగించుకొని ముంగురులపై నీలివన్నె కాశ్మీర శాలువ మేలిముసుగుగా ధరించి తిరిగీ ఒక

నిమిషంలోనే అపరాజిత దగ్గరికి వచ్చింది. వారిద్దరూ సుఖంగా ఒక రత్నకంబళంమీద కూర్చున్నారు. రత్నావళి ఉజ్జ్వలవేషం చూచి అపరాజిత కన్ను గీటింది :

"నీ ధోరణి చూస్తే తప్పకుండా ఈ విషమపరీక్షలో నెగ్గవలెననే ధీమాతోనే వచ్చినట్లున్నావే !"

"దాని కేమిలే! అనవసర కాలక్షేపంలోకి దింపి కాలహరణం చేద్దామని చూస్తున్నావేమో. నీ పరీక్ష కానీ !"

అపరాజిత అందుకుంది :

"అయితే కథ ప్రారంభించమన్నావా ?"

"త్వరగా ప్రారంభించు! అయితే ఈ కథ నీ స్వకపోల కల్పితమా ? లేక ఎక్కడయినా జరిగిందా ?"

"నేనేమీ కల్పించడం లేదు. అంతా నా కళ్ళ కెదురుగుండా జరిగిందే !"

"ఎక్కడ ?"

"ఈ ధారా నగరంలోనే !"

"ఈ ధారా నగరంలోనా? ఎప్పుడు జరిగింది ?"

"అంతా ఇంచుమించు ఇరవై ఏళ్ళవుతుంది. అప్పటికి నీ వింకా పుట్టనే లేదేమో !"

"మరి నీ వప్పుడెక్కడ ఉండేదానవు ?"

"ఈ కథ జరిగిన భవంతిలోనే దాదిగా ఉండేదాన్ని !"

"ఎవరికి ?"

"కాంచనమాలకు!"

"అయితే ఆ కాంచనమాలే ఈ కథకు నాయిక అన్నమాట!"

"అవును !"

"ఆమె ఇప్పుడెక్కడ ఉంది?"

"కథ మొదటినించీ చెప్పనీయకుండా అడ్డు తగిలితే ఎలాగ కథ కొంచెం మొదలుపెట్టి చెప్పనీ !"

"అయితే కానీ మరి!" అని రత్నావళి మేలిముసుగు ఒళ్ళంతా కప్పుకుని ఎంతో ఆత్రంగా కూర్చుంది. అపరాజిత కథ మొదలు పెట్టింది

"పాపం కాంచనమాలను తలుచుకున్నప్పుడల్లా నా కళ్ళలో మెదులుతున్నట్లే ఉంటుంది. ఆమె కేవలం బంగారపు బొమ్మే! ఎప్పుడూ చిరునవ్వులతోనే సమాధానం చెప్పేది. సన్నగా శలాకలా ఉండేది."

"కథ చెబుతానని నాయిక పాదాదిశిరః పర్యంత వర్ణన మొదలు పెట్టావేమిటి?"

కొంచెం విసుగ్గా అడ్డు తగిలింది రత్నావళి.

"అదే చెబుతున్నాను. చెప్పనీ! అంతలోనే అడ్డుతగిలితే ఎలా!"

అని అపరాజిత మళ్ళీ తన కథ మొదలుపెట్టింది :

"కాంచనమాల అక్షరాలా కాంచనమాలే అని అందరూ ఆమెనెంతో మెచ్చుకొనేవారు. ఆమె మన ధారానగర దండనాయకుడు చండవర్మ కడగొట్టుకూతురు. లేక లేక ఆరుగురు మగపిల్లల తరువాత కలిగిన ఆడపిల్లకదా అని ఆమె నెవ్వరూ నేలమీద నడవనిచ్చేవారు కాదు. అంత అల్లారుముద్దుగా పెరిగింది కాంచనమాల!"

"తరవాత?"

"తరవాత క్రమంగా కాంచనమాలకు పెళ్ళిఈడు వచ్చింది. ఆదేమిచిత్రమోగాని ఎన్ని సంబంధాలు తీసుకువచ్చినా ఆమె కేదీ నచ్చనేలేదు."

అని అపరాజిత ఒక్క పెద్ద నిట్టూరుపు విడిచిపెట్టింది. రత్నావళి అడిగింది

"దానికి కారణం?"

అపరాజిత మళ్ళీ కథ మొదలు పెట్టింది:

"దానికొక పెద కారణమే ఉంది. చండవర్మ మేనల్లుడు చంద్రవర్మ చిన్నప్పటినించి చండవర్మ ఇంట్లోనే పెరిగి పెద్దవాడయి

నాడు. కాంచనమాలా చంద్రవర్మ లిద్దరూ చిన్నప్పుడు కలిసిమెలిసి ఆడుకునేవారు. చంద్రవర్మ తలిదండ్రు లిద్దరూ చిన్నతనంలోనే స్వర్గస్థులైనారు. అందుచేతనే చండవర్మ చంద్రవర్మను అల్లారుముద్దుగా పెంచి పెద్దవాణ్ణి చేశాడు—"

"అయితే కాంచనమాలకు క్రమంగా చంద్రవర్మపై అనురాగం బయలుదేరిందన్నమాట! అంతేనా ?"

"కథ చెప్పనీ! నే నెరిగినంతవరకూ కాంచనమాల ఎన్నడూ చంద్రవర్మనే వివాహమాడతానని పట్టుపట్టలేదు. కాని ఎలాంటి సంబంధం తీసుకువచ్చినా తల వంచుకొని తన కక్కరలేదన్నట్టుగా కంట నీరు పెట్టేది."

మళ్ళీ రత్నావళి ప్రశ్నించింది :

"ఇంతకీ చంద్రవర్మపై ఆమె కనురాగం కలిగిందా? లేదా?"

"రత్నావళీ! నామాటవిని అనవసరంగా అడ్డుతగులకు. నా పోనాన నన్ను చెప్పుకు పోనీ!"

రత్నావళి మౌనం వహించింది. అపరాజిత కథ అందుకుంది :

"కాంచనమాలతల్లి కొంతకాలానికి చంద్రవర్మకు కాంచనమాలపై అనురాగం కలిగిందని గ్రహించింది. కాని ఆమె కాంచనమాలను చంద్రవర్మ కివ్వడాని కిష్టపడలేదు. ఇక కాంచనమాలమాట! ఆమె అగాథ హృదయరహస్యం అటుపిమ్మట చాలా కాలంవరకూ ఎవ్వరికీ తెలియలేదు.

ఒకనాటి సాయంకాలం నేను కాంచనమాలను ఆ ప్రశ్నే అడిగాను. కాంచనమాలను చిన్నప్పటినించీ నేనే పెంచి పెద్దదాన్ని చేశాను. అయినా ఆమె నోరువిడిచి తన హృదయరహస్యం నాకెరిగించలేదు. ఎంతసేపూ ఒకటేమాట ! నా తల్లి దండ్రులిద్దరూ ఎవరిని వివాహం చేసుకోమంటే వారినే వివాహం చేసుకుంటాను. దీనిలో నా ప్రమేయం ఏమున్నా ఉందిగనకనా ? ఎంతసేపూ ఇదే ధోరణి !

ఇక చంద్రవర్మమాట ! అతడు చిన్నప్పటినించి మేనమామ ఒద్దికలో పెరిగాడు. మేనమామకంటె చంద్రవర్మ కిక వేరే కావలసిన

వా రెవరు! అతని మనస్సులో కాంచనమాలపై అనురాగం అంకురించి చిగిర్చినమాట నిజమే! కాని ఏమి చెయ్యగలడు? పైగా మేనమామ భార్యకు కాంచనమాలను తనకిచ్చి వివాహంచెయ్యడం ఇష్టంలేదని గ్రహించివేశాడు.

కాని చండవర్మ కాంచనమాలను చంద్రవర్మకిచ్చి వివాహంచేస్తే బాగుంటుందని అనుకోకపోలేదు. ఒకనా డావిషయం భార్యతో ప్రస్తావించాడు. భార్య ఆ మాట విని విరుచుకుపడింది :

"నాపిల్లను శుభమల్లే ఆ ఊరూ పేరూలేని నిర్భాగ్యుడికిచ్చి పెళ్ళి చెయ్యాలని మీ కెలాతోచింది? ఇంతకీ ఏమిచూసి మీ రీ సంబంధం చేస్తున్నారు. భాగ్యాలా? భోగాలా? ఏమున్నాయి! పట్టుమని పది వేళ్ళు నోట్లోకి వెళ్ళే తాహతయినా లేదాయిరి! ఈ సంబంధం చెయ్యడంకంటె నా పిల్ల కంఠాని కురిబిగించడం మంచిది."

ఆపైన ఊరికే ఉత్తపుణ్యానికని బుడిబుడి దీర్ఘాలు ప్రారంభించింది.

చండవర్మ ధారానగరంలో అంతటా చండప్రచండుడని పేరు పొందాడు! కాని, ఏంలాభం! భార్యదగ్గర పిల్లిపిల్ల అయిపోతాడు! అయినా ఆవేళ కొంచెం సాహసించి, ఏదో పనివాళ్ళిద్దరూ ఒక రొకరంటే ఇష్టపడుతున్నారనీ, వా రిద్దరికీ వివాహంచేస్తే సుఖపడతారనీ నీళ్ళు నములుతూ సన్న సన్నగా నసిగాడు. కాని భార్య దానికంగీకరించలేదు. ససేమిరా వల్లగాదని శరించింది. మేనల్లుడి కిచ్చి పెళ్ళిచేస్తే పిల్లా తనూ కట్టకట్టుకుని దిగుడుబావిలో దిగుతామని బెదిరించింది.

చండవర్మ పెద్దకుమారుడుకూడా తల్లికి ఎన్నెన్నో విధాల చెప్పి చూశాడు. ఎంత చెప్పినా ఆమె దాని కంగీకరించ లేదు.

భార్యాభర్త లిద్దరిమధ్యా ఇలా ఝుంఝూమారుతం చెలరేగుతూంటే కాంచనమాలా, చంద్రవర్మా కళ్ళనీళ్ళు గుక్కుకుని మాట్లాడకూరుకున్నారు. చండవర్మే ఏమీ చెయ్యలేకపోతే ఇక వారేమి చెయ్యగలరు?

ఇలాగుండగా ఇంకొక విడ్డూరంకూడా విరుచుకుపడింది. ధారానగర సైన్యాధ్యక్షుని కుమారుడు విక్రమవర్మ కాంచనమాల రూపు

శేఖుల ప్రశస్తి కర్ణాకర్ణిగా విన్నాడు. ఒకనాడు విక్రమవర్మ రాజవీధిలో తన ఉత్తమాశ్వంమీద ఒయ్యారంగా స్వారిచేస్తూ కాంచనమాల సౌందర్యం స్వయంగా తిలకించాడు.

ఆనాటినుంచీ విక్రమవర్మ కాంచనమాలను తప్ప ఇంకెవరినీ వివాహమాడనని భీష్మించుకుని కూర్చున్నాడు. క్రమంగా ఆ విషయం చండవర్మ చెవిని పడింది. అతడేమీ అనలేక వినీవిననట్టుగా మాట్లాడ ఊరుకున్నాడు.

పాపం, కాంచనమాల ఆ సంగతి విన్నప్పటినుంచి బాగా చిక్కి శల్యమైపోయింది.

క్రమంగా ఆ సంబంధంవ్యవహారం కొంచెం దగ్గరబంధువులద్వారా కాంచనమాల తల్లికీ తెలిసింది. అదివినగానే ఆమె ఒక్క మారుగా ఎగిరిగంతేసింది. కాంచనమాల కన్ని విధాలా అదే తగిన సంబంధమని నిశ్చయించింది. నిజానికనేక విషయాలలో అది తగిన సంబంధమే.

విక్రమవర్మ తల్లిదండ్రులు మహైశ్వర్యవంతులు! పైగా అతని తండ్రి ధారానగర సైన్యాధ్యక్షుడు. వారికి అధికారము, వైభవము, ఐశ్వర్యము అన్నీ ఉన్నాయి. విక్రమవర్మకూడా చూడడానికి కొంచెం బాగానే ఉంటాడు.

చండవర్మ మరి భార్యపోరు పడలేక ఆ సంబంధంవైపు కొంచెం మొగ్గుదల చూపించాడు.

అయితే ఆ సంబంధం కాంచనమాలకు నచ్చలేదని అతనికి తెలుసు. పైగా కాంచనమాల ఆ సంబంధం మాట విన్నప్పటినించీ బాగా పాలిపోయింది. అందుచేత ఒకనాడు చండవర్మ బెదురుతూ బెదురుతూ భార్యతో ఆ మాట ప్రస్తావించాడు. ఆమె అదివిని పక్కున నవ్వింది :

“ముక్కుపచ్చలారని పిల్ల! తనకి తగిన సంబంధం ఏదో దానికేం తెలుసు? ఏదో చిన్నతనంకొద్దీ మన చంద్రవర్మ అంటే కొంచెం మమకారంతో పడి ఏడుస్తూంది. పెళ్ళిచేసిన మరునాటినుంచీ ఈ మమకారాలన్నీ అవే మాయమైపోతాయి.

"అదీగాక చంద్రవర్మ ఈ ఇంట్లో ఉన్నంతకాలమూ అది అలాగే ఉంటుంది. అందుచేత ఏదో మిష పెట్టి చంద్రవర్మ నిక్కడి నించి పంపించి వెయ్యండి! ఆ మరునాడది తనంతట తానే విక్రమవర్మను వివాహమాడడానికి సిద్ధపడుతుంది. ముందెలాగైనా నేను చెప్పిన పని చెయ్యండి. తరవాత దానిచేత ఒప్పించే పూచీ నాది."

ఆమె చాలా చురుగ్గా సలహా ఇచ్చింది.

ఆ తరవాత కొన్నాళ్ళకు చంద్రవర్మకు విశాలాపుర దండనాయక పదవి లభించింది.

ఆ పని కొంచెం రహస్యంగా చండవర్మ చేయించిందే !

అటుపిమ్మట కొంతకాలానికి చంద్రవర్మ విశాలాపురానికి బయలుదేరి వెళ్ళిపోయాడు."

అంతవరకూ కాంచనమాల కథ చెప్పిన అపరాజిత ఒక క్షణం సేపేదో ఆలోచించి ఉసూరుమని దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టింది.

రత్నావళి దూర దూరంగా కామదేవాయతనంలో ధ్వనించే కళ్యాణ తూర్యాల ధ్వని విని అదిరిపడింది:

"అప్పుడే స్వామి కళ్యాణం ప్రారంభమైనట్లుందే! ఇంకా ఈ కథ ఎంతసేపు పడుతుందో?"

ఎంతో ఆత్రంగా అడిగింది.

"ఎంతోసేపా! నువ్వు మధ్య మధ్య అడ్డుప్రశ్నలు వెయ్యక పోతే అరగడియసేపు పట్టదు. ఇంతకీ నీకీ కథ విన సొంపుగా లేదా?"

అపరాజిత రత్నావళి వైపాక చిరునవ్వురేక విసిరింది.

"లేకేమి? ఆ కాంచనమాల కూడా నాలాంటి దురదృష్టవంతురాలు లాగే కనిపిస్తూంది...సరే, దానికేమిగాని ఆ తరవాత ఏమైంది?"

కాంచనమాల ఎంతో ఆత్రంగా అపరాజితవైపు చూసింది. ఆమె మళ్ళీ మిగిలిన కథ అందుకుంది :

''పాపం! కాంచనమాలకు చంద్రవర్మ విశాలా నగరానికి వెళ్ళి పోవడం ఎంతైనా మనఃక్లేశం కలిగించింది. అతడు బయలుదేరి వెళ్ళి పోతూంటే కనుచూపు మేర వరకూ ఆమె అతడెక్కిపోయే అశ్వంవైపు నిశ్చలంగా రెప్ప వాల్చకుండా చూచింది. ఆ సమయంలో నేనామె పక్కనే నిలుచున్నాను. ఆ అశ్వం కనుచూపుమేర దాటిపోగానే ఆమె కళ్ళల్లోని వెలుగొక్కమారుగా అదృశ్యమై పోయింది!

చంద్రవర్మ విశాలా నగరానికి వెళ్ళిపోవడానికి కారణం తన తండ్రి చండవర్మేనని కాంచనమాల గ్రహించి వేసింది. చంద్రవర్మ చండ వర్మమాట కెదురాడలేక తలవంచుకొని విశాలా నగరానికి వెళ్ళిపోతే, మరి కాంచనమాల ఏమి చెయ్యగలదు?

అటు పిమ్మట ఇంచుమించు ఒకమాసం గడిచిపోయింది.

విక్రమవర్మ తనపట్టు విడవలేదు. కాంచనమాలను తప్ప మరెవరినీ వివాహమాడననీ, ఆ వివాహం కాని పక్షంలో ఆజన్మ బ్రహ్మచారిగానే ఉండిపోతాననీ శపథం పట్టాడు.

ఐశ్వర్యాధికారాలలో విక్రమవర్మ తండ్రి చండవర్మకన్న గొప్ప వాడని నేనిదివరకే సూచించాను. పైగా కాంచనమాల తల్లికి ఆ సంబంధం అన్నివిధాలా నచ్చిందికూడాను. నెమ్మదిగా ఆమె భర్తను కూడా ఒప్పించింది. ఇంక కాంచనమాలే మిగిలింది. కాని ఆమె క్రమ క్రమంగా దారిలోకి రాకపోదని తల్లి గట్టినమ్మకం! అయితే కాంచన మాల ధోరణి చూస్తే ఆమె కేమీ పాలుపోలేదు.

ఒకనాడు దీపదీపాలవేళ కాంచనమాల భవంతిలోపల గదిలో ఒకమూల పరధ్యానంగా కూర్చుంది. ఆ గది అంతా బాగా చీకటిగా ఉంది. నేనప్పుడే ఆ గదిలోకి వెళ్ళాను. ఎందుచేతనో పరిచారిక లెవరూ అక్కడ దీపం పెట్టలేదు. కాంచనమాల ఏదో ఆలోచిస్తూంది. ఆమెధోరణి పరిశీలిస్తే నిశ్చలంగా దేనివైపో చూస్తూన్నట్లు కనబడింది. ఆ సమయంలో కాంచనమాల ఆ గది కంతటికీ అప్పుడే వెలిగించిన కర్పూర దీపంలా కనిపించింది. ఆమె అలా చీకటిలో ఏకాకిగా పడి ఉండడంచూస్తే నాకడుపు తరుక్కుపోయింది.

ఒక దీపం వెలిగించి ఆ గదిలోకి తీసుకువెళ్ళాను. అంతలోనే ఆమె తల్లికూడా అక్కడికి వచ్చింది. నెమ్మదిగా కుమార్తె పక్కన కూర్చుని తల నిమిరింది.

"కాంచనమాలా! మీ నాయనగారు నేను చెప్పిన సంబంధం నిశ్చయం చేదామనుకుంటున్నారమ్మా!"

అని నిదానంగా కాంచనమాలవైపు చూచింది.

కాంచనమాల మాట్లాడలేదు. తల్లి మళ్ళీ అందుకుంది:

"ఇదిగో! చూడమ్మా! వాళ్ళన్నివిధాలా మనకన్నా చాలా గొప్పవాళ్ళు. నీ కలాంటి సంబంధం వచ్చిందంటే అదంతా పూర్వ జన్మంలో చేసుకున్న పూజా ఫలితమే అనుకో! అదీగాక నీవు చూశావో లేదోగాని విక్రమవర్మకూడా చక్కగానే ఉంటాడు. అన్నివిధాలా మన కదే తగిన సంబంధం. నీ వీ సంబంధం చేసుకుంటే బాగా సుఖపడ తావు. నా మాట వినమ్మా!"

అని చాలా చాలా నచ్చజెప్పింది. కాంచనమాల ఆ మాట లన్నీ విని తల వంచుకుని కూర్చుంది. అంతేగాని అవుననిగాని కాదని గాని మాట్లాడలేదు. కొంతసేపటి కేదో సమాధానం చెప్పబోయి గొంతు సవరించుకుంది.

ఆ పైన నేనందుకొన్నాను:

"అమ్మా! కాంచనమాల చిన్నపిల్ల. నోరు విడిచి ఏమని మాట్లాడుతుంది? అమ్మాయి కేది మంచి సంబంధమో మీకు మాత్రం తెలియదు గనకనా? ప్రత్యేకంగా అడగడమెందుకు? మనస్సులో ఉన్నదేదో పైకి చెప్పడానికి సిగ్గుపడుతూందేమో!" అలవోకగా కాంచనమాలకేసి చూచాను. నా మాటలు విని ఆమె కొరకొర లాడుతూ చూసింది.

"అయితే ఇది నీకిష్టమేనన్నమాట! మీ నాయనగారితో అలా గని చెబుతాను. సరేనా?" అని కాంచనమాల తల్లి లేచి నిలబడింది. అంతలోనే చండవర్మ అక్కడికి వచ్చాడు. జిజ్ఞాసా దృష్టితో భార్య వైపు చూశాడు. కాంచనమాల తల్లి చంద్రవర్మను చూస్తూనే సమా ధానం చెప్పింది.

"లోలోపల ఇష్టపడినా పైకి చెప్పడానికెందుకో సిగ్గుపడు తూన్నట్టుంది. అయినా ముక్కూ, మొహమూ తెలియని చిన్నపిల్ల, దానికేం తెలుసు!"

అని అంటీ అంటనట్టుగా చప్పరించి వేసింది. చండవర్మ భార్యతో కలిసి అక్కడినించి వెళ్ళిపోయాడు.

ఆ తరవాత చండవర్మ ఆ సంబంధమే స్థిరపరిచాడు. సంబంధం నిశ్చయమయిన తరువాత నాలుగైదు రోజులలో కాంచనమాలా విక్రమ వర్మలిద్దరికీ ఎంతో వైభవంగా వివాహం జరిగిపోయింది.

వివాహమైన అయిదారు మాసాలలో కాంచనమాల అత్తవారింటికి వెళ్ళిపోయింది. చిన్నప్పటినించి పెంచిన మమకారం కొద్దీ నేను కూడా ఆమెతో కలిసి అత్తవారింటికి వెళ్ళాను.

చండవర్మ కాంచనమాల వివాహానికి చంద్రవర్మను అంటీ అంటనట్టుగా పిలిచాడు. అందుచేత చంద్రవర్మ కాంచనమాల వివాహానికి రానేలేదు. అతడు రాకపోవడం ఒకవిధంగా మంచిదే అయిందిగాని అందుచేత కాంచనమాల ముఖంలో కేవలం ముభావంతప్ప మరేమీ కనిపించలేదు.

విక్రమవర్మకు కాంచనమాలా చంద్రవర్మల పరస్పరానురాగ వ్యవహారం స్పష్టంగా తెలిసిందో లేదో నాకు తెలియదు. ఏదైనా కొంచెం చూచాయగా తెలిస్తే తెలిసిఉండవచ్చుననే నా నమ్మిక.

ఏది ఏమైనా అతనికి కాంచనమాలమీద కలిగిన అనురాగం అపారం! అతడొక్క నిమిషమైనా ఆమెను విడిచిపెట్టి ఉండలేక పోయేవాడు!"

అని అపరాజిత, అంతలో ఏదో జ్ఞాపకంవచ్చి, హఠాత్తుగా అంతటితో తన కథ ఆపివేసింది.

రత్నావళికి క్రమక్రమంగా కథమీద ఆసక్తి పెరిగింది. అందుచేత ఎంతో ఆతృతంగా అడిగింది:

"హఠాత్తుగా కథ ఆపివేశావే! ఆ తరవాత ఏం జరిగింది?"

అపరాజిత మళ్ళీ అందుకుంది:

"రత్నావళీ! వివాహమయిన కొంతకాలందాకా మగవారందరూ భార్యలంటే వల్లమాలిన మమకారం చూపిస్తారు. కాని తరవాత తర వాత మగవారికి 'భార్య' అంటే గడ్డిపోచకన్నా తేలికై పోతుంది. ఆమె ఎంతటి అందకత్తెకానీ, ఎంతటి అనురాగంతోనైనా కాళ్ళా వేళ్ళాపడి వేళ్ళాడనీ ఆదేమి పాపమోగాని భార్యఅంటే అంత తేలికై పోతుంది!

కాంచనమాలా చంద్రవర్మల అనురాగం విక్రమవర్మకు కొంచెం తెలిసిందే అనుకుందాము. అయినా అతడామె నెప్పుడూ కింద నడవ నిచ్చేవాడే కాదు!

వివాహమయ్యాక ఇంచుమించు ఒక ఏడాది గడిచిపోయింది. అయినా కాంచనమాలమీద విక్రమవర్మ అనురాగం అణువంతైనా తగ్గిపోలేదు.

అతడామె కెన్నెన్నో అలంకారాలు, అందమైన చీరెలు బహూక రించేవాడు. ఆమె నడిస్తేనే పాదాలు కందిపోతాయేమో అన్నట్లు మాట్లాడేవాడు. ఆమె మనస్సులో ఏమి కావాలనుకున్నా అవి ఆ మరునాడే ఆమెఒళ్ళో వచ్చిపడేవి. విక్రమవర్మ కాంచనమాలపై అంతటి ఆప్యాయత కనబరచేవాడు.

ఇక కాంచనమాల సంగతి. వివాహమైన చాలాకాలంవరకూ ఆమె ధోరణి ఏమీ మారలేదు. కాని భర్త విక్రమవర్మ ఆదరాభిమానాలు చూరగొన్నకొద్దీ ఆమె ధోరణి కొంతవరకు మారింది.

నేనా ధోరణి కెంతో సంతోషించాను. క్రమంగా ఆమె పెదవు లపై చిరునవ్వులపూత ప్రారంభించింది.

కొందరు యువతు లెలాఉన్నా సౌందర్యవతులుగానే కని పిస్తారు. విషణ్ణవదనంతో వెలవెలబోతున్నా కాంచనమాలకది ఒక ప్రత్యేకాలంకారంగానే కనిపించేది. ఎంతో బెంగటిల్లి కృశించిపోయినా ఒక్క రవ్వ చిరునవ్వు మెరిసేసరికి కాంచనమాల ముఖసౌందర్యం వేయి మడుగు లతిశయించేది!

కొంతకాలంపాటు చంద్రవర్మకోసం కుమిలి కృశించినా క్రమ క్రమంగా ఆమె ఆ విషయమంతా మరిచిపోయి స్తిమితపడగలదనీ, కాంచనమాలా విక్రమవర్మల అన్యోన్యత క్రమక్రమంగా వృద్ధిపొంద గలదనీ అనుకున్నాను. అది చాలావరకు నే ననుకున్నట్టే జరిగింది. కాంచనమాల అత్తింటివారూ పుట్టింటివారూ ధారానగరవాసులే కనుక తల్లిదండ్రులుకూడా అప్పుడప్పుడామెను చూచి వెళుతూండేవారు. కాంచనమాల కూడా అడపాదడపా పుట్టింటికి వెళ్ళివస్తూండేది.

ఆ తరవాత కొంతకాలానికొక చిన్న సంఘటన జరిగింది. ఒక నాడు చంద్రవర్మ విశాలా నగరంనించి కాంచనమాలను చూడాలనే కుతూహలంతో ఆమె అత్తవారింటికి వచ్చాడు.

నే నా సమయంలో కాంచనమాలతో ఏదో పిచ్చాపాటీ మాట్లాడు తున్నాను.

చంద్రవర్మను చూచీచూడడంతో కాంచనమాల తటాలున లేచి నిలబడింది. ఆత్మీయంతో ఆప్యాయంగా ఆదరించింది. ఆ సమ యంలో ఆమె ముఖం చూచితీరాలి! ఒక్కసారిగా ఆమెకళ్ళ వేయి కర్పూరదీపాలు వెలిగినట్టుగా తళతళా మెరిసిపోయాయి. ఆమె శరీరంలో అంతటా ఏదో అపూర్వమయిన ఆనంద చైతన్యం ప్రవహించి నట్లయింది. కొంచెం కుశల ప్రశ్నాదికం జరిగిన తరవాత కాంచన మాల వ్యంగ్యంగా అడిగింది:

"ఇన్నాళ్ళకి నేను కొంచెం జ్ఞాపకం వచ్చానన్నమాట! పోనీ అదే పదివేలు!"

ఆ మాటతో చంద్రవర్మ అదిరిపడ్డాడు:

"అదేమిటి! అలా మాట్లాడుతున్నావు?"

"ఏం!"

"నేను నిన్ను మరిచిపోవడ మేమిటి?"

"మరిచిపోకపోతే నా వివాహాని కెందుకు రాలేదో!"

"నీ మనస్సు నొప్పించడం ఇష్టంలేక!"

"ఓహో! అలాగా! ఒకవేళ నా మీదకాని కోపం వచ్చిందేమోనని అనుకున్నాను."

"మధ్య నీమీద కోపం ఎందుకు?"

"అయితే ఈ కోపం అంతా ఎవరిమీద?"

ఆ ప్రశ్న విని చంద్రవర్మ గుండెలలో ఉన్న ఊపిరి అంతా ఒక్కమారుగా విడిచిపెట్టాడు:

"కాంచనమాలా! ఎవరిమీద కోపపడితే ఏం లాభం! నేను నీ వివాహానికి రావడం మీ నాయనగారికే ఇష్టంలేదు. అది నీకు మాత్రం తెలియదా?"

ఆ మాటతో కాంచనమాల తల వంచుకొన్నది:

"పోనీలే! ఇన్నాళ్ళకయినా నా మీద కొంచెం జాలి కలిగింది."

అని చంద్రవర్మ విశాలాపురం వెళ్ళినప్పటినించి జరిగిన విశేషాలన్నీ గుచ్చి గుచ్చి అడిగింది.

నేను కొంచెం సమీపంలోనే ఉండి ఏవేవో గృహకృత్యాలు నిర్వర్తిస్తూ వారి ధోరణి అంతా ఒక కంట కనిపెట్టి చూస్తూనే ఉన్నాను. వారేవో అనేక విషయాలను గురించి ఎంతో ఉల్లాసంగా మాట్లాడుకున్నారు. వారి మాటలలో ఎన్నెన్నో చిత్రవిచిత్ర విషయాలు దొర్లిపోయాయి! ఒక్కొక్కప్పుడు వారి సంభాషణ కొక దారీ తెన్నూ ఉన్నట్లే కనబడలేదు. నీ వెప్పుడైనా ఇద్దరు పసిపిల్లలు మాట్లాడుకునే ధోరణి విన్నావో లేదో! కాంచనమాలా చంద్రవర్మ లిద్దరి ప్రసంగాలూ సరీగా ఆ విధంగానే ఒక తుదీ మొదలూ లేకుండా ఎంతో సేపు సాగిపోయాయి. వారిద్దరూ ఆ సమయంలో ఎంత ఆప్యాయంగా మాట్లాడుకొన్నారు!

## 5

అప్పటికి సూర్యాస్తమయం అయింది. మరి కొంత సేపటికి విక్రమవర్మా, వృద్ధులైన అతని తల్లిదండ్రులూ అక్కడికి వచ్చారు. విక్రమవర్మ చంద్రవర్మనెంతో ఆదరించి గౌరవించాడు. చంద్రవర్మ యెడల

అతడు కనబరిచిన ఆదరాభిమానాలు చూస్తే నాకే ఆశ్చర్యం వేసింది. విక్రమవర్మ చంద్రవర్మనింకా నాలుగైదు రోజుల వరకూ తమ ఇంట ఉండవలసిందని బలవంత పెట్టాడు. కాని చంద్రవర్మ అక్కడ ఒకటి రెండు రోజులకంటె ఉండలేదు. ఆ తరవాత అతడు మేనమామ చండవర్మ భవంతికి వెళ్ళి రెండు మూడు రోజులుండి తిరిగి విశాలాపురం వెళ్ళిపోయాడు. అంతకు మునుపు మళ్ళీ ఒకసారి వచ్చి కాంచనమాలను చూచి మరీ ప్రయాణమయినాడు.

అటుపిమ్మట నాలుగైదు మాసాలలో కాంచనమాల బాగా చిక్కి శల్యమైపోయింది. కారణమేమో ఎవరికీ తెలియలేదు. ఆ రోజుల్లో విక్రమవర్మ ఆమెనొక నిమిషమైనా విడిచిపెట్టకుండా కంటికి రెప్పలా కనిపెట్టుకుని ఉండేవాడు. ఎందరెందరినో ధారానగర రాజ వైద్యులను పిలిపించి కాంచనమాల కనేక విధాలుగా వైద్యాలు చేయించాడు. ఏ వైద్యం చేసినా కాంచనమాల నాలుగురోజుల పాటూరోగ్యంగా ఉన్నట్టు కనబడేది. ఆ తరవాత అదేవ్యాధి మళ్ళీ మొదటికి వచ్చేది.

కాంచనమాల క్రమక్రమంగా మంచం పట్టింది. విక్రమవర్మ పరిచారికల నేర్పాటుచేసి ఎంతో శ్రద్ధగా ఆమెకు పరిచర్యలు చేయించాడు. అహర్నిశలూ ఆమె సన్నిధినే కూర్చుండి పరిహాస ప్రసంగాలతో ఉల్లాసం కలిగిస్తూ ఆమెతోబాటు కాలక్షేపం చేసేవాడు.

కాంచనమాల వ్యాధి క్రమక్రమంగా ఎక్కువైనట్లే కనబడింది గాని, తగ్గే సూచనలేవీ కనిపించలేదు. ఎన్ని వైద్యాలు చేయించినా తాత్కాలికంగానే కొంచెం ఉపశమించినట్లు కనిపించేది. ఆ వ్యాధి ఏమో ఎవరికీ తెలియలేదు.

ఒకనాటి రాత్రి నేనూ, విక్రమవర్మా కాంచనమాల శయ్యకు సమీపంలో కూర్చున్నాము. ఆమె పరిస్థితి ఏమీ బాగాలేదు. విక్రమవర్మ ఆమె రుగ్మతధోరణి చూచి ఉసూరుమని ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు :

"కాంచనమాలా! నీ వంట్లో ఎలాగుంది? కన్నెత్తి నాతో మాట్లాడవేమి? అయ్యో! నానాటి ఇలాగయిపోతున్నావేమిటి? మా

వారందరితోటీ పెద్ద యుద్ధం చేసి, ఏరి కోరి నిన్ను వివాహం చేసు కున్నాను. అదేమి పాపమో గాని ఆ నాటినించీ నీ వీ విధంగా చిక్కి శల్యమైపోతున్నావు! ఇదంతా నా దురదృష్టమే! నేను పూర్వజన్మంలో చేసుకున్న పుణ్యం ఇంతే!''

ఆ తరవాత కొంచెం గద్గద భారంవల్ల అతని నోట మాట పెగలలేదు.

కాంచనమాల ఒక్కసారి కన్నెత్తి అతనికేసి చూసింది. ఆమె నేత్రాలరనిమేషం వరకు అలాగే నిశ్చలంగా ఉండిపోయాయి. తరవాత ఆమె రెండు కనుగొలుకులనుండి బొట బొటా వేడి కన్నీరు ప్రవ హించింది. కాంచనమాల కంఠం గద్గద భారంతో వణికిపోయింది:

''ఆ దురదృష్టం మీదికాదు. నాది! నేను మీవంటివారికి తగను! ఇలా జీవచ్ఛవంలాగ జీవించడంకంటె మరణించడమే మంచిది. నా కోసం మీ రెందు కింతగా శ్రమ పడతారు? ఇక నే నాట్టే కాలం జీవిస్తానని తోచదు.''

''కాంచనమాలా! అదేమిటి అలాగంటావు! తప్పు! తప్పు!''

అని విక్రమవర్మ కాంచనమాల ముంగురులు నిమురుతూ ఆమె శయ్యమీద కూర్చున్నాడు.

తరవాత కాంచనమాల లోలోపల దుఃఖం నిలవరించుకోలేక పట్టి పసిపాపలా వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆమె అలా కుమిలి కుమిలి దుఃఖించడానికి కారణమేమో మొట్టమొదట మాకెవరికీ తెలియలేదు. రుగ్మతవల్ల ఏర్పడిన శరీర మనోదౌర్బల్యాలే దానికి కారణమై ఉండవచ్చునని అనుకొన్నాము.

ఒకనాటి రాత్రి చాలా పొద్దుపోయేదాకా నేను కాంచనమాల మంచం పక్కనే కూర్చున్నాను. చిక్కి శల్యమైపోయిన కాంచన మాల ముఖం ఆ దీపకాంతిలో నక్షత్రకాంతిలో శుద్ధ పాడ్యమినాటి చంద్రవంకలా మెరిసింది. చిక్కి శల్యమైనా ఆమె ముఖంలో కళా కాంతులు తగ్గలేదు.

అక్కడికి వెళ్ళిన చాలా సేపటిదాకా కాంచనమాల నేనున్న సంగతి గుర్తించలేదు. కొంత సేపటికి నా ఉనికి గమనించింది. నేనామె దగ్గిరికి వెళ్ళి నెమ్మదిగా అన్నాను :

"కాంచనమాలా! నీ ధోరణి చూస్తే ఏదో నల్లమాలిన మనోవ్యాధితో బాధపడుతున్నట్లున్నావు. అదేమిటో కాస్త నా చెవిని వేస్తే తప్పా?"

కాంచనమాల చాలా సేపటిదాకా దాని కేమీ ప్రత్యుత్తరం చెప్పలేదు. తరవాత ఏమాలోచించిందో మరి! మెల్లిగా పెదవి కదిపించింది:

"చెవి తేమాత్రం ఏం లాభం!"

ప్రాణంవిడిచిన ట్టొక దీర్ఘనిశ్వాసం విడిచింది.

"పోనీ! అదేదో కొంచెం నా చెవిని వేస్తే తప్పా?"

తిరిగి ఎంతో ఆప్యాయంగా బ్రతిమాలుకొన్నాను.

చిట్టచివరికి కాంచనమాల సమాధానం చెప్పింది :

"అపరాజితా! నీవు నాకు చేసే పరిచర్య కేమి చేసినా నీ ఋణం తీర్చుకోలేను. ఇక ఈ ఒక్క ఉపకారం చేస్తివా, నీ కెంతైనా ఋణపడి ఉంటాను. నేనిక అట్టే కాలం జీవిస్తానని తోచదు. ప్రాణాలు విడిచేముందు చంద్రవర్మ నొక్కమారు కళ్ళారా చూడాలని ఉంది. అంతే! మా వాళ్ళందరూ అప్పుడప్పుడు నన్ను చూడడానికి వస్తూనే ఉన్నారు గదా. నా కిక కోరికలేవీ లేవు."

అని ఇక మరి మాట్లాడలేక కళ్ళు వాల్చింది. అంతలో విక్రమవర్మ అక్కడికి వచ్చాడు. ఆమె పరిస్థితి చూచి అతడలాగే దిగాలు పడిపోయాడు. నేను కొంచెం తటపటాయిస్తూ విక్రమవర్మతో అన్నాను:

"కాంచనమాల పరిస్థితి ఏమీ బాగాలేదు. ఒకసారి మనవాళ్ళకీ, చంద్రవర్మకీ కబురు పంపిస్తే మంచిదేమో."

వెంటనే విక్రమవర్మ కాంచనమాల తల్లిదండ్రులకా విషయం కబురు పంపించాడు. ప్రత్యేక దూత ద్వారా చంద్రవర్మకి కూడా వర్తమానం పంపించాడు.

# 6

కాంచనమాల దుర్భర పరిస్థితి విని చంద్రవర్మ ఉరకలు వేసుకుంటూ ధారా నగరానికి పరుగెత్తుకు వచ్చాడు. ఆమె తల్లి దండ్రులు అంతకు పూర్వమే విక్రమవర్మ భవంతికి చేరుకున్నారు. అతని తల్లి దండ్రులుకూడా కాంచనమాల అనారోగ్య పరిస్థితి చూసి గుడ్ల నీరు కుక్కుకోవడం ప్రారంభించారు. నానాటికీ కృశించిపోతున్న కాంచనమాల దేహస్థితి చూసి ఆమె మరి జీవించదనే నేను అనుకున్నాను.

కాని క్రమంగా కాంచనమాల ఆరోగ్యం కొంచెం కుదటపడడం ప్రారంభించింది. ఇంకొక నాలుగైదు రోజులు గడిచేసరికి కాంచనమాల కిక భయంలేదని అనిపించింది. తరవాత కొన్నాళ్ళకు కాంచనమాల తల్లిదండ్రు లిద్దరూ తమ భవంతికి వెళ్ళిపోయారు. విక్రమవర్మ తల్లి దండ్రులకుకూడా కాంచనమాలకేమీ భయం లేదని ధైర్యం కలిగింది. అయినా అప్పటినించి వారు కాంచనమాల కింకా బాగా ఆరోగ్యం కలగడంకోసం గృహదేవతలకు పూజా పునస్కారాలు చేయించడం మొదలు పెట్టారు. స్వయంగా తాముకూడా పూజా పునస్కారాలు ప్రారంభించి రాత్రింబగళ్ళు జంజాటంలో పడిపోయారు.

చంద్రవర్మ రాకవల్లనే కాంచనమాల ఆరోగ్యం కొంచెం కుదట బడుతున్న సంగతి విక్రమవర్మ గ్రహించకపోలేదు. ఆ సంగతి చంద్ర వర్మకూడా పసిగట్టాడు. కాని అతడా పరిస్థితి గమనించినప్పటినించి బాగా ఇరుకులో పడిపోయాడు. త్వరలోనే తిరిగి విశాలా నగరానికి మరలిపోవాలని అనుకున్నాడు.

క్రమక్రమంగా కాంచనమాల ఆరోగ్యం ఇంకా బాగా అభివృద్ధి చెందింది. మంచం పట్టిపోయిన కాంచనమాల మళ్ళీ లేచి భవంతిలో నాలుగుమూలలా మసలడం మొదలుపెట్టింది.

ధారా నగర వైద్యులెవరికీ ఆమె ఆరోగ్యం క్షీణించిపోడానికి గాని, మళ్ళీ కోలుకోడానికిగాని కారణమేమో తెలియలేదు. ఇంకా కొంచెం గొప్ప రాజవైద్యుల నెవరినైనా పిలిపించి వైద్యం చేయిస్తే మంచిదని ఆ ఇంట్లో ఉన్నవారందరూ అనుకున్నారు. విశాలాపురంలో

అలాంటి పేరెక్కిన ఘనవైద్యులున్నారనీ, వారిని పిలిపిస్తే మంచిదనీ చంద్రవర్మ అన్నాడు. కావలిస్తే వెంటనే తాను విశాలా నగరం వెళ్ళి ఆ రాజవైద్యులను వెంటనే ధారా నగరానికి పంపించే ఏర్పాటు చేస్తానని కూడా చెప్పాడు.

ఆమాట వినగానే కొంచెం దూరంలో విశ్రాంతికోసం శయ్యపై ఒరిగిన కాంచనమాల ముఖకవళిక హఠాత్తుగా మారిపోయింది. పక్కనే కూర్చున్న విక్రమవర్మ అది గమనించినా గమనించనట్లే నటించాడు. చంద్రవర్మ ఇక ఎవరివైపూ చూడకుండా గవాక్షంకేసి చూస్తూ కూర్చున్నాడు. కొంతసేపటికి విక్రమవర్మతో వినబడీ వినబడనట్లు నెమ్మదిగా అన్నాడు:

“నేను రేపే విశాలాపురానికి బయలుదేరి రాజవైద్యులెవరినైనా ఇక్కడికి పంపిద్దామనుకుంటున్నాను.”

ఆ మాటవిని కాంచనమాల చంద్రవర్మకేసి రెప్పవాల్చకుండా చూసింది. విక్రమవర్మ కొంచెం తటపటాయించాడు.

“పోనీ, నేనే విశాలానగరం వెడితే?”

“మీ రక్కడి రాజవైద్యుల నెవరినైనా ఎరుగుదురా?”

“ఒక వైద్యుణ్ని కొంచెం బాగానే ఎరుగుదును.”

“పోనీ, నేనుకూడా మీతో వస్తాను!”

“మీ రెందుకు? నేను తిరిగివచ్చేదాకా ఇక్కడే ఉండండి! ఇక్కడ ఎవరో ఒకరుండకపోతే ఎలాగ? మా నాయనగారు బొత్తిగా కాలు కదపలేని స్థితిలో ఉన్నారు! తలవనితలంపుగా ఏదైనా అవాంతరం వస్తే!”

విక్రమవర్మ ఆనాటి సాయంత్రమే విశాలానగరానికి బయలుదేరాడు. వెళ్ళేటప్పుడు ముందుగా కాంచనమాలతో ఆ సంగతి చెప్పాడు. ఆమె కొంతసేపటివరకూ అతనివైపు కళ్ళెత్తి చూడనేలేదు. విక్రమవర్మ మళ్ళీ అడిగాడు:

“నేను బయలుదేరి వెళ్ళనా మరి?”

దానిమీద కాంచనమాల మూతి బిగించింది.

"మీరు వెళ్ళవద్దు!"

"ఎవరో ఒకరు వెళ్ళకపోతే ఎలాగ?"

అని విక్రమవర్మ అలాగే ఆమె వైఖరి గమనించాడు.

"ప్రస్తుతం నాకేమీ భయంలేదు. క్రమంగా నా దేహస్థితి దానంతట అదే కుదటపడుతుంది. మీరు లేకపోతే నా కెందుకో గుబులు బయలుదేరుతుంది."

"సరేగాని మళ్ళీ రోగం తిరగబెడితేనో?"

"ఏమైనా సరే, మీ రక్కడికి వెళ్ళడానికి వీల్లేదు."

కాంచనమాల విక్రమవర్మ చెయ్యి గట్టిగా పట్టుకుంది. విక్రమవర్మ ఆమెను బుజ్జగిస్తూ నెమ్మదిగా చేతిపట్టు విడిపించుకొన్నాడు :

"కాంచనమాలా! నేను మళ్ళీ త్వరలోనే తిరిగివచ్చి వేస్తాను. ఎంతయినా రెండు మూడు రోజులకంటె ఎక్కువ ఆలస్యంకాదు. నన్ను వెళ్ళనీ. ఏమో! ఎవరి హస్తవాసిలో ఏమి విశేషం ఉందో! ఎవరు చెప్పగలరు? అక్కడి వైద్యులెవరయినా వ్యాధి పూర్తిగా నయంచేస్తారేమో, ఎందుకైనా మంచిది. కొంచెం ముందుగానే మేలుకోవాలి."

విక్రమవర్మ నెమ్మదిగా బుజ్జగించి విశాలాపురానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. కాంచనమాల కనిపించినంతవరకు రెప్పపాటు లేకుండా నిశ్చలంగా అతనివైపు చూచింది. తరవాత నీరసంగా కళ్ళు మూసింది. ఆమె కళ్ళు రెండూ వేడివేడి కన్నీటిలో నానిపోయాయి.

అపరాజిత ఒకటి రెండు నిమిషాలవరకూ ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. రత్నావళి ఆమె నేదో అడగబోయింది. అది గ్రహించి అపరాజిత మళ్ళీ మొదలు పెట్టింది :

"రత్నావళీ! అదేమి చిత్రమోగాని ఆ మరునాడు కాంచనమాల అభ్యంగనస్నానం చేసి నూతన వధువులా ఎంతో చక్కగా అలంకరించుకొని స్వయంగా గృహదేవతాపూజ చేసింది. అత్తమామలిద్దరికీ ఎంతో భక్తిగా నమస్కరించింది.

ఆ తరవాత నాకు నమస్కరించింది. నే నడిగాను.

"కాంచనమాలా! ఏమిటిదంతా? సాక్షాత్తూ కొత్త పెళ్ళికూతురులా అలంకరించుకొన్నావే!"

"ఈ వేళ నా పుట్టినరోజు!"

ఆ మాట విని నే నాశ్చర్యపోయాను. మే మందరమూ ఆమె రుగ్మతగొడవలలో పడి ఆ విషయమే మరిచిపోయాము. నేను కాళ్ళు కొంచెం వెనక్కి తీసుకున్నాను. 'నా కెందుకమ్మా నమస్కరిస్తావు!'

"చిన్నప్పటి నించి నాకు తల్లివైనా తండ్రివైనా నీవే!"

కాంచనమాల ఆ పక్కనే కొంచెం దూరంలో నిలబడిన చంద్రవర్మకు కూడా నమస్కరించబోయింది. 'చిన్నవాణ్ణి, నా కెందుకు నమస్కరించడం' అని చంద్రవర్మ పక్కకు తప్పుకున్నాడు. కాని అంతలోనే ఆమె అతని పాదాలపై వాలిపోయింది. అలా ఒక నిమిషం వరకూ అతని పాదాలపై తలవాల్చి మళ్ళీ లేచి తన శయ్యపై కూలబడిపోయింది.

చంద్రవర్మ రెండు పాదాలూ కాంచనమాల కన్నీళ్ళతో తడిసిపోయాయి. నే నామె ధోరణి గమనిస్తూనే ఉన్నాను. కాంచన కాశ్మీర శాలువా కప్పుకుని కుమిలి కుమిలి దుఃఖించింది. ఆమె హృదయ విదారక శోకధ్వని తలుచుకుంటూంటే నా కిప్పటికీ గుండె తరుక్కుపోతూంది."

అపరాజిత ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది. మళ్ళీ ఒకటి రెండు నిమిషాలదాకా ఆమె మరి మాటాడలేదు. రత్నావళి ఎంతో ఆత్రంగా "ఆ తరవాత?" అని అడిగింది.

అపరాజిత మళ్ళీ మొదలు పెట్టింది:

"అసలు జరిగిందంతా ఆ తరవాతే జరిగింది. ఆనాడు చంద్రవర్మా, నేనూ కాంచనమాల శయ్యపక్కనే కూర్చున్నాము. మా ఇద్దరితోనూ ఆ నాడామె ఎంతో ఉల్లాసంగా మాట్లాడింది. తనంతట తానే ఎన్నో ఛలోక్తులు విసిరింది. కాంచనమాల అంత ఉత్సాహంగా

ఉల్లాసంగా ఉండడం నే నెప్పుడూ చూడలేదు. తరవాత కొంతసేపటికి చంద్రవర్మ వాహ్యాళికి వెళ్ళిపోయాడు. కాంచనమాల తల్లి దండ్రు లిద్దరూ మళ్ళీ సాయంకాల పూజా పునస్కారాలలో మునిగిపోయారు.

నే నొక్కర్తెనే కాంచనమాల దగ్గిర కూర్చున్నాను. చంద్రవర్మ వాహ్యాళికి వెళ్ళిపోయిన తరవాత కాంచనమాల ముఖంలో అంతగా ఉత్సాహోల్లాసాలు కనిపించలేదు. ఆమె ఆ వేళంతా కలకల లాడుతూ ఆ భవంతి అంతా తిరిగింది. సాయంత్రిందాకా మా ఇద్దరి తోనూ నవ్వుతూ, పేలుతూ మాట్లాడిందికాని తరవాత ఆమె ధోరణి బాగా మారిపోయింది. చంద్రవర్మ దగ్గిర లేకపోవడంవల్ల నయితే నేమి, అటు ఇటు తిరిగి బాగా అలిసిపోవడంవల్ల నయితే నేమి ఆమె ఆ విధంగా మారిపోయి ఉండవచ్చునని అనుకున్నాను.

తరవాత బాగా చీకటి పడింది. కాంచనమాల తలిదండ్రులూ, విక్రమవర్మ తల్లిదండ్రులూ భోజనాదికాలు ముగించుకొని నెమ్మదిగా విశ్రమించారు.

క్రమక్రమంగా రెండు జాములరాత్రి గడిచింది. ఇంట్లోవారంతా సుఖంగా నిద్రిస్తున్నారు. చంద్రవర్మ కూడా భవంతికి తిరిగివచ్చి కాంచనమాల నొకమా రాప్యాయంగా పలకరించి ప్రాసాదంమీదికి వెళ్ళిపోయాడు.

నే నొక్కర్తెనే కాంచనమాల దగ్గర కూర్చున్నాను. కొంత సేపటికి నాకు కునికిపాట్లు వచ్చాయి.

అంతలో కాంచనమాల యమయాతన పడుతున్నట్లుగా మూలగడం మొదలుపెట్టింది. రోగం మళ్ళీ మొటటికి వచ్చిందేమోనని నేను భయ పడ్డాను. కాంచనమాలపక్కమీద కూర్చుని ఆమె నెంతో ఆప్యా యంగా ఓదార్చాను :

"కాంచనమాలా! ఎందుకలా బాధపడుతున్నావు?"

"నా నాలుక పిడచగట్టుకు పోతూంది! నే నింక ఎంతో సేపు జీవించను!"

అని నాకేసి చూసి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"అదేమిటి కాంచనమాలా! రోజంతా ఎంతో ఉత్సాహంతో తిరిగి ఇంతలో ఇలా మారిపోయావు! ఈ వేళ సాయంత్రం నేనిచ్చిన ఔషధం పుచ్చుకున్నావా? ఎవరినైనా వైద్యుణ్ణి పిలిపించమన్నావా?"

బాగా కంగారుపడుతూ అడిగాను. కాంచనమాల పెదవిపై ఒక చిరునవ్వు మెరిసింది:

"ఇంకా నాకు వైద్యు లెందు కమ్మా! ఇక అంతా అయి పోయింది... చంద్రవర్మ నొకమారి క్కడికి పిలుచుకురా గలవా?"

అని వినబడీ వినబడునట్లు బాగా నీరసంగా అడిగింది.

"ఎందుకలా అంటున్నావు! నేనిచ్చిన ఔషధం పుచ్చుకున్నావా, లేదా? దానితో నీకు బాగా నయమవుతుంది!" కణికిపోతూ అడిగాను.

"ఆఁ, పుచ్చుకున్నాను. కాని అది ఔషధం కాదు! విషం!"

కాంచనమాల తన పక్కనే ఉన్న ఔషధపాత్రికేసి నీరసంగా వేలెత్తి చూపించింది. అది నేనిచ్చిన ఔషధం కానేకాదు! కాంచనమాల చెప్పినట్లది విషమే! ఎక్కడ సంపాదించిందో మరి! ఆమె ఆ పాత్రలోని విషం సగంవరకూ తాగివేసింది. నాకింక కాళ్ళాడలేదు:

"ఎంతసేపైంది?"

"ఇప్పుడా! అప్పుడే చాలాసేపయింది."

కాంచనమాల మరి కళ్ళుకూడా తెరిచే ఓపికలేక నెమ్మదిగా మేను వాల్చింది. అప్పటికే ఆమె కంఠస్వరం బాగా నీరసించి పోయింది.

# 8

నా కా ప్రత్యుత్తరంతో నవనాడులూ కుంగిపోయాయి. ఏమి చెయ్యడానికీ పాలుపోలేదుకాని పాదా లప్రయత్నంగా నన్ను చంద్రవర్మ దగ్గిరికి తీసుకు వెళ్ళిపోయాయి. నేనతన్ని గబగబా లేపి సంగ్రహంగా జరిగినదంతా చెప్పాను. అతడూ, నేనూ కలిసి వెంటనే కాంచనమాల

శయ్యదగ్గరికి పరుగెత్తుకువచ్చాము. నేనతనితో త్వరగా విషవైద్యుల నెవరినైనా పిలిపించమని చెప్పాను.

కాని ఏం లాభం! అప్పటికే వ్యవహారం అంతా మించిపోయింది. అక్కడనించి కదలి వెడితే ఇక తుదిగడియలలో కాంచనమాలను చూచే అదృష్టంకూడా దాటిపోతుం దేమోనని చంద్రవర్మ చాలా భయ పడ్డాడు. ఆ మాటే మెల్లిగా నాతో అన్నాడు.

అంతే! చంద్రవర్మ మరి మాటాడలేదు. అంతలోనే మాఇద్దరి అడుగుల సవ్వడి విన్న కాంచనమాల హఠాత్తుగా కళ్ళు తెరిచింది. అప్పటికే ఆమె అంతటా శైతల్యం కమ్ముకుంది.

కాని ఆమె నేత్రాలూ, ఆమె చూపులూ అలాగే జాజ్వల్యమానం గా నిలిచి వెలిగాయి! చంద్రవర్మను చూసీ చూడగానే ఆమె నేత్రా ల్లోనేకాక ముఖంలో కూడా ఆనంద చైతన్యం కలకలలాడింది!

ఆ ఆఘాతంతో చంద్రవర్మ శిలాప్రతిమలా అలాగే నిలబడి పోయాడు! అంతలోనే అతని కేమి తోచిందో! కాంచనమాల సగం తాగివిడిచిన విషపాత్ర చేత దొరకబుచ్చుకుని ఒక్క గుక్కలో తాగి వేశాడు.

నేను కాంచనమాల మీది మమకారం కొద్దీ ఆమె వైపే చూస్తూ అలాగే ఆ శయ్యపక్కనే కూలబడిపోయాను. అంతేగాని, చంద్ర వర్మ అలా సాహసిస్తాడని కలలో కూడా అనుకోలేదు. లేకపోతే నేను ముందుగా కొంచెం జాగ్రత్తపడి ఉందును. ఏమైనా గత జల సేతుబంధనంవల్ల ప్రయోజనమేమిటి?

అటు పిమ్మట చంద్రవర్మ వెంటనే కాంచనమాల శయ్యమీద కూర్చొని ఎంతో ఆప్యాయంగా ఆమె శిరస్సు తన ఒడిలో పెట్టు కున్నాడు. ఒళ్ళు తెలియని ఆవేశంతో ఆమె నేత్రాలపై ముద్దులవర్షం కురిపించాడు. ఆ స్పర్శానందంతో తిరిగీ కాంచనమాలకు చైతన్యం కలిగిందేమో! ఆమె అతన్ని గాఢంగా కౌగలించుకుని అతని నుదుటిపై కాయశక్తులా గట్టిగాముద్దు పెట్టుకొన్నది. చంద్రవర్మ తిరిగి ఆమె నేత్రాలు రెండూ అదిమి గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. అంతే! ఆ ఆనంద పార

వశ్యంలోనే కాంచనమాల నేత్రాలు రెండూ శాశ్వతంగా మూసుకు పోయాయి.

అది చూస్తూనే చంద్రవర్మ స్పృహ తప్పి ఆ పక్కనే ఒరిగి పోయాడు. అదంతా నీతో చెప్పడానికింతసేపు పట్టిందిగాని ఒకటి రెండు నిమిషాలోనే అంతా జరిగిపోయింది.

నాకా క్షణంలో చంద్రవర్మ ప్రాణాలైనా రక్షించాలని అనిపించింది. వెంటనే ఆ విషయం భవంతిలో ఉన్న విక్రమవర్మ తల్లిదండ్రులకు తెలియజేశాను. అంతవరకూ వారంతా కాంచనమాలకు బాగా నింపాదిగా ఉన్నదిగదా అన్న భ్రమలోపడి సుఖంగా నిద్ర పోతున్నారు.

వెంటనే లేచి వారందరూ ధారానగరంలోని విషవైద్యుల ఇళ్ళకు పరుగులు పెట్టారు.

అప్పటికప్పుడే రాత్రి మూడోయామం సగంవరకూ గడిచి పోయింది. అంత అపరరాత్రి వేళ నిలుచున్నపాటుగా విష వైద్యులెక్కడ దొరుకుతారు!

అయినా తెల్లతెల్లవారేవేళ ఒకరిద్దరు విషవైద్యులు వచ్చారు. అప్పటికి చంద్రవర్మ ఇంకా కొన ఊపిరితో మూలుగుతూనే ఉన్నాడు. విషవైద్యులు శాయశక్తులా వైద్యాలు చేశారుగాని చివరికేమీ ప్రయోజనం కలగలేదు. చంద్రవర్మ మూసినకళ్ళు మరి తెరవలేదు. అలాగే ప్రాణాలు విడిచాడు.

అప్పటి కింకా తెల్లవారలేదు. ఇంట్లో ఉన్నవారందరూ ఒళ్ళెరగని శోకావేశాలతో ఎలుగులెత్తి అంగలారుస్తూ దుఃఖిస్తున్నారు. నాకదంతా ఏదో మహా భయంకరమైన పీడకలలా కనిపించింది. ఎందుచేతనో ఆ సమయంలో నాలో దుఃఖం అంతా స్తంభించిపోయింది. దానితోబాటు శరీరంమీది స్మారకం కూడా తప్పిపోతున్నట్టనిపించింది.

నేనలాగే జీవచైతన్యం లేకుండా పడి ఉన్న కాంచనమాలా చంద్రవర్మల ముఖాలవైపు చూస్తూ కూర్చుండిపోయాను. అక్కడి

దీపంకూడా వారిద్దరి ముఖాలకేసి నిశ్చలంగా చూస్తూన్నట్టే కనబడింది.

కాని ఆ ముఖాలు చూస్తూంటే నాకెంతసేపటికీ వారిద్దరూ మరణించారనే నమ్మకమే కలగలేదు. మరణించినా వారి ముఖాలలో ఆనందతారళ్యం అలాగే తాండవించింది. వారి పెదవులపై చిరునవ్వలాగే వాడని దివ్య పారిజాతంలా మెరిసింది! వారిద్దరి ముఖాలూ మృత్యుదేవతను చూచి చిరునవ్వులు నవ్వుతున్నట్టుగానే కనిపించాయి.

ఎండకన్నెరగక ఐశ్వర్యాలతో తులతూగుతూ కళ్ళుమూసినవారి ముఖాలెన్నో నేను చూచాను. మరణించిన ఉత్తరక్షణంలోనే వారి వదనాలత్యంత భయంకరంగా మారిపోయాయి. కాని కాంచనమాలా చంద్రవర్మల ముఖాలలో ఎక్కడా విషాదచ్ఛాయ లేశమైనా పొడగట్టలేదు. ఆ అద్భుతఘట్టం నాకీ క్షణానికికూడా కళ్ళకు కట్టినట్టుగానే కనిపిస్తూంది.''

అని అపరాజిత ఒకటి రెండు నిమిషాల వరకూ అలాగే కూర్చుండిపోయింది. రత్నావళి ఆ విషాదగాథ విని ఉసూరుమని ఒక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టింది. తరవాత ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. అంతలో అపరాజిత మళ్లీ తన గాథ మొదలుపెట్టింది:

''రత్నావళీ! వివాహమైనప్పటి నించీ కాంచనమాల ఎంతటి దురంత వేదన అనుభవించింది! విక్రమ వర్మ అనురాగం చవిచూచిన కొద్దీ ఆమెలోని ఆ యాతన మరింతగా ఇనుమడించింది.

చంద్రవర్మమీది మమకారం అంతా మళ్లించి వేసుకోవాలని ఆమె ఎంతైనా ప్రయత్నించింది. భర్త మనస్సు నొప్పించకూడదనీ, తన మనస్సాయనపాదాలపై నిలుపుకోవాలనీ ఆమె ఎంతగానో ప్రయత్నించింది! కాని అలా ఎంతగా ప్రయత్నించినా అది సాధ్యంకాలేదు. ఆ నిరంతర యాతనవల్లనే ఆమెలో అలాంటి అసాధ్యవ్యాధి ప్రవేశించి ఆ విధంగా జీవచైతన్యం అంతా దహించి వేసింది!

ఎన్ని మారులు నొక్కి నొక్కి ప్రశ్నించినా ఆమె తన హృదయంలోని దుఃఖం ఎన్నడూ నాతో వెళ్ళబోసుకోలేదు! ఎంత సన్నిహితంగా

అడిగినా ఒక్క చిరునవ్వు నవ్వి ఊరుకునేది. అంతే! చివరి రోజుల్లో ఆమె కేవలం నరక యాతనే అనుభవించిందనుకో! ఇక మరి ఆ యాతన భరించలేక ఆ విధంగా విషం తాగి హాయిగా కన్ను మూసింది. కాంచనమాలను చిన్నప్పటి నించి నా కన్న కూతురుకన్నా ఎంతో అల్లారు ముద్దుగా పెంచుకున్నాను. చివరి కామె జీవితం అలాగయి పోయింది.''

ఆ పైన అపరాజిత గద్గదస్వరభారంతో మరి మాట్లాడ లేకపోయింది. ఒక్క నిమిషంసే పాగి మళ్ళీ మొదలు పెట్టింది:

''రత్నావళీ! కాంచనమాల జీవితం తలుచుకున్నప్పు డల్లా ఎవరైనా ఇద్దరు అన్యోన్యానురాగంతో సుఖిస్తూంటే దైవం కూడా అది చూచి ఓర్వలేడనే అనిపిస్తుంది. లేకపోతే కాంచనమాలా చంద్రవర్మల వివాహాని కన్ని విఘాతా లెందుకు రావాలి? వారిద్దరి జీవితాలూ చివరి కలాగెందుకు బుగ్గి అయిపోవాలి!

వీరిద్దరి మాటేమిటి! ప్రపంచంలో ఎక్కడ చూచినా ఇంతే! స్త్రీ పురుషులలో ఒకరికి ఎవరి మీదనైనా ఇంకొకరిమీద బాగా మమకారం కుదిరిందనుకో! ఆ రెండవ వారికి తిరిగి వారిమీద అనురాగం కలగనే కలగదు! ప్రపంచంలో చాలాచోట్ల జరిగేదింతే. ఒక వేళ ఎవరైనా ఇద్దరి మధ్య గాఢానురాగం కలిగిందనుకో! వారిద్దరికీ చిట్టచివరికి వివాహమే జరగదు! ఒక వేళ బ్రహ్మాండం మీద అల్లాంటి వివాహమే జరిగినా అది ఆట్టేకాలం నిలవదు! ఆ ఇద్దరిలోనూ ఎవరో ఒకరు మరణించడమో, లేకపోతే మరేదో విడ్డూరమో జరుగుతుంది. అంతే!

ప్రపంచంలో అందరూ అనురాగాలనీ, మమకారాలనీ ఊరికే తల్లకిందులైపోతారుగాని అసలు అనురాగాలు లేనివాళ్ళే హాయిగా సుఖపడతారని అనిపిస్తుంది. ఒక వేళ ఎవరికైనా మరి ఎవరిమీదనైనా కొంచెం అనురాగం కలిగిందంటే అది ఏదో విధంగా గుండెల్లో ఒక పెద్ద కుంపటిలా మారిపోయిందన్నమాటే! ఇంకా ఎక్కువ గాఢానురాగమే కలిగిందంటే దానితో ఆ మనిషి బతుకంతా బుగ్గి అయిపోయినట్లే!

నిజంగా అసలు అనురాగం అంటే ఏమిటో తెలియని వారే అదృష్టవంతులు! ఆలోచించగా ఆలోచించగా నాకలాగే అనిపిస్తోంది.''

అపరాజిత ఏదో ఆలోచిస్తూ కథ అంతటితో నిలిపివేసింది. అది గమనించి రత్నావళి నెమ్మదిగా నిట్టూర్చి అడిగింది :

"అయితే విక్రమవర్మకు భార్యను ఆ విధంగానైనా చూచే అదృష్టం కలిగిందా?"

అపరాజిత సమాధానం చెప్పింది :

"అదే చెబుతున్నాను! ఆ మరునాడు జాముపొద్దెక్కేసరికి విక్రమ వర్మ విశాలాపురం నించి రాజవైద్యుల నిద్దరిని వెంటబెట్టుకుని వచ్చాడు. ధారానగరంలో అడుగుపెట్టగానే అతని కా విషాదవార్త కొంచెం చూచాయగా తెలిసింది. అంతేగాని స్పష్టంగా ఏమి జరిగిందో తెలియ లేదు. అది విన్నవెంటనే ఆతడు ఉరకలు వేసుకుంటూ భవంతి గుమ్మంలో అడుగు పెట్టాడు."

# 9

అంతవరకూ అతిశ్రద్ధగా కథ విన్న రత్నావళి ఆత్రంగా అడిగింది:

"ఆ తరవాత ఏమి జరిగింది?"

అపరాజిత రత్నావళివై పొకమారు పరిశీలనగా చూసి మిగిలిన కథ పూర్తిచేసింది :

"రత్నావళీ! ఇక జరగడానికేమి ఉంది! విక్రమవర్మ భవంతి లోపలి గుమ్మంలో అడుగు పెడుతూనే కాంచనమాలా చంద్రవర్మల మృత శరీరాలకేసి చూసి క్షణకాలం నిశ్చలంగా నిలబడిపోయాడు!

అతడు కూడా ఏదైనా సాహసానికి పాల్పడతాడేమోనని నేను అక్కడ నిలబడిన వారందరితోను కొంచెం జాగరూకతతో కనిపెట్టి చూస్తూండవలసిందని నెమ్మదిగా హెచ్చరించాను.

కాని వారెవరూ నా మాట లక్ష్యపెట్టలేదు. "పరాయి పురుషుని ఒడిలో ప్రాణాలు విడిచిన భార్యకోసం అంత ప్రాణాలు విడవవలసి నంత అగత్యం ఏమి వచ్చింది!"

అని నామాట నిస్సారంగా ఈసడించి వేశారు. నేనప్పుడు వారన్నది నిజమేననీ, విక్రమవర్మ కంత సాహసించ వలసినంత అగత్య మేమీ లేదనీ అనుకొన్నాను. అప్పటికి నా మనస్సు కొంచెం కుదుటబడింది.

విక్రమవర్మ వైఖరిలో కూడా పెద్ద మార్పేమీ గోచరించలేదు. తరవాత ఒకటి రెండు గడియలు గడిచిపోయేసరి కతడు కేవలం తటస్థ వైఖరే అవలంబించినట్లు కనిపించాడు.

ఒకరిద్దరు దగ్గిర బంధువు లతని మీద విరుచుకు పడిన ఆపద కతని నెంతో ఆప్యాయంగా ఓదార్చబోయారు. కాని అతడు వారి ఓదార్పు లన్నిటికీ చిక్కని చిరునవ్వులతోనే సమాధానాలు చెప్పాడు. పైగా అతడే వారినందరినీ ఓదార్చడం మొదలు పెట్టాడు. జరిగినది తన కేమీ పట్టనట్టుగా నిర్లిప్తంగా మాట్లాడాడు.

ఇంకొక విచిత్రం! మధ్య మధ్యన మాటల సందర్భంలో ఛలోక్తులు కూడా విసరడం ప్రారంభించాడు. భవంతిలో ఉన్నవారంతా కాంచనమాలా చంద్రవర్మల దుర్మరణాలు తలుచుకొని గొంతెత్తి విలపిస్తూంటే స్వయంగా తానే వారి నందరినీ ఓదార్చాడు.

అతని ధోరణిచూచి నేను నా కళ్ళే నమ్మలేక పోయా ననుకో! ఒక్క నేనన్న మాటేమిటి? అక్కడికి వచ్చిన ఇరుగుపొరుగు వారంతా అతని గుండె నిబ్బరంచూచి ఎంతైనా ఆశ్చర్యపోయారు.

చివరికి విక్రమవర్మే స్వయంగా కాంచనమాలా చంద్రవర్మల మృత శరీరాల దహన సంస్కారాలకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు. అవన్నీ అయిపోయిన తరవాత కూడా అతనిలో మార్పేమీ కనిపించలేదు. ఆ తరవాత తరవాత అతడు మరింత నిర్లిప్తుడుగా ఉన్నట్లు కనిపించాడు. పరామర్శించడానికి వచ్చిన వారందరితోనూ నవ్వుతూ మాట్లాడాడు. అంతేగాని ఆ రోజంతా చివరి కొక చిన్ని నిట్టూర్పైనా విడిచిపెట్టలేదు!

“రత్నావళీ! మగవా రెంతకైనా తగినవారే! అతడు కనక అలా కొండంత ధైర్యంతో నిలబడ్డాడు గాని మరెవరైనా అయితే ఈ క్షణంలో నే గుండె పగిలి చనిపోవలసిందే! అసలే మగవారిది రాతి

గుండె! అందులోనూ విక్రమవర్మ సంగతి మరి వేరే చెప్పనే అక్కర లేదు!

ఆ వేళ సాయంత్రం మరి భోజనా లెవరికి సయిస్తాయి! అయినా విక్రమవర్మ తన తల్లిదండ్రులూ, మిగిలిన బంధువులూ ఏదైనా కొంచెం ఫలహారమైనా చేసేదాకా విడిచి పెట్టలేదు. ఆ నాడు రాత్రి వారంతా విశ్రమించిన దాకా అతడు లోపలికివెళ్లి విశ్రమించనే లేదు!

అందరూ విశ్రమించిన తరవాత నేనుకూడా ఆ భవంతిలో ఒక మూల కొంగు పరచుకొని పడుకున్నాను. నా కా రాత్రి తెల్లవార్లూ నిద్ర పట్టనేలేదు! ఆ వేళ జరిగిన బీభత్సం అంతా నాకళ్ల కెదురుగా జరిగిపోతున్నట్లు కనిపించింది.

అందులోనూ విక్రమవర్మ గుండెనిబ్బరం తలుచుకున్న కొద్దీ నాకు మరింత ఆశ్చర్యంవేసింది. తరవాత తెలతెల్లవారే వేళ నాకొక కోడి కునుకు పట్టింది. అలా ఎంతసేపు కన్నుమూశానో నాకే తెలియదు.

హఠాత్తుగా నాకొక పెద్ద మూలుగు వినిపించింది. ఉలిక్కిపడి లేచాను. మొట్ట మొదట ఆ మూలుగెక్కడనించి వచ్చిందో తెలియలేదు. అంతలో ఆ మూలుగు మరింత దారుణంగా వినిపించింది. అది ఆపక్కగది లోనించే బయలుదేరినట్లు వినిపించింది. నే నాగదిలోకి పరుగెత్తాను.

అంతలో భవంతిలోని వారంతా ఆ మూలుగువిని అక్కడికి పరిగెత్తుకువచ్చారు. మా కళ్ళకెదురుగా విక్రమవర్మ రక్తం మడుగులో పడి అటు ఇటు దొర్లుతున్నాడు. గుండెలో దంతపు పిడివరకు అతని చేతిబాకు గుచ్చుకుపోయింది. క్షణంలో మాకదంతా బోధపడిపోయింది. కొందరు తొందర తొందరగా వైద్యులకోసం పరుగులు పెట్టారు. మరి కొందరు కాళ్ళాడక అక్కడే కూలబడిపోయారు.

విక్రమవర్మ తల్లిదండ్రు లిద్దరూ అతనిమీద ఒరిగి కంటికీ మంటికి ఏకధారగా విలపించడం మొదలు పెట్టారు. పాపం! అతని తలి అతని దారుణ సాహసాని కెంత విలపించిందని!

"నాయనా, నీ వింతపని చేస్తావని కలలో గూడా అనుకో లేదురా!" అని ఏమేమో జ్ఞాపకం తెచ్చుకొని అనేక విధాల

వలావలా వాపోయింది. నేనామె పక్కన కూర్చుని ఎన్నోవిధాల ఓదార్చాను.

పాపం! విక్రమవర్మ కంతవరకూ శరీరం మీది స్పృహ తప్పిపో లేదు. అలాగే కళ్ళుప్పగించి కొంతసేపటివరకూ రెప్పవాల్చకుండా తల్లి వైపు చూచాడు. తరవాత లోలోపలికి మునిగిపోతున్న క్షీణస్వరంతో ఆమె నోదార్చాడు. ఉసూరుమని ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు.

"అమ్మా! కాంచనమాలే లేకపోయిన తరువాత మరి నేను బ్రతికి మాత్రం ప్రయోజన మేమిటి?"

ఆ తరవాత అతని కనుగొలుకులలో రెండు కన్నీటిబిందువులు తరళాయి. చుట్టూ ఉన్నవారా మాటలు విని అతనికి సంధించిందని అనుకొన్నారు.

తరవాత క్రమ క్రమంగా అతనికి స్పృహతప్పిపోయింది. వైద్యులు వచ్చి శాయశక్తులా వైద్యాలు చేశారుగాని అప్పటికే శరీరంలోని రక్తం అంతా బాగా క్షీణించి పోయింది. వైద్యులు వచ్చిన తరువాత అతడొక అరగడియకన్న ఎక్కువసేపు జీవించలేదు.

నేను నా చేతులారా పెంచిన కాంచనమాల జీవితం అంతా చిట్ట చివరికి ఆ విధంగా తెల్లవారిపోయింది. ఆ ఇద్దరుకూడా చిట్టచివరి కలా దారుణ మృత్యువుపాలై పోయారు."

# 10

అపరాజిత ఒక్క వేడినిట్టూర్పు విడిచి రత్నావళి ముఖంకేసి చూస్తూ కూర్చుండిపోయింది. అలా ఒక నిమిషంసేపు మౌనం అవలం బించి నెమ్మదిగా అడిగింది :

"రత్నావళీ! నేను చెప్పినకథ అంతా తు. చ. తప్పకుండా జాగ్రత్తగా విన్నావా?"

"ఆ, విన్నాను."

"అయితే అడగనా?"

"ఏమిటి?"

"కథ చెప్పిన తరవాత నిన్ను కొన్ని ప్రశ్న లడుగుతానని అన్నానుగా! అప్పుడే అదంతా మరిచిపోయావా?"

ఆ మాటతో రత్నావళి వెన్నుపై ఎవరో గట్టిగా చరిచినట్లయింది. అంతవరకూ అత్యాసక్తితో ఆ కథ ఆలకిస్తున్న రత్నావళికి కథా ప్రారంభానికి మొట్టమొదట అనుకున్న విషయాలన్నీ హఠాత్తుగా స్ఫురణకు వచ్చాయి:

"ఔనౌను! మరిచిపోయాను. అన్నట్లు ఈ ప్రశ్నలన్నీ ఎంత సేపు పడతాయి?"

"ఎంతోసేపా? అసలు నిన్నింక అడిగేది ఒకే ఒక ప్రశ్న. అంతే!"

"అయితే నేను పరీక్షలో నెగ్గినపక్షంలో నీవన్నమాట తప్పకుండా నిలబెట్టుకోవాలి మరి!"

రత్నావళి బింకంగా అపరాజితకేసి చూసి గట్టిగా రొక్కాయించింది:

"ఓ, అలాగే! తప్పకుండా నామాట నిలబెట్టుకుంటాను. నేను మాట ఇచ్చినట్లుగా స్వయంగా నిన్ను నాగరశ్రేష్ఠి శయ్యాగారం ద్వారందాకా తీసుకుపోతాను. ఒకవేళ ఈ పరీక్షలో ఓడిపోయిన పక్షంలో నీవన్నమాట నిలబెట్టుకుంటావా?"

"అందుకు సందేహమేమిటి? తప్పకుండా అలాగే నిలబెట్టుకుంటాను."

"ముమ్మాటికీ నిశ్చయమేనా?"

అపరాజిత మరింతగా రొక్కాయించి అడిగింది.

"ఆ, ముమ్మాటికీ నిజమే!"

"అయితే పరీక్ష చెయ్యనా?"

"చెయ్యి!"

రత్నావళి మేలిముసుగు నఖశిఖపర్యంతము కప్పుకొని బింకంగా కూర్చుంది. అపరాజిత పరీక్షించింది :

"రత్నావళీ! నేను చెప్పినకథ అంతా జాగ్రత్తగా విన్నావుగదా! కాంచనమాలా చంద్రవర్మ విక్రమ వర్మల అనురాగాలలో ఎవరిది గాఢానురాగమో కొంచెం ఆలోచించి సమాధానం చెప్పగలవా?"

"చెబితే!"

"నీ పరీక్ష అయిపోయిందన్నమాటే! నీ వీ పరీక్షలో నెగ్గావన్నమాటే!"

"అంతేనా?"

"అంతే!"

తరవాత రత్నావళి ఒక క్షణకాలం ఆలోచించి పకపక నవ్వింది :

"ఎందుకలా నవ్వుతావు?" అని అపరాజిత ఎంతో ఆశ్చర్యంగా అడిగింది. రత్నావళి సమాధానం చెప్పింది :

"ఏమీ లేదు! ఇంత చిన్న ప్రశ్నకోసం నీవు చేసిన ఆర్భాటం తలుచుకుంటే నాకు నవ్వాగలేదు!"

"నిజమే! నీవన్నట్టు నే నడిగింది చాలా చిన్న ప్రశ్నే. పోనీ, దానికైనా సమాధానం చెబితే చాలులే! త్వరగా సమాధానం చెప్పాలి సుమీ!"

రత్నావళి కనురెప్పపాటు లేకుండా అపరాజితకేసి చూస్తూ సమాధానం చెప్పింది :

"దీనిలో అంతలోతుగా ఆలోచించవలసింది ఏమి ఉంది? ఆ ముగ్గురి అనురాగాలలోనూ కాంచనమాలదే గాఢానురాగం! అవునా?"

"ఎందుచేత?"

అపరాజిత సూటిగా అడిగింది.

"ఎందుచేతేమిటి? ముందుగా నేను చెప్పిన సమాధానం అవునో కాదో తేల్చి చెబితేనేగాని నా కారణం చెప్పదలుచుకోలేదు! ముందుగా నేనడిగిన దానికి సమాధానం చెప్పు."

అపరాజిత సమాధానం చెప్పేదాకా రత్నావళి అలాగే బుంగ మూతి పెట్టుకుని కూర్చుంది.

అపరాజిత ఒక నవ్వు నవ్వి క్షణకాలం అలాగే మౌనం అవలంబించి సమాధానం చెప్పింది.

"వెర్రిదానా! నీవు చెప్పినదానికి కారణమేదో చెప్పనిదే నీది సరియైన సమాధానం అవునో కాదో నిర్ణయించడమెలాగ? అందు చేతనే ముందుగా నిన్ను కారణం చెప్పమని అడుగుతున్నాను! తెలిసిందా?"

ఆమె గద్దించి అడిగింది. రత్నావళికిక సమాధానం చెప్పక తప్పలేదు.

"ఓహో! అలాగా? అయితే చెబుతున్నాను విను మరి! ఇంకొకరి మీద ఎంతటి అనురాగం కలిగినా మనం అదంతా అతిగుంభనగా దాచివేసుకుంటాము-కాంచనమాల వంటి శీలవతి తన భాగ్యభోగాలు, గౌరవ మర్యాదలు, అన్నీ విడిచివేసి చంద్రవర్మ నా విధంగా వలచిం దంటే అది ఎంతో గొప్ప గాఢానురాగమై ఉండాలి.

అదీగాక అంత ఆప్యాయంగా చూచుకునే భర్త ఉన్నా చంద్ర వర్మపై అనురాగం కొద్దీ పంచప్రాణాలూ అలా తృణప్రాయంగా విడిచి వేసిందంటే, అది ఎంతో గొప్ప అనురాగమై ఉండాలి. అందుచేతనే ఆ ముగ్గురిలోనూ ఆమెదే గాఢానురాగమని అన్నాను. దానికేమిగాని, నిజంగా కాంచనమాల చాలా అదృష్టవంతురాలు! మనసారా వలచిన వారి ఒడిలో హాయిగా కళ్ళుమూసే మహాభాగ్యం ఎంతమందికి కలుగుతుంది!"

రత్నావళి ఇంకా ఏదో మాట్లాడబోయింది. అంతలోనే అప రాజిత హఠాత్తుగా ప్రశ్నించింది:

"రత్నావళీ! సరేలే! దానికేమి! పోనీ నీ హృదయంలో నాగర శ్రేష్ఠిమీద అంత గొప్ప గాఢానురాగం కలిగిందని గుండెమీద చెయ్యి వేసుకుని చెప్పగలవా?"

ఆ ప్రశ్నతో రత్నావళి కెక్కడలేని ఉక్రోషమూ పొడుచుకొచ్చింది:

"అదేమన్నమాట! ఎవరి అనురాగం వారిది. దీనిలో ఒకరితో సాపత్యమేమిటి? ... దానికేంగాని ముందుగా నే నడిగినదానికి సమాధానం చెప్పు! నేను నీ పరీక్షలో గెలిచానా? లేదా? ... లేనిపోని ప్రశ్నలతో కాలయాపన చెయ్యాలని చూస్తున్నావా? నే నామాత్రం గ్రహించలేదనుకొన్నావా? ముందుగా నా ప్రశ్నకు సమాధానం చెప్పు!"

అపరాజిత కిక సమాధానం చెప్పక తప్పలేదు:

"రత్నావళీ! నీ సమాధానం తప్పిపోయింది! నీవు పరీక్షలో పూర్తిగా ఓడిపోయావు!"

"ఎందుచేత?"

"కారణం చెప్పి అది నీ చేతే చెప్పిస్తాను! చెప్పమన్నావా?"

అపరాజిత మరింత బింకంగా రత్నావళిని బెదిరించింది.

ఆ బెదిరింపుతో రత్నావళి బాగా కంగారుపడిపోయింది. ఎలాగో అలాగ నెగ్గితీరాలనే తొందరలో బాగా ఆలోచించకుండా గబగబా నోటికి వచ్చినట్లు మాట్లాడింది.

"అపరాజితా! అన్నట్టు కంగారుపడిపోయాను. కాంచనమాలది గాఢానురాగంకాదు. చంద్రవర్మదే గాఢానురాగం. మొదటే చెప్పవలసిందిగాని కొంచెం పొరబాటు పడిపోయాను."

అపరాజిత చేతులు పట్టుకుని బతిమాలింది. ఆమె పక్కుమని నవ్వింది.

"రత్నావళీ! పోనీ అనుకుంటే ఈ సమాధానంలో కూడా తప్పిపోయావు! చంద్రవర్మది కూడా గాఢానురాగం కానేకాదు! ఆ ముగ్గురిలోనూ విక్రమవర్మదే గాఢానురాగం!"

రత్నావళి ఆ సమాధానంతో అప్పుడే నిద్ర మేలుకొన్నట్లుగా నిర్ఘాంతపోయింది.

"ఎందుచేత? సరియైన కారణం చెబితేనేగాని నేను నీ మాట నమ్మేదిలేదు!"

"సరియైన కారణమే చెబుతాను! అది నీ చేతే ఒప్పిస్తాను. అంతలోనే కంగారు పడిపోతా వెందుకు! ఆ కారణం చెబుతున్నాను విను.

"నిజంగా నీవు చెప్పినట్లు కాంచనమాల అనురాగం చాలా గొప్పదే! చంద్రవర్మ అనురాగం కూడా ఇంచుమించుగా అలాంటిదే.

కాని వారిద్దరికి చిన్నప్పటినించి ఒకరొకరిమీద బాగా అనురాగం కలిగింది. అందుచేత వారిద్దరు ఒకరొకరికోసం ప్రాణత్యాగం చెయ్యడంలో అంతగా విడ్డూరమేమీ లేదు!

మరి విక్రమవర్మమాట! అతనికి మొట్టమొదట కాంచనమాలకు తనపై అంతగా అనురాగంలేదన్నమాట తెలుసును! అయినా అతడామెనే వివాహం చేసుకోవాలని పట్టుపట్టాడు.

తరవాత రుగ్మతసమయంలో కాంచనమాలకు చంద్రవర్మపై కలిగిన మమకారం అంతా అతనికి స్పష్టంగా తెలిసిపోయింది. అయినా అతని అనురాగం అణువంతైనా తగ్గిపోలేదు.

చివరి కామె చంద్రవర్మకోసం ప్రాణాలు విడిచివేసినా అతని అనురాగం వీసమంతైనా తగ్గలేదు. పైగా ఆమె లేకపోతే అతని కిక జీవితమే దుర్భరమని అనిపించింది. కాంచనమాల చంద్రవర్మపై ఎంతటి మమకారం చూపించినా విక్రమవర్మ ఎన్నడూ విసుక్కోనైనా విసుక్కోలేదు! బ్రతికి ఉన్నంతకాలము ఒక్కనాడూ ఆమె మనస్సు నొప్పించలేదు!

రత్నావళీ! కాంచనమాలా చంద్రవర్మల వంటి వారీ ప్రపంచంలో ఎంతమందైనా కనిపిస్తారు. కాని విక్రమవర్మలాగ భార్య యెడల అసూయాలేశమైనా లేని అకళంక ప్రేమతో ప్రవర్తించేవారు చాలా అరుదుగా ఉంటారు. అందుచేతనే అతనిది అందరికన్నా ఘన

మైన గాఢానురాగమని అన్నాను... తెలిసిందా? ఇంతకీ నేను చెప్పిన కారణం నీకు నచ్చిందా?''

అది విన్నతరవాత రత్నావళి వంచిన తల మరి మళ్ళీ పైకెత్తలేదు. చిట్టచివరి కొక నిట్టూర్పు విడిచిపెట్టింది:

''అపరాజితా! నీ వన్నది నిజమేగాని నే నక్కడికి వెళ్ళకుండా చెయ్యడానికే నీవింత పెద్ద పన్నాగం పన్నావు! ఆ పన్నాగం అంతా నా కీక్షణంలో తెలిసిపోయిందిలే.''

అని రుసరుస లాడింది. అపరాజిత దానికి కూడా వెనువెంటనే సమాధానం చెప్పివేసింది:

''రత్నావళీ! నీ వన్నట్లు నేను నిన్ను మోసగించడానికే ఈ కథ చెప్పి నిన్నిలాగ పరీక్షలో ఓడించాననుకో! నిజంగా నీ మనస్సులో నాగరశ్రేష్ఠిమీద అంత వల్లమాలిన మమకారమే కుదిరితే చిన్నపిల్లలాగ నేను చెప్పే కథంతా వింటూ కూర్చుంటావా? నామాట వినకుండానే వెంటనే అక్కడికి పరిగెత్తి ఉందువు! అది లేకపోవడం వల్లనే ఇలాగ ఈ కథ అంతా చెవులొగ్గి వింటూ కూర్చున్నావు. అంతే!''

దానితో రత్నావళికి కత్తి పెట్టి గుండెల్లో పొడిచినట్లయింది:

''నిజమేగాని నాకు నీవు చెప్పినదంతా వినగానే ఈ క్షణంలోనే బయలుదేరి నాగరశ్రేష్ఠి భవంతికి వెళ్ళిపోవాలని సంకల్పం బయలుదేరింది. ఇక నీవేమి చెప్పినాసరే! నేనన్న మాట తప్పినా సరే! నేనిప్పుడే బయలుదేరి వెళ్ళిపోతున్నాను.''

రత్నావళి తటాలున లేచి నిలబడింది. అపరాజిత అలాగే కూర్చుని ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని కలకల నవ్వింది.

రత్నావళి ఆశ్చర్యపోయింది:

''ఎందుకలా నవ్వుతున్నావు!''

''ఏమీలేదు. స్వామి కల్యాణమహోత్సవం అంతా అయిపోయింది. ఆ పైన మంగళసూత్రధారణం కూడా జరిగిపోయింది. నీ సంకేత సమయం దాటిపోయి అప్పుడే అరగడియ కావచ్చింది. అయినా నీవీ విషయం గమనించనే లేదు! దీన్నిబట్టి కూడా నీ అనురాగం ఎలాం

టిదో తెలిసిపోయింది. కాని నీ మాటలు చూస్తే మాత్రం కోటలు దాటిపోతున్నాయి. అదిగో, స్వామి కళ్యాణమహోత్సవం ఊరేగిం పప్పుడే మన ఇంటి ఎదుటికి వచ్చివేసింది! అదిగో చూడు! ఇంతమంది జనంలో, ఈ కాగడాల వెలుతురులో ఇంకెక్కడికి వెడతావు!''

ఆ ఉత్సవం చూచి రత్నావళి అలాగే అపరాజిత దగ్గిర కూలబడి పోయింది:

''పోనీలే! ఇంత మాత్రంతో మించిపోయిందేముంది? ఈ వేళ కాకపోతే మరొకప్పుడు!''

బింకంగా మూతి బిగించి ఆ ఉత్సవంకేసి చూసింది. అయినా అపరాజిత అంతటితో విడిచిపెట్టలేదు:

''రత్నావళీ! మీ ఆయన నాలుగైదు రోజులలో నట్టింట అడుగు పెట్టేసరికి ఇవ్వన్నీ ఇట్టే మరిచిపోతావు! ఇంతవరకు నేను చెప్పిన దేదీ తప్పిపోలేదు! చివరికి ఇవీ అంతే అవుతుంది!''

అని వ్యంగ్యంగా ఆమెకేసి చూచి నవ్వింది.

రత్నావళి పూర్తిగా పరాజయం పొందినా పై పైకి అపరాజిత లాగే నటిస్తూ ఉసూరుమని నిట్టూర్చింది.

క్షణంలో స్వామి కల్యాణమహోత్సవం కాగడాల వెలుగులు వారిద్దరి ముఖాలమీద జాజ్వల్యమానంగా ప్రసరిస్తూ తళ తళ మెరిసి పోయాయి!



# యక్ష పరీక్ష

"అయ్యో! అయ్యో! నా యజ్ఞాగ్నిహోత్రానికి వినియోగించే అరణి ఆ మాయ జింక ఎత్తుకుపోతూంది! ధర్మమూర్తీ! మీరే నాకిక దిక్కు! రక్షించండి! రక్షించండి!"

అని ఆ బ్రాహ్మణుడదేపనిగా వలవలా వాపోయాడు! ధర్మరాజతని ఆర్తనాదం వింటూనే కళ్ళెత్తి అటూ ఇటూ పరిశీలించాడు. వెంటనే విల్లమ్ములు చేతిబట్టుకుని ఆ జింక వెంటనంటి పరుగెత్తుకుపోయినాడు! మిగిలిన పాండవులందరూ అన్నగారావిధంగా ఆత్రంగా పరుగెత్తుకుపోవడం చూసి తాము కూడా మరి వెనుక ముందులు చూడకుండా విల్లమ్ములు చేత బుచ్చుకుని ఆ జింక వెంటనంటి పరుగులు పెట్టారు! పాండవుల అరణ్యవాసంలో వారి వెంటనున్న మిగిలిన పరివారంలోని వారంతా ఏమి చేయడానికీ పాలుపోక రెప్పపాటు లేకుండా అలాగే నిలబడిపోయారు! ఇది అంతా ఒక్క క్షణంలో జరిగిపోయింది!

అప్పటికప్పుడే జాము పొద్దెక్కింది. అయినా ఎక్కడా ఎండ పొడకూడా చొరడానికి వీలులేని ఆ కీకారణ్యంలో పక్షులు, మృగాలు మేలుకొన్న సందడి అప్పుడే ప్రారంభమయింది. పాండవులు తమ అమ్ములన్నీ ఆ జింకమీద ప్రయోగించారు. అయినా అది చెంగు చెంగున ఆకాశంలోనికెగురుతూ అవ్వన్నీ తప్పించుకుని శరవేగంతో పరుగెత్తుకు పోతూంది! ఆ జింక కొమ్ములలో చిక్కుకొన్న ఆ అరణి

మాత్రం చెక్కుచెదరకుండా అలాగే మెరుస్తూంది. పాపం! ఆ బ్రాహ్మణుడా అరణి ఒక్క గున్నమామిడి కొమ్మలో భద్రంగా దాచుకున్నాడు. ఆ జింక ఎగురుతూ పరుగెత్తుతూంటే అది దాని చిలవల పలవల కొమ్ముల్లో చిక్కుకుపోయింది. దానితో అది అలాగే పరుగెత్తుకుపోయింది!

పాండవు లయిదుగురూ "అయ్యో! ఒక్క జింకను వేటాడలేక పోయామే!" అని ఎంతైనా ఖిన్నులైపోయారు. అయినా నిరుత్సాహం చెందక చిట్టచివరి ప్రయత్నంగా అయిదుగురూ ఒక్కసారిగా బాణాలు వేశారు! ఆ దెబ్బతో ఆ జింక తలతెగి నేలమీద పడిపోయిందనే అనుకున్నారు. కాని అది చెంగున ఒక్క గెంతేసింది! అంతే! అది తిరిగి నేలమీద అడుగుపెట్టిన జాడ ఎక్కడా కనబడలేదు! ఏమైపోయిందో! ఆ అరణ్యంలో ఆ పరిసరాల్లో ఎంతగా గాలించినా దాని జాడే పొడ గట్టలేదు!

ఈ అపూర్వ సంఘటన కందరూ దిగ్భ్రాంతులైనారు! అయినా ఆ అయిదుగురు పాండవులూ ఆ అరణ్యంలో ఆ ప్రాంతం అంతా కలయ వెదికారు. ఎక్కడా ఆ జింకజాడే పొడకట్టలేదు!

ఇదంతా జరిగేసరికి మధ్యాహ్నం రెండు యామాల కాలం గడిచిపోయింది! మిట్టమధ్యాహ్నం ఎండ నడినెత్తి మాడ్చివేస్తూంది. నిరుత్సాహంవల్ల, బడలికవల్ల అందరూ అలసి పోయారు. అతిదాహం వల్ల అందరి నాలుకలూ పిడచగట్టుకు పోయాయి! కాని కనుచూపు మేరలో ఎక్కడా నీటిబిందువుకూడా కనిపించే ఆశ లేదు! అందరూ తమ దురవస్థాపరిపాకం తలుచుకుని దిగాలుపడిపోయారు.

"పాపం! ఆ బ్రాహ్మణునికి అరణికూడా దక్కించలేక పోయాము గదా! ఎంతటి మహావమానం!" అన్నాడు నకులు డొక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టి.

"ద్రౌపదీదేవిని ఆ విధంగా అవమానించినపుడు కౌరవుల నందరిని సంహారించివేసి ఉంటే ఇంతటి దురవస్థ సంప్రాప్తించి ఉండేది కాదుగదా!" అన్నాడు భీమసేనుడు తీవ్ర క్రోధంతో! అతని కన్నులు రెండూ రెండు కెంపులైనాయి!

"ఆ సూతపుత్రుడు—ఆ కర్ణుడు—నిండు సభలో ద్రౌపదీదేవి నావిధంగా దుర్భాషలాడుతూంటే సహించి ఊరుకోవడం వల్లనే నేటికీ దుర్దశ వచ్చింది. ఇది సహజమే!" అన్నా డర్జునుడు.

ధర్మపుత్రుడు వారి దైన్యవచనాలు విని లోలోపల చాలా కించపడ్డాడు. దాహం అలాగే అందరినీ దహించి వేస్తున్నది.

ధర్మరాజు "నాయనా! ఆ చెట్టుపైకెక్కి ఎక్కడైనా కనుచూపు మేరలో సరస్సేదైనా ఉన్నదేమో పరిశీలించి చూడు!" అన్నాడు నకులునితో.

అతడు అలిసి ఉన్నాసరే లెక్కపెట్టక ఎదురుగాఉన్న పెద్ద చెట్టు చిట్టచివరి కొమ్మమీదకెక్కి చుట్టూ పరిశీలించి ఎంతో ఉత్సాహంతో కిందికిదిగివచ్చి—"కొంచెం దూరంలో ఒక పెద్ద సరోవరం కనిపించింది!" అన్నాడు.

"సరే! నీవు అక్కడికిపోయి నీవూ దాహం తీర్చుకుని, మాకూ ఇంత మంచితీర్థం తీసుకురా నాయనా!" అన్నాడు ధర్మరాజు.

నకులుడు చాలాదూరం నడిచిపోయాడు. పోగాపోగా కొంత సేపటికి ఆ పెద్ద సరోవరం కనిపించింది. అప్పటికి దాదాపు మూడు యామాలు గడిచిపోయాయి. ఆ సరోవరానికి చుట్టూ దట్టంగా చెట్లు, తీగలు, పొదలు గజిబిజిగా అల్లుకున్నాయి. నకులుడు అవన్నీ దాటిపోయి ఎంతో సంతోషంతో ఆ సరస్సులో ప్రవేశించాడు. వెనువెంటనే పెద్ద కంఠస్వరం వినిపించింది. ఆ ధ్వనికి చుట్టూ అడివిలోఉన్న లేళ్లు, కుందేళ్ళు మొదలైన మృగాలన్నీ హడలెత్తి దూర దూరంగా పరుగెత్తుకు పోయాయి! సరోవరం ఒడ్డున తేలుతున్న మీనులన్నీ ఒక్కసారి తటాలున నీటిలో మునిగిపోయాయి! ఆ ధ్వని గంభీరంగా భయంకరంగా ఇలా వినిపించింది:

"నీ వీ మంచితీర్థం పుచ్చుకోవాలంటే ముందుగా నా ప్రశ్నలకన్నిటికీ ప్రత్యుత్తరా లివ్వాలి! అంతవరకూ ఒక్క చుక్కైనా ముట్టడానికి వలపడదు!"

ఈ మాటలు విని నకులు డొక క్షణకాలం దిగ్భ్రాంతుడై నాడు. కాని విదాహం వల్ల నాలుక కొంకర్లు పోతూంది. "ఈ బెదిరింపుల

కేమిటే!'' అనుకుని ఒక్క గుక్కలో తాగగలిగినన్ని నీళ్లన్నీ తాగి వేశాడు!

అంతే! వెంటనే అతనికి మూర్ఛవచ్చింది. మొదలు నరికిన తరువులా అక్కడే కూలపడిపోయాడు!

ఇక అక్కడ ఆ ఆశ్రమంలో మిగిలిన పాండవులు నలుగురూ నకులుని కోసం వేచి వేచి విసిగి వేసారి పోయారు! ఇక చేసేదేమీ లేక ధర్మరాజు ఆ విషయం పరిశీలించ వలసిందని సహదేవుణ్ణి ప్రేరేపించాడు.

సహదేవుడు అప్పటికే శోష వచ్చి పడిపోయే పరిస్థితిలో ఉన్నాడు. అయినా త్వరితంగా ఆ సరోవరం ఉన్న ప్రదేశానికి బయలుదేరి వెళ్ళాడు.

తిరిగి సహదేవుని రాక కూడా చాలా ఆలస్యం అయింది. వెంటనే ధర్మరాజు అర్జునుని పంపించాడు.

అతనికి కూడా ఆ సరోవరం దగ్గర ఆ అశరీరవాణి అలాగే అతి భయంకరంగా వినిపించింది. వెంటనే ఆ పరిసరం అంతా పరిశీలించి చూచాడు. నకుల సహదేవులిద్దరూ ఆ ప్రాంతంలోనే పడి ఉన్నారు. అతని హృదయంలో విషాదము, క్రోధము, సంభ్రమము ఒక్కసారిగా ఉవ్వెత్తుగా పొంగిపోయాయి. వెంటనే శబ్దవేధి శరం ఒకటి వింట సంధించి ఆ ధ్వని వినవచ్చిన దిశవైపువ వేశాడు. కాని ఆ బెదరింపు తిరిగి అలాగే భయంకరంగా వినిపించింది. అర్జును డిక దాహానికి తాళుకోలేక కొంచెం మంచినీళ్ళు తాగబోయాడు. ఆ బెదరింపు వినిపించినా లక్ష్యపెట్టకుండా ఒక గుక్కెడు నీళ్లతో నాలుక తడుపుకొన్నాడు. వెంటనే వివశుడై నేలమీద కూలపడిపోయాడు! అలా ఆలస్యం జరిగిన కొద్దీ ధర్మరాజుమనస్సులో భయాందోళన లెక్కువైనాయి. వెంటనే భీమసేనుని పంపించాడు.

అప్పటికప్పుడే సాయంకాలం కావచ్చింది! ధర్మరా జలాగే అన్నదమ్ముల కోసం నిరీక్షిస్తున్నాడు. అతని హృదయంలో ఒక్కొక్క క్షణం ఒక్కొక్క యుగంలా గడిచిపోతూంది. చివరికి భీమసేనుని రాక కూడా బాగా ఆలస్యం అయింది.

గత్యంతరం లేక ధర్మరాజే ఆ సరోవరానికి బయలుదేరాడు.

ఆ కమలాకరం తీరానికి చేరుకునే సరికి సూర్యాస్తమయం అయింది. అప్పుడే కొంచెం కొంచెం చీకటిపడుతూంది. సరోవరం అంతా నిశ్చలమై, ఒక పెద్ద వెండి అద్దంలా స్వచ్ఛంగా మెరిసి పోతూంది! ఎంత పరీక్షగా పరిశీలించినా అవతలితీరం కనిపించ నంతటి విశాల తటాకమది! దానిలో అంతటా రంగురంగుల కలువలు అప్పుడప్పుడే వికసిస్తున్నాయి! చుట్టూరా గుబురులుగా పెరిగిన పెద్ద వృక్షాలాసరస్సులో ప్రతిఫలిస్తూ, అదికూడా ఆ అడవిలో ఒక భాగ మేమో అనిపిస్తున్నాయి. ఇంతలో ఒక గుడ్లగూబ దిగులుగా కూసింది! పక్కనే ఒక తామరాకుమీద నిలబడివున్న కొంగ రెక్కలు మెరిపిస్తూ నెమ్మదిగా అక్కడినించి ఎగిరిపోయింది. దాని రెక్కల వెలుగు లా కొలనులో తళతళా మెరిశాయి.

ధర్మరాజక్కడికి చేరుకునేసరికి సరిగా శుద్ధచవితి వెన్నెల వెలుగులు కూడా తోడై ఆ జలాశయాని కొక విచిత్ర సౌందర్యం మేళ వించాయి!

ధర్మరాజా అద్భుత తటాకం చూచి తన కన్నులే నమ్మలేక పోయాడు! వెంటనే అతనికి ఆ పక్కగా పడివున్న భీమార్జున నకుల సహదేవులు కనిపించారు. ఆత్రంగా వారిని సమీపించాడు. వారం దరూ మృతులై వరసగా నేలమీద పడివున్నారు.

ఆ బీభత్సదృశ్యం చూసేసరికి ధర్మపుత్రునికి మరి తన దాహం మాటే జ్ఞాపకం రాలేదు! దగ్గరకు వెళ్ళి జాగ్రత్తగా వారి ముఖకవళి కలు పరిశీలించాడు. శాంతప్రాయులై పడివున్న వారి ముఖాల్లో జీవ కళ దృశ్యాదృశ్యంగానైనా పొడగట్టలేదు. ఆ ఘోర విపత్పరంపరకు కారకు లెవరో కూడా తెలియలేదు!

అతని హృదయంలో దుఃఖం ఒక్కసారిగా సముద్ర తరంగంలా ఉప్పొంగి పరవళ్ళు దొక్కింది! 'ఈ అరణ్యావాసంలో తమ కష్టాలు గట్టెక్కే శుభ క్షణం మరి రాదా' అనిపించింది ఆ ధర్మమూర్తికి! ముందు వారి ముఖాలమీద ఇంత శీతలోదకం చిలకరించాలనే తొంద

రతో ఆ తటాకంలో ప్రవేశించాడు! ఆ విధంగానైనా వారు జీవిస్తారేమోనని అతని ఆశ!

వెంటనే మేఘగంభీర స్వరంతో ఆ భయంకర గర్జితం ప్రారంభమయింది! ఆ ధ్వని బయలుదేరగానే ఆ సరస్సులో విశ్రమించిన పక్షులు టపటప రెక్కలాడిస్తూ పైకెగిరిపోయాయి! అశరీరవాణి గర్జన ఇలా వినిపించింది:

"నీ సహోదరులు నా మాట నిర్లక్ష్యము చెయ్యడంవల్లనే ఈ దురవస్థ పాలైనారు. ఈ సరోవరం నాది! నా ప్రశ్నలకు ప్రత్యుత్తరాలిచ్చిన తరువాత దాహం తీర్చుకోవచ్చు! లేకపోతే ఎంతటి వారికైనా ఇదే దుర్దశ!"

ఎటు చూచినా ధర్మపుత్రుని కా పరిసరాల్లో ఎక్కడా మానవాకృతి కనిపించలేదు! తిరిగీ క్షణకాలం ఆ సరోవరం అంతా పరిశీలించి చూశాడు. కొంచెం ఆలోచించి—

"ఓ అశరీరవాణీ! ఎవరు నీవు?" అన్నాడు.

"నేనొక కొంగను!"

"అయ్యా! నీ శరీరం నా నేత్రాలకు గోచరం కావడం లేదు. నీవు బక రూపధరుడైన రుద్రుడవో, పావకుడవో, పవనదేవతవో అయి ఉండవలెను! కానినాడు దేవాసుర గంధర్వాదుల కజేయులైన నా సోదరుల నీ విధంగా జయించలేవు!"

"ధర్మపుత్రా! నీ వన్నది నిజమే సుమా! నేనొక యక్షుడనే!"

అతని కెదురుగా తాళవృక్షం అంతటి దీర్ఘ దేహంతో ఒక మహాపురుషుడు ప్రత్యక్షమైనాడు! అతని కోరలు చంద్రవంకల్లా తళతళ మెరుస్తున్నాయి! నేత్రాలు చింతనిప్పులా కణకణలాడుతూ మండుతున్నాయి. అతని శరీర కాంతులతో ఆ సరోవరపరిసరంలో అంతటా పున్నమి వెలుగుల వెల్లువలు నిండిపోయాయి!

ధర్మరా జతనికి నమస్కరించి "మహాత్మా! మీ ప్రశ్నలన్నిటికి సముచితమైన ప్రత్యుత్తరాలిచ్చే సామర్థ్యం నాకులేదు. నా శక్త్యనుసారంగా విన్నవించుకొంటాను." అన్నాడు.

యక్షుడు ధర్మరాజు నీ విధంగా ప్రశ్నించాడు. వెంటనే అత
డా ప్రశ్నలకు ప్రత్యుత్తరా లందించాడు.

"సూర్యదేవుని నడిపించేదేది?"

"బ్రహ్మ శక్తి!"

"ఆపత్పరంపరలో జీవుని రక్షించేదేది?"

"ధైర్యం!"

"ధరణికన్నా మహత్తరమైనది?"

"శిశు సంరక్షణభారం వహించే జనని!"

"ఆకాశంకన్నా సమున్నతుడెవడు?"

"జనకుడు."

"గాలికన్నా త్వరగా పరుగెత్తేది?"

"మనస్సు."

"నిద్రించినా కన్ను మూయనిది?"

"మీను."

"జన్మించినా చైతన్యం లేనిది?"

"గుడ్డు"

"రూపమున్నా హృదయం లేనిది?"

"రాయి."

"వేగంవల్ల జీవించేది?"

"ఏరు."

అటుపిమ్మట యక్షు డొక నిమిషం ఆగి తిరిగి ప్రశ్నించాడు.

"చివికి జీర్ణించిన తృణం కన్నా శిథిలమైనది?"

"చింతావ్యాకులమైన హృదయం."

"మరణించిన జీవుని వెంటనంటిపోయే దెవరు?"

"ధర్మం"

"ప్రపంచంలో అత్యద్భుతమైన విషయ మేది?"

"అనుక్షణమూ మానవులు యమలోకానికి ప్రయాణం అవుతూనే ఉన్నారు! అయినా మిగిలినవారందరూ తాము కలకాలం జీవించాలని కాంక్షిస్తారు! ఇంతకన్నా మహాద్భుతమేదీ లేదు!"

"ఒకటి విడిచివేసిన మనుష్యుడు మహైశ్వర్యవంతుడవుతున్నాడు! అది ఏది?"

"కోరిక"

"యథార్థమైన బ్రాహ్మణత్వ సిద్ధికి హేతువేది? జన్మమా? శాస్త్రాధ్యయనమా?"

"రెండూ కానేరవు! సత్ప్రవర్తనవల్లనే బ్రాహ్మణత్వం సిద్ధిస్తున్నది!"

"జీవన్మృతుడెవడు?"

"బంధు భృత్యాదుల కన్నుగప్పి తానొకడే భోగాలనుభవించే క్షుద్రుడు!"

"గృహస్థునికి బంధువెవరు?"

"శీలవతియైన కళత్రం."

"బ్రాహ్మణునికి దేవత్వ సిద్ధికి కారణమేది?"

"వేద శాస్త్రాధ్యయనము."

"భూదేవుడు మానవుడుగా మారిపోవడానికి కారణం?"

"మృత్యుభయం!"

"అందరితోనూ ఆప్యాయంగా వర్తించాలంటే విడిచిపెట్టవలసిన వేవి?"

"గర్వాహంకారాలు."

"ఈ లోకానికి దిక్కెవ్వరు?"

"సత్పురుషులు!"

"నిజమైన పురుషుడెవడు?"

"మహాకీర్తిశాలి."

ఆ విధంగా అడిగిన ఇంకా ఎన్నెన్నో ప్రశ్నలకు ధర్మరాజు వెను వెంటనే సమాధానా లిచ్చేసరికి యక్షు డెంతో ఆనందించి అతనితో ఇలా అన్నాడు :

"రాజా ! నీ విచ్చిన సదుత్తరాలు విని ఎంతో సంతోషించాను ఈ నలుగురిలో ఎవరినో ఒకరిని మాత్రమే బ్రతికించగలను ! వరం కోరుకో !"

ధర్మపుత్రుడు మృతులై పడియున్న ఆ నలుగురి వైపు ఎంతో ఆప్యాయంగా చూచాడు. కొంతసేపటివరకూ అతనికి మరి ఏమన డానికీ పాలుపోలేదు ! చిట్టచివరకి – "మహా సౌందర్యశాలి నకుల కుమారుని బ్రతికించుకోవాలని నా కోరిక !" అన్నాడు.

యక్షు డా సమాధానంతో ఎంతో ఆశ్చర్యపడి "భీమార్జునులు నీ కత్యంత ప్రేమపాత్రులుగదా ! వారి నేల కోరలేదు ?" అన్నాడు.

"మా తల్లి సంతానంలో నేనొకణ్ణి జీవించి ఉన్నానుగదా ! మరి మాద్రీదేవి సంతానంలో ఒకరైనా ఉండవద్దా ? మహాత్మా. నీకు తెలియని ధర్మమేమున్నది ?"

ఈ సమాధానం విని యక్షు డింకా ఆనందించి ఇలా అన్నాడు: "ధర్మరాజా ! ఈ మాట అనగలిగిన ధర్మవేత్తవు నీ వొక్కడవే! నీ ధర్మనిష్ఠ నాకెంతో ఆనందం కలిగిస్తున్నది. నీ సోదరులందరూ వెంటనే క్షుత్పిపాసారహితులై జీవిస్తారు ! అదిగో చూడు !"

ఆ క్షణంలోనే మిగిలిన పాండవులందరూ గాఢనిద్రపోయి మేల్కొన్నట్లుగా లేచి నిలబడ్డారు !

ధర్మరా జానంద కల్లోలంలో మునిగి తేలుతూ అన్నాడు :

"అయ్యా, నీవు యక్షమాత్రుడవు కానేకావు ! సందేహం లేదు !"

"అవును ! నేను యక్షుడను కానిమాట యథార్థమే ! నీ ధర్మ పరీక్షార్థమై వచ్చిన ధర్మదేవత నే ! తిరిగి నీ కింకొక వరం ప్రసాదిస్తు న్నాను. నీ అభీష్ట మేదైనాసరే ! కోరుకో !"

దానిమీద ధర్మరాజు "పాపం! ఆ బ్రాహ్మణుని అరణి ఆ మృగం అపహరించుకుపోయింది. ఆ ఆరణికంటే మరి నాకు కోరదగిన దేదీలేదు." అన్నాడు.

ధర్మ దేవత చల్లని వెలుగు లా సరోవరంలోను, ఆ పరిసరంలోను అమృత వర్షం జల్లులుగా ప్రసరించాయి. అతడు ధర్మరాజు నీ విధం గా దించాడు:

"నాయనా! నా అంశంతో అవతరించిన నీ ధర్మ నిరతికి దేవతలు పుష్పవర్షం కురిపిస్తున్నారు! మృగరూపంలో ఆ అరణి అపహరించి నిన్నింతగా క్లేశ పెట్టినది నేనే! ఇదిగో ఆ అరణి! తీసుకో! నీవు వరమేదీ కోరకపోయినా—అజ్ఞాత వాసంలో మీ రే రూపాలు ధరించాలని కోరినా ఆ విధంగా మీ కారూపా లేర్పడేటట్లు వరం ఇస్తున్నాను! మీ అందరి ధర్మనిరతికీ శుభం కలుగుగాక!"

వెనువెంటనే అదృశ్యమై పోతూన్న ధర్మదేవత మీదా, పాండవుల మీదా పరిసరవృక్షాలూ, లతలూ రంగు రంగుల పూల వానల జల్లులు కురిపించాయి!



# పాదప్రహారం

## 1

మాధవుడు భట్టశ్యామిలకుని చూసీ చూడగానే తాంబూల చర్వణం ఆపివేసి సగౌరవంగా ప్రత్యుత్థానం చేసి అతన్ని తన సరసనే కూర్చోబెట్టుకున్నాడు. వ్యంగ్యంగా చిరునవ్వు చిందించి నెమ్మదిగా అడిగాడు :

"ఇదేమిటి విటశేఖరులు భట్టశ్యామిలకులీవేళ ఇలా విచ్చేశారు!"

"ఒక పెద్ద రాచకార్యమే వచ్చిందయ్యా!"

"ఇంతటి విటశేఖరులు మీకు రాచకార్యమేమిటండీ!" అని ఎంతో ఆశ్చర్యపడ్డాడు మాధవుడు. శ్యామిలకుడు వెటకారంగా నవ్వాడు :

"మన విష్ణునాగుడే తెచ్చిపెట్టాడీ లేనిపోని రభస అంతాను!"

"ఏమి చేశాట్ట!"

"ఎప్పుడూ వేశ్యవాటిక వీధివైపైనా తొంగిచూడని ఆ మహానుభావుడు మొన్న మన మదనసేనిక భవంతికి విజయంచేశాడు."

"ఎన్నడూ పెద్దలమాట జవదాటని మహా నిష్ఠాపరుడు అతగాడికి కించిద్విలాసం ఎందుకు కలిగిందో!"

"మన భవకీర్తి లేడూ ఇలాంటివాటి కన్నిని! అతగాడే చేశాడిదంతా!"

మాధవుడు తన కేమీ బోధపడలేదన్నట్లదే తీరులో శ్యామిలకుని వైపు చూచాడు. శ్యామిలకుడు మళ్ళీ ఒక వెకిలినవ్వు నవ్వాడు!

"ఆ భవకీర్తి మనవాడితో ఏమన్నాడూ! 'నీ కేమీ భయంలేదులే. నేనున్నానుగా. ఇది రెండోకంటివాడికి తెలియనివ్వనులే!' అని మెల్లిగా బుజ్జగించి మన విష్ణునాగమ్మని చాటుమాటుగా ఆ మదనసేనిక భవంతికి తోడుకుపోయాడు."

"సరే! ఇంతకీ అంత రభస ఎందుకు జరిగింది?"

"చెబుతూంటేనే! మన విష్ణునాగుడు తను మహాభరతశాస్త్రవేత్త అనిపించుకోవాలనే భేషజంకొద్దీ రాధికాభినయం పట్టవలసిందని మదనసేనిక నడిగాడు."

"చక్కగానే అడిగాడు! బాగానేఉంది! దానికేం!"

శ్యామిలకుడు పొంగిపొంగివస్తూన్న నవ్వాపుకుని మళ్ళీ మొదలు పెట్టాడు :

"అసలు కథంతా ఆపైనే ఉంది! ఆ మదనసేనిక మాత్రం తక్కువ తిందా? అది మన చచ్చునాగమ్మ ధోరణి అంతా ఒక్క క్షణంలో పసిగట్టివేసింది. ఆ పైన దాని కొంటెతనం నువ్వు కొంచెం చవిచూచావుగదా! అది ఏమి చేసింది—ఆ అభినయం మొదలుపెట్టి సరిగా రాధిక శ్రీకృష్ణస్వామివారిని తన పాదారవిందంతో అనుగ్రహించే రసవత్తరఘట్టంలో తన పాదాగ్రంతో విష్ణునాగుని శిరస్సుపై అలవోకగా స్పృశించింది!"

ఆ మాట విని మాధవుడొక్క నవ్వునవ్వాడు :

"వహవ్వా! ఆ విష్ణునాగుడెంతటి అదృష్టవంతుడయ్యా! అందుకనే ఆదికవి వాల్మీకి అలా సెలవిచ్చాడు! 'ఏతి జీవంత మానందో నరం వర్షశతాదపి!'—బతికిఉంటే నూరేళ్ళకైనా మనిషి అన్నవాడి కేదో మహా భాగ్యం పట్టి తీరుతుంది. నిజమే!"

ఆ పైన శ్యామిలకుడు చెప్పేది తిన్నగా వినిపించుకోకుండా అదే పనిగా నవ్వడం మొదలుపెట్టాడు. శ్యామిలకుడు తాను చెప్పే దింకా పూర్తికాలేదని అతని కడ్డుతగిలాడు. సరేనని మాధవు డతడు చెప్పే దంతా శ్రద్ధగా ఆలకించాడు. శ్యామిలకుడు మొదలుపెట్టాడు:

"జరిగిన రభసంతా ఆ పైనే జరిగింది. మదనసేనిక పాదాగ్రంతో అలవోకగా తాకగానే విష్ణునాగుడు తోకతొక్కిన తాచులా మండిపడ్డాడు. ఆమె ఆ విధంగా తన తల తన్నడంతో తన ఆర్షేయ పౌరుషేయాలన్నీ అమాంతంగా మంటగలిసి పోయాయని వలవలా వాపోయాడు. తన నిష్ఠలు, నియమాలు—అన్నీ గంగలో కలిసిపోయాయనీ, తన కిక ప్రాయశ్చిత్తం తప్ప గత్యంతరంలేదనీ తలపట్టుకుని తేలు కుట్టినట్టు అదేపనిగా విలవిల లాడడం మొదలుపెట్టాడు.

"పాపం! మదనసేనిక ఆ ఆఘాతంతో నిలువునా నీరయిపోయింది. తనవల్ల పెద్ద తప్పిదమే జరిగిపోయిందనీ, ఇక ఎప్పుడూ ఇలాంటి మహాపచారం చెయ్యననీ అనేక విధాలుగా అతన్ని కాళ్ళా వేళ్ళా పడి బతిమాలుకుంది. కాని విష్ణునాగు డిక ఆమెమాట చెవి కెక్కనీయలేదు! ఇక అక్కడ ఒక్క నిమిషమైనా నిలబడనని తటాలున లేచి నిలబడ్డాడు.

"భవకీర్తి అంతవరకూ నోటమాటలేక అలాగే అక్కడ కూలబడిపోయాడు. విష్ణునాగుడు తటాలునలేచి నిలబడేసరికి అతని కేమితోచిందో—అతడుకూడా విష్ణునాగునికి బాగా పక్కతాళం వేశాడు. ఆ పైక్షణంలో వారిద్దరూ మదనసేనిక భవంతి దాటి రాజవీథిలో పడ్డారు."

శ్యామిలకు డదేపనిగా వెకిలిగా నవ్వాడు. ఈమారు మాధవు డతని కడ్డుపడ్డాడు:

"అయితే మధ్యన ఈ రభస అంతా ఎందుకు?"

"విష్ణునాగుడు స్వయంగా విట పరిషత్తువారిని తనకు ప్రాయశ్చిత్తం విధించవలసిందని అభ్యర్థించాడయ్యా! అందుచేతనే ఈ వేళ గోధూళివేళ విట మండలివారంతా విట మండపంలో సమావిష్టు లవు

తున్నారు! నీవు తప్పక విట మంటపానికి విజయంచేసి విష్ణునాగునికి ప్రాయశ్చిత్తం సెలవిప్పించాలి! నీవు కేవలం విటధర్మ వేత్తవుగదా!"

శ్యామిలకుడు ధూర్తవినయం నటిస్తూ మాధవుని ఎదట నుదుటిపై అంజలి ఘటించి కొంచెం తలవంచి సగౌరవంగా నిలుచున్నాడు.

మాధవుని కదంతా ఒక పెద్ద అభూతకల్పనగా, కపట నాటకంగా కనిపించింది. కాని శ్యామిలకుడు చెప్పేదంతా వట్టి కల్ల అని కొట్టివెయ్యడానికి కూడా అతనికి మనసొప్పలేదు. కొంచెం సందేహిస్తూ అడిగాడు:

"అయితే ఆ విష్ణునాగుడా ప్రాయశ్చిత్తం సంగతి ధర్మశాస్త్రజ్ఞుల్ని అడగకుండా విట పరిషత్తువారి నెందు కడుగుతున్నాడు?"

"నాకు అప్పుడే వేళ మించిపోతూంది! ఇవ్వన్నీ నీ కెరిగించడాని కిప్పుడు తీరికలేదు. అన్నీ అక్కడే తెలుస్తాయి. తప్పక విట మంటపానికి విజయం చెయ్యాలి!"

అని శ్యామిలకుడు త్వరగా అడుగులు వేసుకుంటూ, రాజవీథిలో పడ్డాడు. మాధవుడు కొంతసేపటివరకూ అలాగే దిగాలుపడి నిలుచున్నాడు. ఆ విడ్డూరమేదో తెలుసుకోవాలని వెంటనే విటమంటపానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.

సార్వభౌమ నగరం నవచైత్ర శోభతో కలకలలాడింది. సాయంకాలవేళ నీరెండలో నగరోద్యానాలలో రాలిపడిన పుష్పాడి తళతళ లాడింది.

సంపన్నులయిన పౌరుల నేకులు గజాశ్వాందోళికాది వాహనాల మీద, కర్ణీరథాలమీద వాహ్యాళికి బయలుదేరారు. వారందరి ముఖాలలోనూ నూతన వసంతోత్సాహం వెల్లివిరిసింది.

కొందరు యువకులు వారాంగనలతో కలిసి, ఉత్తమాశ్వాలపై హుషారుగా స్వారిచేస్తున్నారు. మరికొందరు వారాంగన లుత్తమాశ్వాలపై ఒంటరిగానే స్వారిచేస్తూ తమ ఒయ్యారాలన్నీ పార్శ్వ

లలో సాగిపోయే యువజనులపై ఒలకబోస్తున్నారు. కొంద రుత్త మాంగన లాందోళికలలో సాగిపోతూంటే పైరగాలికి తొలిగిన వారి మేను ముసుగులు పౌరుల కప్పుడప్పుడు సాయంకాలానికి పూర్వమే చంద్రోదయ విభ్రాంతి కలిగిస్తున్నాయి.

కాని ఆనాడు రాజవీధిలో నిరుత్సాహంగా సాగిపోయే విష్ణు నాగుని కొక్కనికే ఆ ఉత్సాహం, అంతా ఏదో దారీ తెన్నూ లేని అనాచారంగా కనిపించింది. అత డలాగే తొందర తొందరగా విట మంటపం వైపు సాగిపోయాడు.

విష్ణునాగుడు సార్వభౌమనగర మహామాత్రుని పుత్రుడు. అతని తండ్రి స్వర్గస్థుడైనా ఆయనమీది గౌరవంవల్లనయితేనేమి, విష్ణునాగుని సేవాతత్పరతవల్లనయితే నేమి సార్వభౌమ నగరాధీశ్వరుని కొలువులో అతని కొక చిన్నపదవి దొరికింది.

విష్ణునాగుని కిప్పటికీ ఇంకా ఇరవైఐదు ఏళ్లయినా నిండలేదు. అయితే అతని కింతకు పూర్వమే వివాహం జరిగిపోయింది. వెంటనే భార్య కాపరానికి వచ్చివేసింది.

మొదటినుంచి అతడు బాగా తండ్రిచాటు బిడ్డగానే పెరిగాడు. తండ్రి కాలంచేసి అప్పుడే రెండుమూడేళ్ళయింది. కాని అతనిలోని తండ్రిచాటుతనం ఇంకా అలాగే ఉండిపోయింది.

విష్ణునాగునికి తండ్రి సంపాదించిపోయిన ఐశ్వర్యం కొంత సంక్ర మించింది. ఆ పైన అతడు చాలా భయస్థుడు. పైగా కొంచెం అమాయి కుడు. కనుకనే ఎంతో గుట్టుగా సంసారయాత్ర సాగిస్తూ ఇరుగు పొరు గుల నోళ్లల్లో పడకుండా మర్యాదగా కాలక్షేపం చేసుకుంటున్నాడు.

విష్ణునాగు డెంతో నిష్ఠాపరుడు. దైవబ్రాహ్మణభక్తి అతనికి అనూచానంగా సంక్రమించింది. తెల్లవారు జామునే లేవడం, నియ మాలూ, నిష్ఠలూ, జపతపాలూ మొదలైనవన్నీ ముగించుకోవడం, భోజ నానంతరం కొలువుకూటానికి వెళ్ళిపోవడం, మళ్ళీ దీపదీపాలవేళ తిరిగి రావడం—ఇదీ అతని నిత్యదినకృత్యం! అంతేగాని అత డెన్నడూ పురోద్యానాల వైపు వాహ్యాళి కైనా వెళ్ళిన పాపాన పోలేదు.

తండ్రి గతించిన కొన్నాళ్ల కతనిర్ధోరణి కొంచెం మారింది. దానికి చాలావరకు భవకీర్తే కారణం. అతగాడు విష్ణునాగునికి కొంచెం దూరబంధువు.

విష్ణునాగునికి స్వాతంత్ర్యం వచ్చినప్పటి నించి భవకీర్తి కాతని మీది ఆప్యాయత బాగా పెరిగింది. భవకీర్తి తాత ముత్తాతలు సంపాదించినదంతా నృత్యగీతాది ప్రసంగాల క్రింద ఆర్పేశాడు. ఇక అతని కాలోజు గడవాలంటే ఎవరినో ఇంకొకరి నాశ్రయించక తప్పదు. ఆ సమయంలో అతనికి విష్ణునాగుని సంగతి జ్ఞాపకం వచ్చింది. అప్పటి నించీ నెమ్మది నెమ్మదిగా అతనితో బాగా నేస్తం కలిపాడు.

భవకీర్తితో స్నేహం ముదిరినకొద్దీ విష్ణునాగునికి తన నియమాల మీది పట్టు కొంచెం సడలింది.

ఒకనాడు భవకీర్తి విష్ణునాగునితో మదనసేనిక భవంతిలో నృత్యం చూసివత్తామని అన్నాడు. విష్ణునాగుడు మొట్టమొదట దానికంగీకరించ లేదు. కాని ఊరూ, వాడా వసంతోత్సవాలతో తలమునకలవుతూంటే అతనికి కూడా కొంచెం ఉత్సాహం బయలుదేరింది. ఒకనాడు భవకీర్తితో కలిసి మదనసేనిక భవంతికి వెళ్ళాడు.

కాని అక్కడ ఆ విడూరం జరగగానే విష్ణునాగుడు వెంటనే ధర్మశాస్త్రవేత్తల సన్నిధికి బయలుదేరాడు. భవకీర్తి అదే చక్కని మార్గమని చెప్పి చల్లచల్లగా తన ఇంటికి జారుకున్నాడు. ఇక ఆనాటి నించీ విష్ణునాగుడంటేనే అతనికి భయం పట్టుకుంది. అలాంటి పరమ ఛాందసుణ్ణి మదనసేనిక నృత్యగోష్ఠికి పిలుచుకుపోవడం ఒక పెద్ద తెలివి తక్కువపని అనుకొని రెండుచేతులతోనూ రెండు చెంపలు వాయించుకొన్నాడు.

విష్ణునాగుడు ధర్మవేత్తల సన్నిధికి వెళ్ళి తనకు మదనసేనికవల్ల జరిగిన మహాపచారం అంతా ఆమూలాగ్రంగా విన్నవించుకొన్నాడు.

తన తాతముత్తాతలు పరమభాగవతోత్తములనీ, దుస్సాంగత్యం వల్ల తన కిటువంటి దురదృష్టం సంభవించిందనీ, దానికి ప్రాయశ్చిత్త మేదైనా సెలవీయవలసిందనీ పరిపరివిధాలుగా వారి పాదాలపైబడి ప్రాధేయపడ్డాడు.

ధర్మవేత్తలతని ధోరణి చూచి కొంచెం ఆశ్చర్యపోయారు. ఆ రోజుల్లో ద్విజన్ములు కూడా అంతగా పాటించని ఆచారాలంటే అతని కంతటి ఆసక్తలగడం వారి కెంతో విచిత్రంగా కనిపించింది.

అక్కడ నలుగు రైదుగురు ధర్మవేత్త లేవో ధర్మసూక్ష్మాలు చర్చిస్తున్నారు. వారంతా తమ ధర్మశాస్త్రగ్రంథాలన్నీ గాలించి చూచారు. కాని వారి కెక్కడా ఆ గ్రంథాలలో గణికా పాదప్రహారానికి తగిన ప్రాయశ్చిత్తం కనిపించలేదు. వా రామాటే విష్ణునాగునితో అన్నారు. అయినా ఆతడు తన పట్టు విడవలేదు. వారంతా ఒకరి మొహా లొకరు చూచుకున్నారు. ముసిముసినవ్వులు నవ్వుకొన్నారు. విష్ణునాగుడు వట్టి వెర్రిబాగులవాడనీ, పైగా కొంత మూర్ఖత్వంకూడా దానికి తోడైందనీ బాగా పసికట్టి వేశారు. వెనువెంటనే వారిలో ఒక ధర్మవేత్త అతని కొక చిన్న సదుపదేశం చేశాడు. అది కేవలం విటపరిషత్తు నిర్ణయించవలసిన ప్రశ్న అనీ, విటమండలి దగ్గరికి వెళ్ళవలసిందనీ ప్రోత్సహించాడు. విట సభాపతి భట్టిజీమూతుడతని ప్రార్థన విని ఆనాటి సాయంకాలమే విట శేఖరులందరూ విట మంటపానికి విచ్చేయ వలిసిందని ఆహ్వానించాడు.

విష్ణునాగుడు విటమంటపం చేరుకునేసరికి సాయంకాల సూర్యకిరణాలు మంటపం వాకిట నిలిచిన కర్ణీరథాలమీదా, గజాశ్వాందోళికాది వాహనాలమీది వెండిబంగారు మువ్వలమీదా చిత్రవిచిత్రమైన రంగు రంగుల వసంతోత్సవ చూర్ణాలు వెదజల్లుతున్నాయి. అంతలో అతని కొక సౌధశిఖరంమీద పెంపుడు నెమలికి నృత్యం నేర్పుతున్న ఒక వారాంగన కనిపించింది.

అతడు తటాలున తన దృష్టి మరిఒకచోటికి మరల్చివేశాడు. ఆ ప్రదేశంలో అతనికి వసంతోత్సవంలో ఒకరొకరిపై వసంతాలు చల్లుకొంటున్న యువతీ యువకుల కోలాహలం వినిపించింది. ఇంకొకచోట ఒక నెమలికేక వినిపించింది. అంతలోనే దూరదూరంగా నగరోద్యానవనంలో సన్న సన్నని కోయిల పిలుపు వినిపించింది. విష్ణునాగుడు తటాలున తలవంచుకొని తొందరగా విటమంటపంలో ప్రవేశించాడు.

విటమంటపం ఆ నాడు అతనికి సాక్షాత్తుగా వసంతోత్సవం రూపుదాల్చినట్టే కనబడింది. విష్ణునాగు డొక మూల సుఖాసనంమీద ున మేను జేరవేశాడు. విటశేఖరులు కొంద రతనినిచూచి ఎంతో మర్యాదగా పక్క పక్కలకు తొలిగిపోయారు. మరికొంద రతనిని ాగాదిగా చూచి చిరునవ్వులు నవ్వుకొన్నారు. ఇంకా కొంద రతని మోషే పట్టించుకోవడం మానివేసి మధుసేవలో నిమగ్నులై అటుఇటు తూలుతూ కూర్చున్నారు. మరికొందరు గుంపులు గుంపులుగా చేరి పాచికలు విసిరి నేను గెలిచానంటే నేను గెలిచానని ఎగిరెగిరి గంతులు వేస్తున్నారు.

విష్ణునాగు డక్కడ జేరిన వారందరికేసీ కొంచెం పరిశీలనగా చూశాడు. వారిలో చాలామంది అతనికి కేవలం అపరిచితులు. కొం పరి ముఖా లతనికి కొంచెం చూచాయగా గుర్తుకొచ్చాయి. వారిలో కొందరు కేవలం విటులు. మరికొందరు నటులు. మరికొందరు గాన విద్యాప్రవీణులు. మరికొందరు కవులు. ఆ కవులలో కొందరు కాశీ కోసలాది ప్రాంతాలలో ఒక మద్య పాత్రకోసం తమ చాటుకావ్యాలమ్మివేసి ఆ మద్యపాత్రలతోనే తృప్తిపడిన మహానుభావులు!

విష్ణునాగుని కా నట విట గాయక కవిశేఖరుల తీరులు చూడగానే ఒళ్ళంతా ఒక్కమారుగా జలదరించింది. అతనికేదో ఒక వినూతన ప్రపంచంలో ప్రవేశించినట్లనిపించింది. "వీరందరూ ఇలా భ్రష్టులయిపోతున్నారేమి?" అని అతడు కొంచెం ఆశ్చర్యపోయాడు. "నేనిక్కడ కెందుకు వచ్చానా" అని కొంచెం కించపడ్డాడు. కాని ఆపైన ఇకచేసేదేమీ లేక అలాగే ఆ సుఖాసనంలో కూలబడి పోయాడు.

అటుపిమ్మట విటమండలి సభాపతి భట్టిజీమూతుడు విటశేఖరు లందరికీ ప్రస్తుత విషయం విన్నవించాడు:

"తామందరూ వైదిక సంప్రదాయ వేత్తలు. విటాచారధర్మజ్ఞులు. మన విష్ణునాగుడు పరమనైష్ఠికుడు. మహాబ్రహ్మణ్యుడు! ఇతని శిరస్సు వేదమంత్రోక్షధారలచే పరిపూతమైనది. అటువంటి పరమనైష్ఠికుడు

విష్ణునాగుని శిరస్సు మదనసేనిక పాదస్పర్శచేత అపవిత్రమై పంకిలమై పోయింది.

"మీలో విటధర్మవేత్తలు తనకి సముచితమైన ప్రాయశ్చిత్తం ఉపదేశింపవలెనని ఇత డందరికీ అంజలి ఘటించి సవినయంగా ప్రార్థిస్తున్నాడు."

భట్టిజీమూతుడు సదస్యులందరివైపూ కొంచెం వ్యంగ్యంగా చూచి కన్నుగీటాడు. మళ్ళీ ఇంకొకమారు సదస్యులందరికీ సవినయంగా నివేదించాడు:

"విటధర్మం తెలిసిఉండీనా, విష్ణునాగునికి ప్రాయశ్చిత్తం ఉప దేశించనివారు, తల్లిదండ్రుల ఆజ్ఞప్రకారం ద్యూతమద్యపాన వారవేశ్యా ప్రసంగాలలాగే విడిచి పెట్టనివారి మహా రౌరవాది నరకాల పాలై పోతారు!"

అని నెమ్మదిగా తన ధర్మాసనంమీద కూర్చున్నాడు. సదస్యు లలో చాలామంది ఆ శపథంలోని పరిహాసవ్యంగ్యం గ్రహించి ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు.

వారి నవ్వులు చూడగానే విష్ణునాగుని హృదయంలో ఏదో కొంచెం అనుమానం బయలుదేరింది. అయినా అత డలాగే వారి ప్రసంగాలన్నీ అతి శ్రద్ధగా ఆలకిస్తూ కూర్చున్నాడు:

వెంటనే విటమహోపాధ్యాయు డనంతకథకుడు హఠాత్తుగా లేచి నిలుచున్నాడు.

"కామినీమణి అయినటువంటి మదనసేనిక పాదప్రహార దోహ దంతో అశోకవృక్షం కూడా చిగిరించి పూవులు పూస్తుంది. అటువంటి పాదాగ్రంతో ఆమె ఇతని అపవిత్ర శిరస్సు స్పృశించింది. కనక ముందుగా ప్రాయశ్చిత్తం జరగవలసిన దామె పాదానికే గాని ఇతనికి కానే కాదు!"

ఆ మాట వినగానే సదస్యులంతా మరింతగా పగలబడి నవ్వారు.

ఆ పరిహాసంతో విష్ణునాగునికి వారందరిమీదా కలిగిన అనుమానం మరింత దృఢపడింది. అయినా అనవసరంగా నలుగురిలోనూ ఇంకా

నవ్వులపాలై పోకూడదని నిశ్చయించుకొని అలగే గుంభనగా కూర్చున్నాడు.

అంతలో సభాపతి భట్టిజీమూతుడు లేచి సదస్యులు విటధర్మం తు. చ. తప్పకుండా నిర్ణయించి విష్ణునాగునికి ప్రాయశ్చిత్తం ఉపదేశించాలని హెచ్చరించాడు.

ఆ మాట వింటూనే గుప్తరోమశ కవి లేచి నిలుచున్నాడు:

"ఆ వారాంగన మదన సేనికపాదోదకంతో ఇతని శిరస్సుమీద అభిషేకించండి! ఇలాంటి పరమఛాందసునికిదే తగిన ప్రాయశ్చిత్తం!"

వెనువెంటనే విటసదస్సులో అంతటా సాధువాదాలు, హర్ష ధ్వానాలు చెలరేగాయి.

తరువాత రుద్రవర్మ లేచి నిలుచున్నాడు:

"సభ్యులీతనిని ఈ విధంగా పరిహసించడం న్యాయ్యంకాదు! ఆ పాపాత్మురాలు మదనసేనిక పాదాంగుళులు సోకిన ఇతని శిరోజాలన్నీ ఖండించివెయ్యాలి! అదే ధర్మశాస్త్ర సమ్మతమైన ప్రాయశ్చిత్తం! నా మాట వినండి!"

అటుపిమ్మట అప్పుడప్పుడే పానపాత్ర అంతా ఒకేఒక గుక్కలో ముగించివేసిన భవకీర్తి హఠాత్తుగా అక్కడవాలాడు:

"నేనొక ప్రాయశ్చిత్తం చెబుతాను, శ్రద్ధగా వినండి! ఇతని శిరస్సు సోకగానే ఆ సుకుమారి మదనసేనిక పాదం బాగా నొచ్చి ఉంటుంది. అందుచేత ఆమె పాదాలొత్తడమే ఇతనికి సరియైన ప్రాయశ్చిత్తం!"

తరవాత సభాపతి భట్టిజీమూతుడు నెమ్మదిగా లేచి సభాపతి మర్యాదకు భంగంరాని విధంగా ఇంకొక విధంగా ప్రాయశ్చిత్తం ఉపదేశించాడు:

"నేను విష్ణునాగునికి ధర్మసమ్మతమైన ప్రాయశ్చిత్తం విధిస్తున్నాను. శ్రద్ధగా వినండి! నేనిప్పుడే మదనసేనిక భవంతికి వెళ్లిపోతున్నాను. ఆమె పాదప్రహారంతో నా శిరస్సు పులకించగానే ఇతడది చూచి ఆనందంతో తలపంకించాలి! ఇదే ఇతని శిరస్సుకు సరియైన ప్రాయశ్చిత్తం!"

సభాపతి తుది ధర్మనిర్ణయం వినగానే సభ్యులందరూ ముక్తకంఠాలతో అదే సరియైన ప్రాయశ్చిత్తమని హర్షధ్వానాలు చేశారు.

అప్పటికి విష్ణునాగునికి తన తెలివితక్కువతనమంతా తెలిసి వచ్చింది. వారంతా చేసినవి కేవలం పరిహాసప్రసంగా లన్న విషయం అతని కప్పటికి బాగా బోధపడిపోయింది. ధర్మవేత్తలు విటమండలి సన్నిధికి వెళ్ళవలసిందని తన కాజ్ఞాపించడానికి కూడా అదే కారణమని అతడప్పుడు గ్రహించివేసి గుంభనగా ఒక చిరునవ్వు నవ్వి సవినయంగా సదస్యులందరికీ వంగి వంగి వంకదణ్ణాలు పెట్టాడు:

"ఆర్యమిత్రుల ప్రాయశ్చిత్తాలన్నీ ధర్మసమ్మతమైనవేనని నాకిప్పుడిప్పుడే అవగాహన అయింది! అందుచేత భట్టిజీమూతుల అనంతరమే నేను ముమ్మారులు మదనసేనిక పాదపరిహారభాగ్యం పొంది, పాపపంకిలములై పోయిన నా మనశ్శరీరాలకు యథావిధిగా ప్రాయశ్చిత్తం జరిపించుకోవాలని నిశ్చయించుకున్నాను. ధర్మవేత్తల కిదే నాకృతజ్ఞతాంజలి!"

అని అలాగే దోసిలిఒగ్గి ఆ సభామధ్యంలో అలాగే దీపస్తంభంలా నిలుచున్నాడు.

అతని సమయస్ఫూర్తికీ, మెలకువకూ హర్షించిన సదస్యులంతా ఆకాశం చిల్లులు పడేటట్టు హర్షధ్వానాలు, సాధువాదాలు చేశారు. అనంతరం సువర్ణ మద్యపాత్రిల కోలాహలంలో విష్ణునాగుడు, విటమండలి వసంతోత్సవానందతన్మయతలో మత్తిల్లి మైమరిచారు!

---

# రత్న కుండలాలు

"నాయనా! ఉదంకా! నేనొక రాజకార్యంమీద బయలుదేరి వెళ్ళుతున్నానుగాని, ఇంటిలో నేను లేనప్పుడేలోపమూ రాకుండా నీవు జాగ్రత్తగా కనిపెట్టి చూడాలి సుమా!"

ప్రయాణ సన్నాహమయి బయలుదేరి వెళుతున్న పైలాచార్యుడు శిష్యుని హెచ్చరించాడు.

ఉదంకుడుపాధ్యాయు డింటిలో లేడనే లోపమేమీ లేకుండా బహు శ్రద్ధాళువై ఆయన గృహావసరాలన్నీ పరిశీలిస్తూ జాగ్రత్తగా శుశ్రూష చేశాడు.

మరికొంత కాలానికి ఆచార్యు డాశ్రమానికి తిరిగి వచ్చివేశాడు. శిష్యుని శ్రద్ధాభక్తుల కెంతో మురిసిపోయాడు.

ఉదంకుని విద్యాభ్యాసం ముగియగానే ఆచార్యు డొకనాడు దగ్గిరికి పిలిచి, "ఉదంకా! నీ వేదాభ్యాసం సమాప్తమైనది. ధర్మం తు. చ. తప్పకుండా నాకు శుశ్రూష చేశావు. నీ వింక స్వగృహానికి వెళ్ళవచ్చును. నీకు సమస్తశ్రేయస్సులు సిద్ధించుగాక!" అన్నాడు.

ఉదంకు డా మాటలకెంతో సంతోషించి, "ఆచార్యా! తమ అభీప్సితమేదైనా నెరవేర్చి మరీ స్వగృహానికి తిరిగి వెళ్ళాలని అనుకుంటున్నాను. తమ అభీష్టం ఆనతీయవలసింది." అని అనేక విధాలుగా ప్రార్థించాడు.

దానిమీద పైలుడు "నాయనా! నీవు నన్ననేకవిధాలుగా నిర్బంధిస్తున్నావు. సరే! గురుపత్ని దగ్గరికి వెళ్ళి ఆమె కేదైనా కోరిక ఉన్నట్టయితే అది నెరవేర్చి స్వగృహానికి తిరిగి వెళ్ళిపో!" అని బదులు చెప్పాడు.

ఉదంక డుపాధ్యాయపత్ని సన్నిధికి వెళ్లి ఆమె కిలాగ విన్న వించినాడు :

"అమ్మా! ఉపాధ్యాయులు స్వగృహానికి మరలిపోవడానికి నాకు అనుమతి దయచేశారు. మీ అభీప్సితం ఏదైనా ఉంటే అది నెరవేర్చి, ఆ విధంగా ఆచార్యుని ఋణంతీర్చుకుని మరీ వెళ్ళిపోదామని సంకల్పించు కొన్నాను. ఇందుచేత మీ కోరిక ఏదైనాఉంటే ఆనతీయవలసింది."

ఆ మాటపై పైలపత్ని అతనితో ఇలా చెప్పినది :

"నేటికి నాలుగవ రోజున నేనొక పుణ్యవ్రతం చెయ్యాలని సంకల్పించుకొన్నాను. ఆనాడు పౌష్యమహారాజు భార్య రత్నకుండ లాలు ధరించి, బ్రాహ్మణ సమారాధన చెయ్యాలని నా సంకల్పం. పౌష్యునిదగ్గరికి వెళ్ళి ఆయనపత్ని రత్నకుండలా లడిగి, తీసుకురావలసి నది. ఈ ప్రయత్నంలో నీకు సమస్త శ్రేయస్సులూ సమకూరుగాక!"

ఉదంకుడు 'సరే' అని ఆమెదగ్గర సెలవు తీసుకొని పౌష్యుని పట్టణానికి బయలుదేరాడు.

మార్గంలో అతనికొక గొప్ప వృషభంపై కూర్చున్న మహాపురుషు డొకడు ప్రత్యక్షమయినాడు. ఆ మహాపురుషు డుదంకునితో "నీ వీ వృషభం గోమయం కొంచెం భక్షించవలసినది" అని ఆజ్ఞాపించినాడు.

దానికి ఉదంకుడు సుతరామూ ఇష్టపడలేదు.

"ఉదంకా! నీ వెంతమాత్రమూ సందేహించనవసరంలేదు. మీ ఆచార్యుడే ఒకప్పుడీ గోమయం కొంచెం లోపలికి పుచ్చుకొన్నాడు" అన్నా డా మహాపురుషుడు.

ఉదంకుడు దాని కంగీకరించి, ఆ వృషభం గోమయము, గో మూత్రము కొంచెం లోపలికి పుచ్చుకొని, తిరిగీ పౌష్యమహారాజు పట్ట ణానికి ప్రయాణమైనాడు. అటుపిమ్మట పౌష్యుని దర్శనం చేసుకొని,

అతని ననేక విధాలుగా ఆశీర్వదించి, "మహారాజా! నేనొక కార్యార్థినై తమ సందర్శనానికి వచ్చాను" అన్నాడు.

"నేను పౌష్యుడనుగదా! నన్ను మీ రేమైనా అర్థించవచ్చునే!" అన్నాడు పౌష్యుడు.

"గురు కార్యార్థినై మహారాజ్ఞి ధరించే మాణిక్య కుండలాలకోసం మీ సన్నిధికి వచ్చాను. అవి నా కిప్పించవలసింది."

"మహారాణి అంతఃపురంలో ఉన్నది. ఆమె నడిగి ఆ కుండలాలు తీసుకోవచ్చును."

ఉదంకు డటుపిమ్మట అంతఃపురంలో ప్రవేశించాడు. కాని ఎంత వెదికినా అతనికక్కడ ఆ రాణి కనిపించలేదు.

ఉదంకుడు తిరిగి వచ్చి పౌష్యునితో "మహారాజా! అనృతమాడి న న్నీవిధంగా వంచించడం మీకు న్యాయంకాదు. మహారాణి అంతఃపురంలో ఎక్కడా కనిపించలేదు." అన్నాడు.

"కాదు! ఆమె అంతఃపురంలోనే ఉన్నది. నీవేమైనా కారణం వల మైలపడిపోయినావేమో! బాగా జ్ఞాపకం చేసుకో! ఆమె మహా పతివ్రత. మైలపడిపోయినవారుగాని, అపరిశుద్ధులుగాని ఆమెను సందర్శించలేరు."

"అవును! నేనొక అశుచి పదార్థం లోపలికి పుచ్చుకుని ఆచమించడం మానివేసినాను."

"అయితే పరిశుద్ధుడవై తిరిగీ ఆమె దర్శనానికి వెళ్ళిపో!"

ఉదంకుడు వెంటనే తూర్పుదిక్కుగా తిరిగి కాళ్ళుచేతులు శుభ్రంగా కడుక్కుని, హృదయంలోకి వెళ్ళేవరకూ పరిశుద్ధోదకం ఆచమించి శుచిఅయి అంతఃపురంలోనికి వెళ్ళినాడు! అంతలోనే అతనికి మహారాజ్ఞి ప్రత్యక్షమైనది!

ఆమె ఉదంకుని చూడగానే లేచి నిలుచుని అభివాదంచేసి "సుస్వాగతం! తమ కేమి కావలెనో తెలియచేయవలసింది" అన్నది.

"గురుకార్యార్థినై మీరు ధరించిన కుండలా లర్థించడం కోసం వచ్చాను."

ఆమె 'సత్పాత్రం దొరికిందిగదా!' అని చాలా సంతోషించి చెవులనున్న కుండలాలు రెండూ తీసి అతని చేతిలో ఉంచి, "నాగరాజు తక్షకుడీ కుండలాలకోసం చాలా తాపత్రియ పడుతున్నాడు. ఇవి బహుభద్రంగా సంరక్షించుకోవలసినది... ఉదంకా! జాగ్రత్తగా తీసుకు వెళ్ళవలెను సుమా!" అన్నది.

ఉదంకుడంతఃపురంలోనించి మహారాజు సన్నిధికి వచ్చి తన సంతృప్తి అంతా ఆయనకు తెలియజేశాడు.

పౌష్యుడతనితో "మహాత్మా! నీ వంటి సత్పాత్రం చిరకాలానికిగాని లభించనేరదు. నీవు సుగుణాల కాలవాలమైన అతిథివి. నేను శ్రాద్ధవిధి ఆచరించాలని సంకల్పించుకొన్నాను. నాకోరిక నెరవేర్చాలని కోరుతున్నాను." అన్నాడు.

"నేను శీఘ్రంగా తిరిగివచ్చి వేస్తున్నానని మాట ఇచ్చిఉన్నాను. కాబట్టి, వండినంత వరకూ అయిన వంటకాలతోనే శ్రాద్ధవిధి నడిపించవలసింది!"

పౌష్యు 'డలాగే' అని అంతవరకూ అయిన వంటకాలతో అతనికి భోజనం పెట్టించాడు, ఉదంకుని కా అన్నంలో తల వెంట్రుకలు కనిపించాయి. అన్నం కూడా బాగా చల్లారిపోయినట్లే ఉన్నది. అతడది గ్రహించి, పౌష్యునితో "నీవు నాకు అశుచిగా ఉన్న అన్నం వడ్డింపజేశావు. ఈ దోషంవల్ల నీవు అంధుడవై పోతావు." అని శపించాడు.

"దోషమేమీ లేని అన్నాని కీ విధంగా వంకలు దిద్దుతున్నావు! కాబట్టి నీకు సంతానమే కలుగకుండుగాక!" అని రాజు తిరిగి ఉదంకునికి శాపం ఇచ్చాడు. అయితే ఉదంకుడతని కా అన్నంలో ఉన్న అపభ్రంశాలన్నీ వెంటనే ఎత్తి చూపించాడు.

తల విరియబోసుకొన్న ఒక స్త్రీ ఆ అన్నం వడ్డించినది. అందువల్లనే దానిలో తల వెంట్రుకలు కనిపించాయి. అన్నంకూడా కొంచెం చల్లారినది. రాజది గ్రహించుకొని, "మహాత్మా! నావల్ల అపరాధం జరిగిపోయింది. నన్ను క్షమించవలసినది. నాకిచ్చిన శాపం ఉపసంహరించి వెయ్యవలెను." అని అనేక విధాలుగా ప్రాధేయపడ్డాడు.

ఉదంకుడు "నేనన్న మాట ఎన్నడూ తప్పిపోదు. నా మాట ప్రకారం నీవు కొంతకాలం వరకూ అంధుడవై పోతావు. కాని త్వరలోనే నీకు తిరిగి దృష్టికలుగుతుంది. మరి నాకిచ్చిన శాపంకూడా ఉపసంహరించ వలసిందని కోరుతున్నాను."

"శాపం ఉపసంహరించడానికి నాకు శక్తిలేదు. ఇంతవరకూ నా కోపం ఉపశమించ నేలేదు. నీ వీ సూక్తి వినలేదా -

'బ్రాహ్మణుని హృదయం కేవలం నవనీతం. అయితే వాక్కులు వాడికత్తులు; క్షత్రియునిలో ఈ రెండూ విపరీతములు. అతని వాక్కు నవనీతం; హృదయం పదునైన కరవాలం.' ఇందువల్లనే నా శాపం మళ్ళించలేను. ఇక నీ దారిని నీవు వెళ్ళవచ్చును."

"అన్నం అశుచిగానే ఉన్నదని నీవంగీకరించి, నేనిచ్చిన శాపం మళ్ళించవలసిందని ప్రాధేయపడ్డావు. అంతకు పూర్వం అన్యాయంగా అన్నం అశుచిగా ఉన్నదని నిందించానసే కారణంచేత నాకు శాపం ఇచ్చి ఉన్నావు. అన్నంలో దోషం ఉన్నదని నీవే అంగీకరించినావే. ఇందుచేత నీ శాపం నన్ను బాధించ నేరదు."

ఉదంకుడా కుండలాలు తీసుకొని, అక్కడినించి బయలు దేరాడు.

అతనికి మార్గంలో ఒక నగ్నశ్రమణకుడు కనిపించాడు. అతని మూర్తి మాటిమాటికి దృశ్యాదృశ్యంగా మారిపోతున్నది.

ఉదంకుడా కుండలాలు రెండూ ఒడ్డున పెట్టి ఒక తటాకంలో స్నానం చెయ్యడాని కుపక్రమించాడు.

ఆలోగా ఆ శ్రమణకు డక్కడికి వచ్చి, ఆ కుండలాలు రెండూ చేజిక్కించుకొని, తొందర తొందరగా పారిపోయాడు.

ఉదంకు డది చూచి వెంటనే అతని వెనకాలే పరుగెత్తుకు వెళ్ళి పట్టుకున్నాడు. శ్రమణకు డా రూపం విడిచివేసి తక్షకరూపం ధరించి క్షణంలో అక్కడ ఏర్పడిన భూవివరంలో దూరి నాగలోకంలో ఉన్న తన భవనానికి వెళ్ళిపోయాడు! ఉదంకుడు కూడా అదే మార్గంలో అతన్ననుసరించి వెళ్ళి క్షణంలో నాగలోకం చేరుకొన్నాడు.

అటుపిమ్మట ఉదంకుడా నాగలోకవాసులైన నాగరాజుల నందరిని హృదయాలు ద్రవించిపోయేటట్లు వేయివిధాలా స్తుతించాడు. ఎన్ని ప్రకారాల స్తోత్రాలు చేసినా తిరిగి అతని కుండలా లతనికి లభింపనేలేదు!

అక్కడ అతనికొక మహాద్భుతం ప్రత్యక్షమైనది! ఇరువురు స్త్రీలు రెండు మగ్గాలకు దగ్గరిగా కూర్చొని ఒదేపనిగా వస్త్రాలు నేస్తున్నారు. వారు నేసే దారాలు కొన్ని నల్లనివి; కొన్ని తెల్లనివీను. అక్కడే అతనికొక మహాశ్చర్యకరమైన చక్రంకూడా కనిపించినది. దానికి పన్నెండాకులు! ఆరుగురు కుమారులా చక్రం నెమ్మదిగా గిరగిర తిప్పుతున్నారు. ఆ కుమారుల సమీపంలో అశ్వారూఢుడైన పురుషుడొక డున్నాడు. వారంతా అతని నేత్రాల కెంతో మనోజ్ఞంగా కనిపించారు. ఉదంకుడు వారి నందరిని వివిధములైన మంత్రాలతో ప్రస్తుతించినాడు.

ఆ అశ్వారూఢుడైన పురుషు డతని స్తోత్రాలకు మిక్కిలి ఆనందించి "నీ స్తోత్రాలతో నాకానందం కలిగింది. ఏమి కావలెనో కోరుకో!" అన్నాడు.

"ఈ నాగులంతా నా వశమైపోవాలి! ఇదే నా కోరిక!" అన్నాడుదంకుడు.

"ఈ అశ్వం చెవిలో గట్టిగా ఊదితే నీ కోరిక నెరవేరగలదు!"

ఉదంకు డా పురుషుడు చెప్పినట్లే చేసినాడు. వెంటనే ఆ అశ్వం ముక్కుపుటాలలోనించి పెద్ద పెద్ద పొగలు, సెగలు, అగ్నిజ్వాలలు బయలుదేరాయి. అవి క్షణంలో నాగలోకం అంతటా అలుముకుపోయాయి.

తక్షకు డా అగ్నిజ్వాలలు చూచి, గజగజ వణికిపోయి, ఆ కుండలాలు రెండూ తీసుకువచ్చి "నీ కుండలాలు నీవు తీసుకుపోవయ్యా!" అని ఉదంకుని హస్తంలో ఉంచాడు.

అత డవి స్వీకరించి "నే నీ కుండలా లుపాధ్యాయ పత్నికీనాటికే తీసుకుపోవాలే! చాలా దూరం వచ్చివేశానే! ఎలాగ!" అని ఎన్నో విధాలుగా ఆందోళన పడ్డాడు.

ఆ విధంగా చింతానిమగ్నుడైన ఉదంకునితో ఆ పురుషుడు "ఉదంకా! నీ వేమీ భయపడనక్కరలేదు! ఈ గుర్రంమీద ఎక్కి కూర్చున్నావంటే కనురెప్పపాటులో ఇది నిన్ను స్వగృహానికి తీసుకు పోగలదులే!" అని అభయం ప్రసాదించాడు.

ఉదంకు డా గుర్రం ఎక్కి ఒక్క నిమిషంలో ఉపాధ్యాయుని గృహం చేరుకొన్నాడు.

ఆ లోగా పైల పత్ని స్నానంచేసి తలకట్టు ఆరబెట్టుకుంటూ "ఉదంకు డింకా ఆ కుండలాలు తీసుకుని రానేలేదు. అతనికి శాపం ఇవ్వవలెను!" అనుకొంటున్నది.

అంతలోనే ఉదంకు డక్కడికి చేరుకొని ఆమెకు పాదాభివంద నం చేసి కుండలా లర్పించాడు.

ఆమె అతని నెంతో ఆప్యాయంగా ఆదరించి "వత్సా, ఒక్క క్షణం ఆలస్యం చేసి ఉంటే నిన్నీపాటికి శపించి ఉందును! దాని కేమి!—సమయానికి రావడంవల్ల నీవేం కోరుకొన్నా అది వెంటనే నెరవేరాలని వరం ఇస్తున్నాను!" అన్నది.

అనంతరం ఉదంకు డుపాధ్యాయునికి కూడా అభివాదం చేశాడు. ఆయన ఆప్యాయంగా అతనిని దగ్గర కూర్చోబెట్టుకొని "అయితే, ఏం నాయనా! ఇంతగా ఆలస్యం చేశావు?" అని ప్రశ్నించాడు. ఉదంకు డిలా సమాధానం చెప్పాడు :

"నాగరాజు తక్షకుడు నాకనేక విధాల విఘ్నాలు కలిగించాడు. అందువల్ల నాగలోకం వెళ్ళవలసి వచ్చినది. అక్కడ నాకు వస్త్రాలు నేస్తూన్న స్త్రీ లిద్దరు కనిపించారు. వారు నేసే దారాలు తెల్లనివి, నల్లనివీను. అక్కడే పన్నెండాకుల చక్రం కూడా ఒకటి కనిపించినది. ఆరుగురు పిన్నవారది తిప్పుతున్నారు. ఇంతే కాదు. అక్కడే ఒక పెద్ద అశ్వము, దానిపైన ఒక ఆజానుబాహువైన పురుషుడు కూడా ఉన్నారు. ఆయనకూడా ఎవరో తెలియలేదు. మొట్టమొదట నామార్గంలో వృషభం మీద కూర్చున్న మరి ఒక మహాపురుషుడు కూడా ప్రత్యక్షమైనాడు. ఆ పురుషు డా వృషభం గోమయం భక్షించవలసిందని ఆజ్ఞాపించాడు. అంతేగాక మీరే ఒకప్పుడది భక్షించారని కూడా

అన్నాడు. నేనది కొంచెం లోపలికి పుచ్చుకొన్నాను. దయ ఉంచి ఈ అద్భుతాలను గురించి వివరంగా తెలియ జెయ్యవలసిందని కోరుతున్నాను.''

అతనికి ఉపాధ్యాయు డీ విధంగా సమాధానం ఇచ్చాడు:

''ఆ స్త్రీ లిద్దరిలో ఒకతె పేరు విధాత. రెండవ స్త్రీ ధాత. తెల్లనివి, నల్లనివి దారాలు చూచానని అన్నావు. అవి రాత్రిం బగళ్ళు! ఆ చక్రం సంవత్సరము. ఆ పన్నెండాకులూ పన్నెండు నెలలు. ఆ ఆరుగురు కుమారులు ఆరు ఋతువులు. వారా సంవత్సరచక్రం తిప్పుతున్నారు. అక్కడ ఉన్న పురుషుడు పర్జన్యుడు. అతని అశ్వం అగ్నిదేవుడు. నీవు దారిలో చూచిన వృషభం ఐరావతుడనే నాగరాజు. దానిపై నున్నవాడు మహేంద్రుడు. నీవు భక్షించిన గోమయం మరేమీ కాదు. సాక్షాత్తు అమృతమే! దానివల్ల నీకువచ్చిన ప్రత్యవాయమేమీ లేదు. ఆ నాగభవనంలో నా మిత్రుడైన ఇంద్రుడే నివసిస్తున్నాడు. అతని అనుగ్రహంవల్లనే తిరిగి నీ కుండలాలు సంపాదించుకో గలిగావు. నాయనా! నీవింక స్వగృహానికి వెళ్ళిపోవచ్చును. నీకు శుభం కలుగుగాక!''

పిమ్మట ఉదంకు డాచార్యునిదగ్గర సెలవు తీసుకుని స్వగృహానికి మరలిపోయాడు.

---

# బహుం హి

## 1

"రేపురా! మాపురా! అని ఇంకా ఎన్నిసారులు తిప్పుతారండీ!"
అని గర్జించి అడిగాడు విద్యానాథుడు.

"ఏం జెయ్యను బాబూ! బేతాళ నాయనింగారు పరబ్రహ్మ వచ్చినా మరి ప్రభు దర్శనం వల్లపడదంటున్నారు! నావల్ల ఏమవుతుంది?"

కొంచెం సర్ది చెప్పాడు సోమయామాత్యుడు.

"ఇన్ని సార్లు తిప్పి చిట్టచివరి కిలాగేనా సన్నాయి నొక్కులు నొక్కడం? ఏమన్న పెద్దమనిషివయ్యా! ఆమాట మొట్టమొదటే ఏడవలేకపోయావూ? నే నేదో మరోదారి చూచుకుందునుగా!"

అని ఈసడించి కసిరి కొట్టాడు విద్యానాథుడు.

"మాటలు మాత్రం తిన్నగా రానీ! ఏమిటి నువ్వు చూసుకునేది? గోదారి!" అని గుడ్లెర్ర జేశాడు సోమయామాత్యుడు.

"అదిగో! ఆ ఏకవచన ప్రయోగం చేశావంటే చూడు నిన్నేం జేస్తానో!"

"ఏమిటయ్యా! నువ్వు చేసేది? ప్రభుదర్శనార్థం వచ్చి పడిగాపులు పడి ఉండవలసిన మనిషి కింత తలపొగరా?"

అని రాసీ రాసీ గంటం అక్కడపెట్టి లేచి నిలబడ్డాడు సోమయామాత్యుడు. వెంటనే విద్యానాథుడతని మీదికి వెళ్ళి విరుచుకుపడ్డాడు.

ఆ పైన విద్యానాథుడు, సోమయామాత్యుడు ఒకరొకరితో గట్టిగా తలపడేదాకా వచ్చింది కాని ఆ పక్కనే కూర్చున్న నలుగు రైదుగురు విశ్వేశ్వరాగ్రహారీకులు ఆ ఇద్దరినీ చెరిఒక పక్కకి నెట్టి వేశారు. ఎవరికి సర్దిచెప్పవలసినట్టు వారికి సర్దిచెప్పారు. ఆ ఇద్దరూ మళ్ళీ రోషాలు పెంచుకుని ఒకరితో ఒకరు తలపడకుండా ఇద్దరిద్దరు చొప్పున వారిద్దరి జబ్బలూ గట్టిగా పట్టుకొన్నారు! అయినా వారిద్దరూ పెనగు లాడడం మానలేదు. సోమయామాత్యుడు మరి విద్యానాథునివైపు చూడడం మానివేసి పక్కనున్నవారికేసి చూస్తూ మండిపడ్డాడు.

"మహారాజ దర్శనం అంటే మాటలా? ఇంతకంటె కొమ్ములు తిరిగిన వాళ్లే కాళ్ళావేళ్ళా పడితే చివరకు బేతాళనాయనింగారి దర్శనం కూడా కాలేదు. ప్రతి పంచాంగ బ్రాహ్మడికీ మహారాజ దర్శనమే నాకి?"

"ఇదిగో! కాస్త పెద్దా పిన్నా తారతమ్యం చూసుకుని మరీ మాట్లాడు! లేకపోతే నిన్ను, ఆ బేతాళ నాయణ్ణి చెరో జబ్బ దొరక బుచ్చుకుని గోదావరిలోకి విసిరివేస్తాను! ఆ తరవాత నేనే స్వయంగా మహారాజదర్శనానికి వెళ్ళిపోతాను! నన్నెవరడ్డగిస్తారో చూస్తానుగా!"

సోమయామాత్యుడు మళ్ళీ ఉగ్రుడైపోయాడు. పక్కనున్న ఇద్దరగ్రహారీకులు అతన్ని మరింత గట్టిగా అదిమి పట్టుకున్నారు.

"నిన్ను మహారాజులుంగారి స్కంధావారం దరిమానానాకికూడా చేరనివ్వను! ఏమనుకున్నావో, సోమయామాత్యుడంటే! చూడు నా తడాఖా!"

"నీలాంటి అప్రాచ్యుల్ని, అశక్త దుర్జనుల్ని చాలామందినే చూశానులే! నువ్విలాంటి గోముఖవ్యాఘ్రానివని నేను మొదటే అనుమానించాను. ఈ పైన నువ్వు చేసేదేమిటో నేను చూస్తానుగా!"

కన్నుమూసి కన్ను తెరిచేలోగా విద్యానాథుడక్కడినించి వెళ్ళి పోయాడు.

సోమయామాత్యుని వీథిచావడిలో ఒక్కమారుగా వాన వెలిసినట్లయింది.

అమాత్యుడు కింద ఉంచిన గంటం మళ్ళీ చేతబట్టి తల ఎత్తకుండా ఎంతో గుంభనగా కవిలె కట్టలు తిరగవెయ్యడం మొదలు పెట్టారు. చుట్టూ కూర్చున్నవారిలో వెంకటభట్టే మొట్టమొదటగా ప్రసంగం ప్రారంభించాడు :

"ఎందు కాయన కంతటి నిడిసిపాటు? స ఎదటివారి అంతరం, తన అంతరం చూసుకో అక్కరలేదూ?. .ఇంతకీ ఎవరండీ ఈ విద్యానాథుడు?"

"ఏమో! ఎవడో! ఎవడైతే మనకేం?" అన్నాడు సోమయామాత్యుడు.

"పాపం! మనిషి యోగ్యుడేనండీ! ఎందు కిలా తొందరపడ్డాడో గాని!" అన్నాడు పేరిభట్టు.

"మీరు గాని ఈయన్ని ఇంతకుపూర్వం ఎక్కడైనా చూచారా?" అన్నాడు సోమయామాత్యుడు రాసీరాసీ గంటం నిలబెట్టి.

"చూడడమేమిటి? ఆయన్ని బాగానే ఎరుగుదును. ఆయనది మా మామగారి గ్రామమే. షట్శాస్త్రాలలోనూ నికరమైన పాండిత్యం కలిగినటువంటి మహా విద్వాంసుడు. ఆపైన దేవతావాణిలో అనర్గళంగా ఆశువు చెప్పగలిగినటువంటి మహా కవీశ్వరుడు కూడాను... అయితేమాత్రం అన్నప్పుడు ప్రభుదర్శనందొరకడమంటే మాటలుటండీ?"

అని సోమయామాత్యుణ్ణి కొంతవరకు సమర్థిస్తూ తన ప్రచప్పరించేశాడు. అమాత్యుని కీ ప్రసంగంతో కొంచెం ఊపిరి తిరిగింది.

"మొట్టమొదట దర్శనం సాధ్యపడుతుందేమోననే ధైర్యంతో కొంచెం మాట ఇచ్చాననే అనుకోండి. అయితే అంత మాత్రంచేత నలుగురిలోనూ పెద్దా పిన్నా తారతమ్యం చూడకుండా అలా దులిపి వేస్తాడా?"

ఆ పైన పేరిభట్టు వ్యంగ్యంగా ఒక చిరునవ్వు విసిరాడు :

"అలా దులిపివెయ్యడం తప్పేననుకోండి. కార్యవాది కంతటి దురుసుతనం పనికిరాదు. కాని, మీరు గట్టిగా తలుచుకుంటే ఆయన కామాత్రం దర్శనం దొరకకపోతుంది గనకనా? ఎందుచేతనో మీకే అలాంటి సత్సంకల్పం కలిగినట్టు కనబడదు."

"ఎందుకు కలగాలీ! ఈయన మొదటినుంచి ఇదేవరస! తానేదో మహా విద్వాంసు డైతేమాత్రం! ఎదటివాళ్లైనా పురుగు అనుకున్నాడా?"

"పాపం! రేపురా, మాపురా అని తిప్పితే, మరి దర్శనంకాదని కంగారుపడి ఉంటాడు. ఇంతకీ మహారాజులుంగా రిక్కడ ఇంకా ఎన్నాళ్ళుంటారో!"

"ఇంకా ఎన్నాళ్లేమిటి? ఎల్లుండి ఉదయమే గోదావరిదాటి వెళ్ళిపోతూంటేనే!"

అని సోమయామాత్యుడు మళ్ళీ కవిలెకట్టలు తిరగవెయ్యడం మొదలుపెట్టాడు. చుట్టూరా కూర్చున్నవారంతా అది చూచి చల్లి చల్లగా తమ ఇళ్ళకు జారుకున్నారు.

## 2

విశ్వేశ్వరాగ్రహారానికి విద్యానాథుడు కొండంత ఆశతో వచ్చాడు. ప్రత్యేకంగా అతడక్కడికి రావడాని కొక ముఖ్యకారణం ఉంది.

ప్రతాపరుద్రదేవమహీపతి గోదావరికి అవ్వలి ఒడ్డున బలిసిన సాంద్రారణ్యంలో వేటాడనున్నాడన్న వార్త కర్ణాకర్ణిగా అతని చెవిని పడింది. ఆ అగ్రహారం గోదావరీతీరాన్ని ఆనుకునేఉంది. వేట బల గంతో గోదావరి దాటేముందు మహారాజు విశ్వేశ్వరాగ్రహారంలో రెండు మూడు రోజులపాటు విడిదిచెయ్యడం ఒక పరిపాటి. విద్యా నాథుడు ముందుగానే ఆ విషయం తెలుసుకున్నాడు.

ఎలాగైనా మహారాజుదర్శనం చేసుకోవాలని సంకల్పించాడు. ఆ సంగతి ముందుగా సోమయామాత్యునితో ప్రస్తావించాడు:

"దానికేమిటి? మహారాజు బహు సులభులు! అందులోనూ మృగయావినోదం సందర్భంలో విద్వద్గోష్ఠి అంటే వారు చెవి కోసుకుంటారు. ఏదో సమయం చూచి నేను దర్శనం ఇప్పించే ఏర్పాటు చేయిస్తానులెండి!" అని అమాత్యుడు విద్యానాథునికి భరవసా ఇచ్చాడు.

కాని మహారాజు అగ్రహారంలో విడిది చెయ్యవలెనని నిర్ణయించుకొన్న మూడు రోజులలోనూ రెండు రోజు లప్పుడే గడిచిపోయాయి. అగ్రహారంలోని నలుగురైదుగురు విద్వాంసుల కప్పుడే అనాయాసంగా రాజదర్శనం లభించింది. కాని విద్యానాథునికి మాత్రం దర్శనం దొరకలేదు. అమాత్యునితో ఎన్నిసారులు చెప్పినా 'అదిగో ఇదిగో' అని కాలక్షేపం చేశాడు. ఇక ఇంకొక్క రోజే మిగిలిఉన్నదనగా విద్యానాథుడు మేల్కొన్నాడు.

అయితే తలవని తలంపుగా ఇప్పు డతనికీ, సోమయామాత్యునికీ మధ్య పెద్ద బద్ధవిరోధం ఏర్పడింది. తనమీద అమాత్యుని కంతటి ఉపేక్షాభావం కలగడానికి గల కారణమేమో విద్యానాథునికి తెలియలేదు. మొట్టమొదట సోమయామాత్యునితో ఆ విషయం సంప్రతించినప్పు డతడు కొంచెం సుముఖంగానే ఉన్నాడు. తరవాత తరవాత అంటీ అంటనట్టుగా మాట్లాడడం మొదలుపెట్టాడు. ఓర్వలేనితనంవల్ల అగ్రహార విద్వాంసు లెవరయినా దర్శనం కాకుండా చేయించవలసిందని చెవి కొరికారేమో! లేకపోతే సోమయామాత్యునికి ముట్టవలసిన మామూళ్లేమైనా ముట్టలేదని అక్కసు బయలుదేరిందేమో! ఎవరు చెప్పగలరు!

ఆలోచించగా ఆలోచించగా విద్యానాథునికి దర్శనం దొరకకపోవడానికి రెండింటిలోనూ ఏదో ఒకటి ప్రబలకారణమై ఉండవచ్చునని తోచింది. అతనిదగ్గరఉన్న నాలుగు వరహాలూ దారి బత్తెంకిందే హారించుకుపోయాయి. అదీగాక తనవంటి మహా విద్వాంసుడు, కవి దర్శనానికి వచ్చినా ఈ మామూళ్ళగోలేనా? ఏమి టీ దౌర్జన్యం?

ఆ విధమైన ఆవేశంతో అతని హృదయం కుతకుతలాడిపోయింది. ఇక ఒకరోజులో ప్రతాపరుద్ర మహీపతి అగ్రహారంలో వేయించిన

తన స్కంధావారం యావత్తూ ఎత్తివేయించి వేటబలగంతో సహా గోదావరిదాటి వెళ్ళిపోతున్నాడు. ఆయన మళ్ళీ తిరిగి వచ్చేసరికి ఇంచుమించు ఒక పక్షంరోజులు పట్టవచ్చు. తిరిగి వచ్చేటప్పు డాయన తొందర తొందరగా ఓరుగల్లు వెళ్ళిపోవచ్చు! ఇప్పుడు కాని దర్శనం ఇక ఎప్పుడో అవుతుందనే నమ్మకంమాత్రం ఏమి ఉంది!

అతనికి విశ్వేశ్వరాగ్రహార ప్రాంతం అంతా కొత్త. అక్కడి వారి నెవరినీ ఎరగడు. ఇక ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు. ఒక మారు బేతాళనాయణ్ణి సందర్శించి ఆయనతో తనకు జరిగిన అన్యాయం అంతా పూసగుచ్చినట్టు చెప్పి తిరిగి న్యాయం జరిగించవలిసిందని కోరాలని సంకల్పించాడు. బేతాళనాయని దర్శనమైనా దొరుకుతుందో దొరకదో! అయినా అధైర్యపడక శిష్యుడు భీమేశ్వరశర్మను పిలిచి ఆ విషయం మెలుకువగా తెలుసుకు రావలసిందని పంపించాడు. అతడు తిరిగి వచ్చేవరకు అర్ధరాత్రిదాకా అలాగే మేలుకుని కూర్చున్నాడు.

అర్ధరాత్రివేళ భీమేశ్వరశర్మ తిరిగి వచ్చాడు. అత డింకా సమీపానికి రాకుండానే విద్యానాథు డతణ్ణి ప్రశ్నించాడు:

“ఏమిటి బాబూ! ఏం జరిగింది?”

“జరగడానికేముంది? బేతాళ నాయునింగారు పష్టి గడియలూ మహారాజ సన్నిధినే ఉండిపోతున్నారట! రాజదర్శనమైనా దొరకవచ్చునుగాని బేతాళనాయనింగారి దర్శనం దొరకదంటున్నారు.”

“అంతేనా?”

“అంతేనండి!”

“ఆ కరణం ఏమంటున్నాడోయ్?”

“సోమయామాత్యుని మాటేనా మీరనేది? తన అనుమతిలేనిదే బేతాళనాయనిం గారి దర్శనానికికూడా ఎవ్వరినీ పోనివ్వడంలేదు! ప్రత్యేకంగా అత డలా మనమీద కక్షకట్టినపు డిక మనమేం చెయ్యగలం?”

“ఒరే, అబ్బాయీ! అనవసరంగా బెంకేలుపడి దిగులుపడిపోకు! ఇంతదూరం వచ్చి వట్టి చేతులతో తిరిగిపోతామా?”

“మీ రేడైనా సాహసానికి దిగితేమాత్రం వ్యవహారం ప్రతిఖించి రాగాన పడుతుంది. కొంచెం జాగ్రత్తగా ఆలోచించండి!”

“సరేగాని, ఆ స్కంధావారం ఇక్కడి కెంత దూరం?”

“ఎంతో నా? కూతవేటుదూరం కంటె ఎక్కువ ఉండదు.”

“గుడారానికి చుట్టూ పహరావాళ్ళున్నారా?”

“ఏదో ఉన్నా రక్కడక్కడ.”

“ద్వారంలోనో!”

“చాలామందే ఉన్నారు” అని భీమేశ్వర శర్మ నెమ్మదిగా ఆవలించి ఒక చిటిక వేశాడు.

“పాపం! నీకు నిద్ర వస్తూందిలా ఉంది. పోయి పడుకో!”

‘మీ రొక్కరూ అలా ఏకాకిగా కూర్చుని మథన పడుతూంటే నాకు మాత్రం కునుకు పడుతుందా!” అన్నాడు [illegible]ర శర్మ.

“కాదు! కాదు! నేనూ, నువ్వూ మళ్ళీ బాగా తెల్లవారు జామునే లేవాలి. వెళ్ళి పడుకో!”

విద్యానాథు డలా ఎందుకన్నాడో భీమేశ్వర శర్మకు తెలియలేదు. అడగడానికి [illegible]ం చాలక, అడగకుండా వెళ్ళిపోవడానికి కాళ్ళురాక అలాగే నిలబడిపోయాడు.

“ఇదిగో! నేను వస్తున్నానులే! నువ్వు పోయి పడుకో!”

విద్యానాథు డతనిని పంపించి వేశాడు. అలాగే కూర్చుని ఏదో తీవ్రాలోచనలో పడ్డాడు. కొంత సేపటి కతని కేదో స్ఫురించింది. ఆ స్ఫురణలో అతని పెదవిపై మల్లెపువ్వంత చిరునవ్వొక్కమారుగా తళుక్కుమని మెరిసింది!

విశ్వేశ్వరాగ్రహారం అంతా గాఢనిద్రలో మాటు మణిగింది. కార్తీకమాసం పొగమంచు అగ్రహారం మీద తెల్లని వెన్నెలలో పరుచుకుంది. కాని అప్పుడే చంద్రాస్తమయం అయింది. క్రమ

క్రమంగా చీకటి నాలుగు మూలలా ఆవరించుకుంది. మరి కొంతసేప టికి కొక్కొ్క్కరో! కో! అని కోడి కూత వినిపించింది.

ప్రతాపరుద్ర మహీపతి స్కంధావారంలోని వంది మాగధు లా సూచన విని మేలుకొలుపులు ప్రారంభించారు. వారి గొంతులతో ఇంకా మరికొన్ని 'కొక్కొ్కరోకో' సవ్వడులు బాగా శ్రుతికలిపాయి. అలా ఒక గడియ గడిచిపోగానే వందిమాగధుల కైవారాలాగిపోయాయి. కాని స్కంధావారంలో అక్కడక్కడ వేటకుక్కల అరుపులూ, పరి చారకు లటూ ఇటూ మసులుతున్న సందడీమాత్రం మందగించలేదు.

ప్రతాపరుద్ర మహారాజు మేలుకొని స్వయంభూదేవస్తుతి పఠిస్తూ నెమ్మదిగా నాలుగువైపులా పరికించి చూశాడు. శయ్యాగార ద్వారంలో పరిచారకులు దోసిళులొగ్గి నిలుచున్నారు. తిరిగి స్కంధావారం కొంత వరకు సద్దుమణిగింది.

అంతలోనే మేఘ గంభీర స్వరంతో ఒక శ్లోకం వినిపించింది. ఒకే గంభీరస్వరంతో వినిపించినా ఆ స్వరంలో రెండు గొంతు లేకీభ వించినట్లు స్ఫురించింది. మొట్టమొదట ప్రతాపరుద్రదేవుని కా శ్లోకం స్పష్టంగా వినిపించలేదు. కాని ఆశ్లోకం మళ్ళీ మళ్ళీ మారుమోగింది. దానితో అది సుస్పష్టంగా అతని శ్రుతి కుహరంలో ప్రతిధ్వనించింది.

"నవలక్ష ధనుర్ధరాధినాథే
పృథివీం శాసతి వీరరుద్రదేవే
అభవత్పర మగ్రహార పీడా—"

"నవలక్ష ధనుర్ధరులకు అధినాయకు లైనటువంటి వీరప్రతాపరుద్ర దేవ మహీపతి పృథివీ పరిపాలన చేస్తూఉండగానే, అగ్రహారాలకు వల్ల మాలిన పీడ కలిగింది."

ఇదీ ఆ శ్లోక తాత్పర్యం! ఆ శ్లోకం వినీవినగానే మహారాజు నిలువునా నీరయిపోయాడు! తన ధర్మపరిపాలనలోనే అగ్రహారపీడా? బ్రాహ్మణాగ్రహారాల కనేక మాన్యా లిచ్చి విద్వత్పోషకుడని బిరుదు వహించిన తన రాజ్యంలోనే అగ్రహారపీడా? ఇదేమిటి దురన్యాయం?

మహారాజెంతో విచారించాడు. తన దండనాయకులవల్లనో, లేక ఇంకా ఇతర అధికారులవల్లనో విశ్వేశ్వరాగ్రహారీకుల కెవరికో ఏదో అన్యాయం జరిగి ఉండవచ్చుననీ, అందువల్లనే వారెవరో ఆ విధంగా ఆక్రోశిస్తూ ఉండవచ్చుననీ అనుకొన్నాడు. వెంటనే నిలుచున్న పాటుగా బేతాళనాయనింగారిని పిలిపించవలసిందని ఆజ్ఞాపించాడు. బేతాళనాయ డక్కడికివచ్చి చేతులు జోడించి సవినయంగా చక్రవర్తి కట్టెదుట నిలబడ్డాడు. మహారాజు వెంటనే ఆ మొర విషయం విచారించవలసిందనీ, ఆ మొరపెట్టేవారిని తన ఎదుట నిలబెట్టవలసిందనీ ఆజ్ఞాపించాడు. సరిగా అదే సమయంలో మళ్ళీ ఆ ఆక్రోశం వినబడింది. వెంటనే బేతాళనాయకు డక్కడనించి నిష్క్రమించాడు.

మహారాజు తిరిగి కొంతసేపు విశ్రమించాడు. తెల్లవారేసరికి స్కంధావారంలో ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన కొలువుకూటంలో క్రమంగా బేతాళనాయకుడూ, అతని వెనక వెనక ఒదిగిపోతూ చేతులు కట్టుకుని నిలబడిన సోమయామాత్యుడూ ప్రవేశించారు. మరికొంత సేపటికి విద్యానాథుడు కూడా శిష్యుడు భీమేశ్వర శర్మను వెంటబెట్టుకుని అక్కడికి వచ్చాడు.

ప్రతాపరుద్రు డక్కడికి విచ్చేయడంతో అందరూ సవినయంగా తలలు వంచి ప్రత్యుత్థాన మర్యాదలు నడిపించారు. మహారాజు సుఖాసనం మీద కూర్చుండి కొంచెం విశ్రమించిన తరవాత బేతాళనాయకుడు సవినయంగా విజ్ఞప్తి చేశాడు :

''ఏలినవారి కీవిధంగా మనస్తాపం కలిగించినవార మైనామే అని మేమంతా చాలా నొచ్చుకుంటున్నాము. ఇంతకీ ఏమి జరిగిందంటే త్రిలింగదేశం అంతటా పేరుమోసిన విద్యానాథ విద్వాంసులు తమ దర్శనార్థమై విచ్చేసినప్పుడు మన అగ్రహారం కరణం సోమయామాత్యులు వారి విద్వత్తు ఎంతటిదో తెలుసుకోలేక కొంచెం కించపరిచారట. కావడాని కది గొప్ప విద్వదపచారమే! అయితే కవిలె కట్టలు కట్టుకునే కరణాలకు విద్వత్తుగొడవ లేం తెలుస్తాయి? తమరికి శ్రమ కలిగించవలసి వస్తుందనే భయంచేతనే అమాత్యులా విధంగా చేశారట! అపరాధం మన్నించవలసిందని వారు విన్నవించుకొంటున్నారు.'' అని బేతాళ

నాయకుడు సోమయామాత్యుణ్ని సమర్థించీసమర్థించనట్లుగా సమర్థించాడు.

మహారాజు దృష్టి అలవోకగా ఒకమారు సోమయామాత్యునివైపు తిరిగింది. అమాత్యుడు తలవంచుకున్నాడు.

“మహాప్రభూ! విద్యానాథుల విద్వత్తెంతటిదో తెలియక నేను వారి యెడల అపచారం చేసినమాట నిజమే! అయితే వినోద సమయంలో తమ కనవసరంగా శ్రమ కలుగుతుందనే సంకోచంవల్లనే నేనలా వ్యవహరించాను.”

విద్యానాథుడిదంతా ఒక కంట కనిపెట్టి చూస్తూనే ఉన్నాడు. బేతాళ నాయకుడు నిందంతా నెమ్మదిగా తనమీద తోసివేస్తున్నాడని ఆకళించుకొన్నాడు. ప్రతాపరుద్రుని వైపు తిరిగి ఏదో విన్నవించబోయాడు. అది కనిపెట్టి బేతాళ నాయకుడడ్డుపడ్డాడు :

“మన సోమయామాత్యులేదో తెలియక తప్పు చేశారనే అనుకుందాము. అయితే విద్యానాథ విద్వాంసులంతటివారు తొందరపడి తమ ధర్మపరిపాలన కంతటికీ కళంకం ఆపాదిస్తూ ఆ విధంగా, విద్వల్లోకంలో శాశ్వతంగా నిలిచిపోయే శ్లోకం రచించడం మాత్రం భావ్యం కాదేమో అనిపించింది. ఆ పైన తమ చిత్తం!”

అతి వినయంగా చేతులు కట్టుకుని బేతాళ నాయకుడు నిలబడ్డాడు. దానితో విద్యానాథుని కిక నోరు తిరగలేదు. సోమయామాత్యుడు, బేతాళ నాయడు కలిసి చివరి కిదంతా తన మీదికి తీసుకవచ్చారని గ్రహించుకొన్నాడు. దర్శనం ఇప్పించకపోవడం అపరాధమే అని వారంతట వారే అంగీకరించినప్పుడిక ప్రత్యేకంగా వారిని నిందించవలసింది ఏమి ఉంది? ఒక్క నిమిషం ఆలోచించి అతి గుంభనగా ఒక చిరునవ్వు నవ్వాడు :

“మహాప్రభూ! ఎంత శ్రమపడినా తమ దర్శనం కాలేదే అనే కించకొద్దీ తెల్లవారుజామున నేనూ, నా శిష్యుడూ కలిసి ఆ శ్లోకం అంత గంభీరంగా పఠించాము. అయితే అదంతా అసంపూర్తి శ్లోకమే! శ్లోకం అంతా పూర్తిగా చదివితే దానిలో తమ కీర్తిప్రశంసే గాని

అపకీర్తి ప్రస్తావన ఆవంతయినా లేదు! బేతాళనాయనింగారనవసరంగా నా మీద నింద మోపుతున్నారు! అంతే!"

"అయితే ఆ శ్లోకంలో అగ్రహార పీడ ప్రస్తావనే లేదా?"

అన్నాడు మహారాజెంతో ఆశ్చర్యపడి.

"ఇదిగో! ఆ శ్లోకం అంతా చదువుతున్నాను. ఆలకించండి!"

అని విద్యానాథుడా శ్లోకం అంతా పూర్తిగా చదివాడు:

"నవలత్సు ధనుర్ధరాధినాథే
పృథివీం శాసతి వీరరుద్రదేవే,
అభవత్పర మగ్రహార పీడా
కుచకుంభేషు కురంగలోచనానామ్"

ఆఖరి పాదం చేర్చి చదవడంతో ఆ శ్లోకం అర్థం అంతా తారుమారై పోయింది.

"వీరప్రతాపరుద్ర మహీపతి పృథివి పరిపాలిస్తూండగా కురంగ లోచనలైన అంగనల కుచకుంభములమీది అగ్ర - హారాలకు—అంటే ముందున్న ముత్యాల హారాలకు పీడనం కలిగింది."

అని మాత్రమే అర్థం వచ్చింది. ఆ చమత్కారం గ్రహించిన మహారాజు విద్యానాథుని కవితాశక్తి కానందించి అతన్ని అనేక విధాల ప్రశంసించాడు. చివరికి బేతాళనాయనికీ, సోమయామాత్యునికీ కూడా ఆ కొత్త అర్థం బాగున్నదనక తప్పలేదు. ఇక చేసేదేమీ లేక వారు కూడా విద్యానాథుని పాండిత్యప్రశంస ప్రారంభించారు. మహారాజు విద్యానాథున కింకా ఎన్నో బహూకృతు లందించాడు! "విద్యానాథ విద్వాంసులకు విశ్వేశ్వరాగ్రహారంలో సస్యశ్యామలమైన పది పుట్ల సుక్షేత్ర ఖండిక సర్వాకర పరిహారంగా ధారాదత్తం చెయ్యవలెనని నిశ్చయించాము." అని బేతాళనాయకునివైపు చూచాడు. నాయడు సోమయామాత్యునివైపు చూచాడు. సోమయామాత్యుడు తడుముకోకుండా వెంటనే సమాధానం చెప్పాడు:

"మహాప్రభూ! అగ్రహారంలో మన తటాకోత్తర భాగంలో ఉండుకున్న పది పుట్లభూమి సాక్షాత్తూ బంగారంపండే సుక్షేత్రఖండిక!" అన్నాడు.

"అయితే రేపుదయం అదే వారికి ధారాదత్తం చేస్తున్నాము."

అని మహారాజు విద్యానాథుని కెంతో ఆదరంగా వీడ్కోలిచ్చి పంపివేశాడు. ఆ సమయంలో బేతాళనాయడూ, సోమయామాత్యుడూ ఒకరి మొహాలొకరు చూచుకుని చిరునవ్వులు నవ్వుకున్నారు. ఆ మరునాటి ఉదయమే ప్రతాపరుద్రుడు విద్యానాథుని కా భూమి అంతా ధారాదత్తంచేసి వేటబలగంతోసహా గోదావరిదాటి వెళ్లిపోయాడు.

# 4

మహారాజు చేసిన ఆ అఖండ సత్కారానికి విద్యానాథుడెంతో ఆనందించాడు. "త్రిలింగ ప్రభువుల విద్యాదరణ ఈ నాటిదా?" అని కాకతీయ మహారాజుల వదాన్యత ఆకాశానికే ఎత్తివేశాడు.

మహారాజు గోదావరిదాటి వెళ్ళిపోయిన మరునాడు తనకు ధారాదత్తంచేసిన సుక్షేత్రఖండిక అంతా ఒక్కమారు కళ్ళారా చూచుకోవాలని ఉబలాటపడ్డాడు. శిష్యుడు భీమేశ్వర శర్మతో కలిసి అక్కడికి వెళ్ళాడు.

అది ఆకాశమంత చెరువు. అప్పుడప్పుడే వికసించిన తామర పూవులతో కలకలలాడుతూ వేయి చేతులతో ఆహ్వానిస్తున్నట్లు కనిపించింది.

విద్యానాథుడు ఎంతో సంతోషంతో చెరువుగట్టెక్కి దానికి ఉత్తరదిక్కుగా ఉన్న తన భూభాగం అంతా జాగ్రత్తగా పరిశీలించాడు. ఆ ప్రదేశం అంతా చూడగానే అతని నవనాడులూ కుంగిపోయాయి! అతని కెదురుగా కనిపించిన పదిపుట్లభూమి చాలావరకు ఒట్టి చవిటిపఱ్ఱ!

అది చూడగానే అతనికి సోమయామాత్యుడు చేసిన ద్రోహం అంతా కళ్ళకు కట్టినట్టెదురుగా ప్రత్యక్షమైంది! ఎక్కడో రెండు

మూడెకరాలలో మాత్రం కొంచెం మెట్టవ్యవసాయం సాగుతూంది. అంతే! మళ్ళీ దక్షిణంగా తిరిగిచూచాడు.

తటాకానికి దక్షిణదిశగా కనిపించిన పదిపుట్లభూమి నిజంగా బంగారు పండే సుక్షేత్రఖండికే! ఆ భూమి చూడగానే విద్యానాథుని కళ్ళల్లో వేడి కన్నీరంతా ఆవిరిగా మారిపోయింది.

"సోమయామాత్యుడు నా కొంప నిలువునా తవ్వేశాడు! అలాంటి గోముఖవ్యాఘ్రంతో పెట్టుకున్న బలవద్విరోధంవల్లే నాకింతటి దురతి పట్టింది."

అలా కుమిలిపోతున్న విద్యానాథుని కిక [illegible] డలేదు. అయినా భీమేశ్వర శర్మను వెంటబెట్టుకుని సోమయామాత్యుని దగ్గిరికి వెళ్ళిపోయాడు. అమాత్యుడతని నెంతో ఆప్యాయంగా గౌరవించాడు. ఎక్కడా చెక్కు చెదర లేదు!

"మీవంటి మహా విద్వాంసులకు మే మేమని మనవి చెయ్యగలం! ఇదిగో మహారాజానుమతితో బేతాళనాయనింగారు స్వయంగా చెక్కించిన తామ్రశాసనం! చిత్తగించండి! దీనిలో తటాకోత్తర ఖండంలో ఉండుకున్న పది పుట్ల భూమి మీకు ధారాదత్తం చేసినట్లుంది. ఇది స్వయంగా మహారాజే వేయించిన తామ్రశాసనం! దీనిలో మా ప్రమేయం ఏమి ఉంది?"

ఆ మాటలతో విద్యానాథునికి తల కొట్టివేసినట్లయింది. కాని ఆ తామ్రశాసనం చూచిన క్షణంలో అతని కేదో స్ఫురించింది. వెంటనే భీమేశ్వరశర్మను వెంటబెట్టుకొని తటాకానికి దక్షిణంగా ఉన్న భూభాగంలోనికి వెళ్ళి అక్కడి పాలి కాపులతో ఆ భాగంలో పదిపుట్ల భూమి మహారాజు స్వయంగా తనకు ధారాదత్తం చేశారనీ, ఇక వారంతా తనకే పాలికాపులుగా వ్యవహరించాలనీ ఆజ్ఞాపించాడు.

వారంతా మహారాజు సత్కార కథ విన్నారు. అందుచేత వెంటనే సరేనని అంగీకరించారు. ఆ విషయం చల్లచల్లగా సోమయామాత్యుని చెవిలో పడింది.

అది వినీవినగానే అతడు విద్యానాథుని దగ్గిరికి వచ్చాడు. లేని దురహంకారం తెచ్చిపెట్టుకుని విద్యానాథుణ్ణి బెదిరించాడు:

“మీకు ధారాదత్తం చేసినది ఉత్తరఖండంగాని దక్షిణఖండం కానేకాదు! మీరు చేసింది కేవలం దురాక్రమణం! వెంటనే అక్కడి నించి తొలగకపోతే ఈ వ్యవహారం యాకత్తూ మళ్ళీ మహారాజులుంగారి దాకా వెళ్ళిపోతుంది, జాగ్ర

విద్యానాథుడు మండిపడ్డాడు :

“నీ దిక్కున్నచోట చెప్పుకో! నేను చేసింది దురాక్రమణం కానేకాదు! నీవు చేసిన ద్రోహానికి సరిగా తగినశాస్తి. తెలిసిందా?”

“ఏమయ్యోయ్! నా మాట విను! ఇది ధర్మంకాదు. అనవసరంగా ఆపద పాలైపోతావు సుమా!”

“పో పో! ఇంతా చేసి ఇంకా ధర్మపన్నా లేకరువు పెడుతున్నావా?”

అని విద్యానాథు డతన్ని కసిరికొట్టేశాడు. సోమయామాత్యునికి కావలసింది అదే! వెంటనే ఆ వ్యవహారం అంతా మహారాజు వెంటనున్న బేతాళనాయని వరకూ వెళ్ళిపోయింది. నాయుడది చల్లగా మహారాజు చెవిలో వేశాడు.

## 5

విశ్వేశ్వరాగ్రహారం అంతా విద్యానాథునికీ సోమయామాత్యునికీ మధ్య చెలరేగిన వివాదంతో అట్టుడికిపోయిన ట్టుడికిపోయింది. అగ్రహారంలోనివారంతా ఏకగ్రీవంగా విద్యానాథునిదే తప్పన్నారు. అమాత్యునికీ తనకూ పడకపోతే ఆ పగ మరొకవిధంగా సాధించుకోవాలి గాని అలా దురాక్రమణం చెయ్యడం చాలా తప్పని ఖండించారు.

ప్రతాపరుద్ర మహారాజు మృగయా వినోదం ముగించుకొని తిరిగి వస్తూ మళ్ళీ విశ్వేశ్వరాగ్రహారంలో విడిది చేశాడు. ప్రత్యేకంగా విద్యానాథ సోమయామాత్యుల వివాదం పరిష్కరించడానికని అక్కడ తన ఉనికి ఇంకొక్కరోజెక్కువ పొడిగించాడు.

స్కంధావారంలోనూ, ఆ పరిసరాలలోనూ అగ్రహారీకులంతా కిటకిటలాడిపోయారు. వివాదపరిశీలన ప్రారంభానికి ముందుగా బేతాళ

నాయడు సవినయంగా లేచి నిలబడి వ్యవహారం సంగ్రహంగా వివరించాడు.

"మహారాజా! తమరు విద్యానాథ విద్వాంసుల కిప్పించిన భూభాగం విషయంలో పెద్ద వివాదం బయలుదేరింది. తాము దయ చేయించిన తామ్రశాసనంలో తటాకోత్తర భూభాగం అని స్పష్టంగా ఉల్లేఖింపబడి ఉంది. అయితే విద్యానాథులు దానికి వ్యతిరేకంగా తటాకానికి దక్షిణ భూభాగంలో పదిపుట్ల భూమి ఆక్రమించుకొన్నారు. 'తటాకోత్తర ఖండ' మని స్వయంగా తమరు వాచాకూడా సెలవిచ్చారు. కాని చివరికి జరిగినదిది. ఆ పైన తమ చిత్తం."

మహారాజు దృష్టి విద్యానాథునివైపు తిరిగింది. విద్యానాథుడు విన్నవించుకొన్నాడు: "నేను అక్షరాలా తమరు దయచేయించిన తామ్ర శాసనం ప్రకారమే నడుచుకొన్నాను. దీనిలో నేను చేసిన దురాక్రమణం ఏమీ లేదు!"

దానిమీద బేతాళనాయుడ డడిగాడు:

"తాము దక్షిణభాగం ఆక్రమించుకొన్నమాట నిజమే కదా?"

"అవును! నిజమే!"

"అయితే 'తటాకోత్తర భూభాగం' అంటే 'దక్షిణ భాగం' ఎలా అవుతుంది?"

విద్యానాథు డొక్క నవ్వు నవ్వాడు:

"తటాకం ఉత్తరంగా కలిగిన భూభాగం అంటే దక్షిణ భాగం కాదా? నా మాటమీద నమ్మక లేకపోతే విద్వాంసుల నెవరినైనా అడిగి చూడండి!"

ఆ సమాధానంతో స్కంధావారంలో అంతటా ప్రశంసలూ, సాధువాదాలూ చెలరేగాయి. సోమయామాత్యుడు షష్ఠీతత్పురుష సమాసం ప్రకారం తటాకమునకు 'ఉత్తరమైన' అని అర్థం చేసుకున్నాడు. అయితే దానికి విద్యానాథుడు 'తటాకము ఉత్తరంగా కలిగిన' అని బహుబ్రీహి సమాసం ప్రకారం అర్థం చెప్పాడు. ఆ అర్థంతో ఉత్తర దక్షిణాలు తారుమారై ఉత్తరం దక్షిణంగా మారిపోయింది! ఆ

అర్థం కాదనడాని కిక ఎవరికి గుండెలున్నాయి? ఆ నిర్వచనం వినగానే సోమయామాత్యుని గుండె దిగజారిపోయింది. ముచ్చెమటలు పోశాయి. మహారాజు విద్యానాథుని వాక్చమత్కృతికీ, చాకచక్యానికీ ఎంతో ఆనందించాడు :

"అయితే తామది 'బహుమ్రీహి' చేశారన్నమాట! అంతేనా?"

అని ఎంతో ఆప్యాయంగా అడిగాడు.

"తమవంటివారు నావంటి వాడికి బహూకరించిన భూ భాగం 'బహుమ్రీహి' కాక 'అల్పమ్రీహి' అవుతుందా? తాము నాకు సస్య శ్యామలమైన సుక్షేత్ర ఖండిక బహూకరించాలని సంకల్పించారు. సోమయామాత్యులు వట్టి చవిటి నేల ఇప్పించాలని ప్రయత్నించారు. కాని తమ సత్సంకల్పం ప్రకారం తామిచ్చిన నేల 'బహువ్రీహి' అయింది గాని 'అల్పవ్రీహి' కాలేదు."

'వ్రీహి' అంటే ధాన్యమని అర్థం. బహు వ్రీహి అంటే బాగా ధాన్యం పండే నేల అనికూడా అర్థం చెప్పవచ్చును. ఆ పదంమీద విద్యానాథుని వ్యాఖ్యానం వినగానే మహారాజూ, సభాస్తారులూ మళ్ళీ మహాశ్చర్యంతో నిశ్చేష్టులైపోయారు.

కాని సోమయామాత్యుడూ, బేతాళనాయడూ వంచిన తలలిక పైకెత్తలేకపోయారు.

"విద్యానాథ విద్వాంసులీక్షణం నుంచీ మా త్రిలింగ సామ్రాజ్యాస్థాన విద్యాధికారులు!" అన్నాడు ప్రతాపరుద్రమహీపతి!

ఉత్తర క్షణంలోనే విద్యానాథుడు ముక్తకంఠంతో తన ప్రశస్తి శ్లోకం మళ్ళీ ఉచ్చైస్స్వనంతో పఠించాడు :

"నవ లక్ష ధను ర్ధరాధినాథే
పృథివీం శాసతి వీర రుద్రదేవే,
అభవ త్పర మగ్రహార పీడా
కుచకుంభేషు కురంగ లోచనానామ్"

వెంటనే స్కంధావారంలో అంతటా ప్రశంసాపరంపర లొక్కుమారుగా మిన్నందుకొన్నాయి!

---

# చంద్రముఖి

## 1

ప్రపంచసృష్టి ప్రారంభకాలంలో ప్రప్రథమ మానవుడు - మనస్వి - ఆ నాటి భూలోక సౌందర్యం చూచి విభ్రాంతుడై ముగ్ధుడైనాడు. ప్రపంచంలో ప్రతి స్వల్పవిషయమూ అతని కత్యాశ్చర్యకరంగా భాసించింది. ఆకాశంలో పక్షులు బారులు తీరి ఎగిరిపోతూంటే అత డెంతో వింతగా వాటివైపే చూస్తూ ఉండేవాడు. కొండకాలవలు క్రేళ్లురుకుతూ ప్రవహిస్తూంటే వాటితో కలిసి పరుగులు పెట్టేవాడు. నెమళ్ళు గుంపులు గుంపులుగా పురివిప్పి ఆడుతూంటే వాటితో కలిసి నృత్యం చేసేవాడు.

అడివిలో చెట్లకింద ఒత్తుగా రాలిపడిన తియ్యతియ్యని పళ్ళు తిని, కొండకాలవలో ప్రవహించే చల్లచల్లని నీళ్ళు తాగి, పర్వతగుహలలో హాయిగా పడుకుని నిద్రపోయే మనస్వి మహారణ్యజీవితం కొంతకాలంపాటులోటూ లేకుండా సుఖంగా సాగిపోయింది.

మరికొంతకాలానికి మనస్వికి తనవంటి మానవు లా అరణ్యంలో ఇంకా ఎవరైనా ఉన్నారా అన్న జిజ్ఞాస బయలుదేరింది. అత డా అరణ్యంలో గుహాలు, చెట్లు, పుట్టలు అన్నీ గాలించి చూశాడు. ఎక్కడా ఇంకొక మానవుని జాడే పొడగట్టలేదు. మనస్వి మనస్సులో క్రమంగా

ఒంటరితనము, నిస్పృహా, దిగులు ప్రారంభమయినాయి. ఒక మృగం లాంటి మృగాలా అరణ్యంలో కోకొల్లలుగా కనిపించాయి. కాని తనవంటి మానవు డెక్కడా మనస్వికి ప్రత్యక్షం కాలేదు. అయినా మనస్వి తన పట్టు విడిచిపెట్టలేదు.

ఆ మహారణ్యంలో దుర్గమమైన ప్రదేశాలన్నీ గాలించివేశాడు. ఒక గుహాగర్భంలో అతనికి రెండు నక్షత్రాలు భూమిమీదే మెరుస్తున్నట్లు కనిపించాయి. ఆ తారకాకాంతి చూడగానే అతని కెంతో ఆశ్చర్యం కలిగింది. వెంటనే ఆ ప్రదేశానికి చేరుకున్నాడు.

అక్కడ కూర్చున్నవాడు మనస్వివంటి మానవుడే! అతని కళ్లే చుక్కల్లా మెరిశాయి. కాని అతడు చాలా వృద్ధుడై పోయినట్లు కనిపించాడు. ఆ ముదుసలి అతన్ని చూస్తూనే లేచివచ్చి ఎంతో ఆప్యాయంగా ఆదరించాడు. మొట్టమొదటగా వారిద్దరిమధ్యా సంజ్ఞాధ్వని రూపంలో ఆవిర్భవించిన అన్యోన్యత క్రమక్రమంగా అత్యాశ్చర్యకరమైన మానవభాషగా అవతరించింది.

కొన్నాళ్ళకు వారిద్దరిమధ్యా అపూర్వమైన అన్యోన్యత ఏర్పడింది. ఆ వృద్ధుడతనికి తన నామధేయం 'సవిత' అని మాత్రమే తెలియజేశాడు. అంతేగాని మిగిలిన తన పుట్టుపూర్వోత్తరా లేవీ తెలియజేయలేదు. సవిత మనస్విని పుత్రవాత్సల్యంతో ఆదరించేవాడు. మనస్వికి కూడా సవితపై పితృగౌరవం కలిగింది. ఆ నూతన బాంధవ్యంతో వారిద్దరూ మరికొంతకాలంపాటు చీకూ, చింతా లేకుండా సుఖంగా కాలం వెళ్ళబుచ్చుకొన్నారు.

మరికొంతకాలానికి ఆ మహారణ్యంలో వర్షాకాలం ప్రారంభమైంది. మనస్వి హృదయంలో మళ్ళీ విచిత్రమైన ఆవేదన బయలుదేరింది. నెమళ్ళు జంటలు జంటలుగా పురివిప్పి ఆడుతూంటే అతనికి కూడా ఆడనెమలి వంటి 'మనిషి'తో కలిసి ఆ అరణ్యంలో హాయిగా నృత్యం చేస్తూ సంచరించాలని బుద్ధిపుట్టింది. అప్పటినించీ అతనిలోని ఆవేదన మరింత తీవ్రంగా విజృంభించింది. మొట్టమొదటగా ఆ రాత్రే అతనికి నిదరపట్టక పోవడం అంటే ఏమిటో తెలిసివచ్చింది. క్రమక్రమంగా

ఆహారంమీద కూడా అరుచి బయలుదేరింది. సవిత ఒకనాటి ఉదయం అతని అస్వాస్థ్యానికి కారణ మేమని అడిగాడు.

"ఏమో మరి! రోజు రోజూ నాలో ఏదో పెద్ద అఖాతం ఏర్పడి పోతున్నట్లుంది."

సవిత కొంచెం ఆలోచించి మళ్ళీ అడిగాడు: "ఎందుచేత?"

"ఏమో!"

ఇంకా బాగా దిగాలు పడిపోయాడు మనస్వి. ఆనాటి సాయం కాలంవరకూ మరి ఆహార పానీయా లేవీ ముట్టలేదు. అలాగే దిగాలుపడి మతిపోయినట్లయి హాయిగా పురివిప్పి ఆడుకునే నెమళ్ళ జంటలకేసి చూస్తూ కూర్చున్నాడు.

అంతలో సూర్యాస్తమయం అయింది. సెలయేళ్ళలో కొండ మల్లెపూవులూ, నక్షత్రాలూ కలిసి మెలిసి ప్రవహించాయి. ఆకాశంలో మబ్బులపై మెరుపులు పురివిప్పి ఆడే నెమళ్ళలా నృత్యంచేశాయి.

చిటపటమని చిన్న చిన్న చినుకులు పడ్డాయి. మనస్వి చెక్కిళ్ళపై కన్నీటి బిందువులు నెమ్మది నెమ్మదిగా దిగజారాయి. సవిత హృదయంలో మనస్విని గురించిన ఆందోళన, కరుణ కొండకాలవలై ప్రవహించాయి. అతడు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ మనస్వి దగ్గిరికి వచ్చి అతని వీపు తట్టాడు. మబ్బుల తెరలు చీల్చుకుని సన్నని పిల్లకాలవలా ప్రవహించిన వెన్నెలరేక మనస్వి పాదాలదాకా పాకి వచ్చింది. ఊరు మెుకటి మంద మందంగా మహారణ్యంలోని కొండ చరియలలో మారుమోగింది. తటాలున మెరుపు మెరిసింది. క్షణ కాలం అది మనస్వి కళ్ళకు మిరుమిట్లు గొలిపింది. దానితో అతని ముఖం కొంచెం వికసించింది. సవిత ఆ అదను కనిపెట్టి అతని నోదార్చాడు:

"మనస్వీ! ఎందు కంతగా అధైర్యపడిపోతావు! అదిగో నీ కదురుగా ఒక చక్కని చుక్క నిలబడింది చూడు!"

అని వేలెత్తి వారి కనతిదూరంలో నిలబడిన ఒక సుందరీమూర్తిని చూపించాడు. మొట్టమొదట మనస్వి ఆకాశంలో తళతళా మెరిసి

పోయే ఒక చక్కని చుక్కే తన కెదురుగా వచ్చి నిలబడిందని అనుకొన్నాడు. ఆ మూర్తి చక్కని 'చుక్క' కాదు. చుక్కవంటి ఒక మనోహర మానవమూర్తి !

—

అటువంటి మనోజ్ఞ మానవమూర్తిని మనస్వి అంతవరకెన్నడు చూచి ఉండలేదు. అందుచేత ఇంచుమించుగా ఒక అరగడియవరకు అలాగే విస్తుపోయి ఆమెవైపే చూస్తూ కూర్చుండిపోయాడు.

ఆమె ముఖం పున్నమినాటి చంద్రబింబం అచ్చంగా భూమిమీదికి దిగివచ్చినట్లే కనిపించింది. తెళ్ళ కళ్లే ఆమెకళ్ళుగా మారిపోయాయనిపించాయి. ఆమె చూపులు కొండ కాలవలలో తళతళలాడే చిన్న చిన్న మీనుల్లా మెరిసి పోయాయి. చల్లచల్లని పిల్ల గాలికి చలించిపోయే కొండమల్లెతీగే ఆమె శరీరమై తన కెదురుగా నిలిచిందని మనస్వి నిశ్చయించుకొన్నాడు. మొట్టమొదటి చూపులో అతడు నెమలి పింఛమే ఆమె తన శిరస్సుపై అలంకరించుకొన్నదని భ్రమించాడు. కాని అది నిజంకాదనీ, అది ఆమె తలకట్టేననీ ఆ తరవాత నిర్ణయించుకొన్నాడు. ఒక్క విషయం మాత్రం అతనికి విస్పష్టంగా అవగాహన కాలేదు. ఆమె బాగా పరిపక్వమైన చూతఫలాలు రెండు ఎంతో జాగ్రత్తగా హృదయం దగ్గర దాచుకొన్నదని అతని అనుమానం! ఎంత సేపటికీ అతనికా అనుమానం తీరలేదు! అసలా వ్యక్తి ఎవ్వరోకూడా అతనికి తెలియలేదు! సవిత అతనితో అప్పుడప్పుడు దేవతామూర్తులనుగురించి ప్రసంగించేవాడు. మొట్టమొదట ఆమె అలాంటి దేవతామూర్తే కావచ్చునని అనుకొన్నాడు. కాని మనస్సులో సంశయం ఇంకా అలాగే పట్టుకుని పీడించింది. తొందర తొందరగా సవిత సన్నిధికి వెళ్ళి అతని చెవిలో ఊదాడు :

"ఈ సుందరవ్యక్తి ఎవ్వరు? ఎవరైనా దేవతా?"

"కాదు!"

"రాక్షసుడా?"

"కాదు!"

"మరి?"

"మనుష్య స్త్రీ!"

"అంటే!"

"ఆడు నెమలిని, మగ నెమలిని చూచావు కదా? మగ నెమలికి ఆడ నెమలి ఎలాగో నీ కామె అలాంటి దన్నమాట!"

మనస్వి మరింతగా విస్తుపోయాడు:

"ఇలాంటి వ్యక్తిని నే నెన్నడూ చూడలేదే! ఎంతటి అత్యద్భుత సుందర వ్యక్తి!"

"ఆమె సృష్టి అత్యాశ్చర్యకరం! ప్రపంచంలో అందమైన వస్తువులన్నీ తమ అందం ఆమె కిచ్చాయి. అంతేకాదు. ప్రపంచంలో పరమాద్భుతాలన్నీ ఆమెలో మూర్తీభవించాయి! ఇకనించీ ఆమె నీకు సహధర్మచారిణి!"

ఆమాట మనస్వి కేమీ బోధపడలేదు. వెంటనే అడిగాడు:

"అంటే?"

సవిత అతని కా మాట అర్థం కొంతవరకు వివరించి చెప్పాడు:

"ఇకనించీ ఆమె నీతో కలిసి మెలిసి తిరుగుతూ తోడునీడలా సంచరిస్తుంది. ఈ క్షణంనించీ నీలోని ఒంటరితనం అంతా పటాపంచలై పోతుంది. ఇకనించీ మీరిద్దరూ సింహాల జంటలలాగ ఈ అరణ్యం అంతా ఏలుకుంటూ, పావురాల జంటల్లాగ కలిసిమెలిసి సంచరించండి! నెమళ్ళ జంటల్లా కలిసి మెలిసి వినోదించండి! వెళ్ళు నాయనా! వెళ్ళు! ఆమెను నీ వెంట తోడుకుపో!"

ఎంతో వాత్సల్యంతో అతని కుపదేశించాడు.

ఆ క్షణంలో మనస్వి మనస్సులోని ఆవేదన అంతా తెల్లవారేవేళ చిమ్మచీకటిలా పటాపంచలయి పోయింది. అయినా, ఆమె నేమని పిలవాలో అతనికి తెలియలేదు.

"ఆమె పేరు?"

"చంద్రముఖి!"

అని, సవిత, నెమ్మదిగా లేచి తన నివాసానికి తిరిగి వెళ్ళిపోయాడు.

మనస్వి ఆకల్లాడకుండా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ చంద్రముఖిని సమీపించాడు! ఆమె శరీరంమీది పాముకుబుసంవంటి పట్టువస్త్రం చూడగానే అది పామేమోనని మొట్టమొదట అతనికి కొంచెం భయంవేసింది. ఆమెకు ఇంకా సమీపంగా వెళ్ళి నిలబడగానే అతని భయం కాస్తా అంతరించిపోయింది. అలాగే ఆశ్చర్యంగా ఆమెవైపు చూస్తూ నిలబడ్డాడు. కొంత సేపటి కతని కా సౌందర్య మూర్తి పెదవులు ముద్దుపెట్టుకోవాలనీ, ఆమె పుట్టు పూర్వోత్తరాలన్నీ ఆప్యాయంగా అడిగి తెలుసుకోవాలనీ అనిపించింది.

మనస్వి సాయంకాల సూర్యకిరణాలలా మెరిసిపోయే చంద్రముఖి పెదవులు ముద్దు పెట్టుకోబోయాడు. తటాలున, ఆమె, ముఖం పక్కకి తిప్పివేసింది. అతడు తిరిగి ప్రయత్నించాడు. కాని ఈమారు కూడా అది సాధ్యపడనీయలేదు. ఆమెను తన కౌగిలిలో బంధిస్తే అది సాధ్య పడగలదని తోచింది. వెంటనే గాఢంగా కౌగిలించుకొన్నాడు. మరు క్షణంలోనే ఆమె అతని కౌగిలి పట్టు తప్పించుకొని చెంగున ఒక్క గంతువేసి లేడిపిల్లలా అరణ్యంలోకి పారిపోయింది!

## 3

అయినా మనస్వి ఆమె నంతటితో విడిచిపెట్టలేదు. ఎలాగైనా చేజిక్కించుకొని తీరాలని వెంటబడ్డాడు. చంద్రముఖి అతని కంద కుండా అతివేగంగా కొండలలోను, కోనలలోను పరుగులు పెట్టింది. మనస్వి తీవ్రవేగంతో పరుగులు పెట్టే లేళ్లు మొదలయిన మృగాల నెన్నిటినో వెంటదరిమి చేజిక్కించుకొన్నాడు. 'ఆమె పరు గొక లెక్కా!' అని అహంకరించాడు. మరింత వేగంగా ఆమె వెంటబడి పరిగెత్తాడు.

చూస్తూండగానే చంద్రముఖి ఒక మర్రిచెట్టు మాటున ఇట్టే అదృశ్యమైపోయింది. అతడా ప్రాంతం అంతా గాలించాడు. ఆమె ఎక్కడా కనబడలేదు. దిగాలుపడిపోయి, ఉసూరుమని నిట్టూర్చి

మర్రిచెట్టునీడలో కూలబడిపోయాడు! అంతలో చంద్రముఖి హఠాత్తుగా అతని కళ్ళు రెండూ మూసింది. ఆ తరవాత మరి అతని పట్టు తప్పించుకోలేకపోయింది!

ఆనాటినుంచీ వారిద్దరూ వెలుగునీడల్లా ఒకరొకరిని విడిచిపెట్టకుండా వెంటనంటి తిరిగేవారు.

క్రమంగా కొంతకాలం గడిచిపోయేసరికి వారిద్దరూ ఒక విడరాని జంటగా మారిపోయారు. మరికొంత కాలానికి మనస్వి మరి సవిత మాటే మరిచిపోయాడు. అతనికి చంద్రముఖే సమస్త ప్రపంచమూ అయికూర్చుంది. ఒకనాడతడామెను గుచ్చి కౌగలించుకొని చెక్కిలిముద్దు పెట్టుకుంటూ అడిగాడు:

"చంద్రముఖీ! నీతో చెలిమి చేసినప్పటినించీ నా జీవితం అంతా ఒక మహోత్సవంగా, ఒక మృగయావినోదంలా సాగిపోతూంది. నీ వెవరవు? ఇక్కడికెలా వచ్చావు?"

నెమ్మదిగా ఆమె పుట్టుపూర్వోత్తరాలన్నీ అడగటం మొదలు పెట్టాడు. చంద్రముఖి అతని ప్రశ్నలు విని పక్కుమని నవ్వింది:

"ముందు నీ మాట చెప్పు! ఎక్కడనించి వచ్చావు?"

"నే నెక్కడినించీ రాలేదు! చాలాకాలంనించి ఇక్కడే ఉంటున్నాను."

"నేనూ అంతే."

"అయితే నీవిక్కడ ఉన్న విషయం హఠాత్తుగా సవితకెలా తెలిసింది?"

"నేనే ఆయన్ని ఒక గుహలో కనుక్కొన్నాను! అంతేగాని ఆయువ నన్ను కనుక్కోలేదు!"

"నేను నిన్నూ, ఆయన్నీ ఒక్కమారే చూచాను. అంతే! అయినా హాయిగా అడవిలో పుట్టతేనె ఆరగించే వేళ ఈ అనవసర ప్రసంగాలన్నీ ఎందుకు? రా, పోదాం."

అని చంద్రముఖి అతని నింక మళ్ళీ మాట్లాడనీయకుండా వెంట తనవెంట తోడుకుపోయింది. మనస్వి మారుమాట చెప్పకుండా ఆమె వెనకాలేపడి అడివిలోకి వెళ్ళిపోయాడు. అప్పటినుంచి వారిద్దరు ప్రప్రథమంగా మానవలోకంలో అవతరించిన మనుష్యదంపతుల అమాయికానంద మాధుర్యం అంతా కొల్లగొన్నారు. వారిద్దరి చూచిన మృగపక్షి మిథునాలన్నీ ఆ జంట ఆనందానికి ప్రతిబింబాలుగా మారిపోయాయి. మొట్టమొదటగా మనస్వి ఆమె కౌగిలింతలోనే కలలు కనడం నేర్చుకొన్నాడు. అంతవరకూ అతనికి కల అంటే ఏమో తెలియనే తెలియదు! అలా కొన్ని నెలలు గడిచిపోయాయి.

ఆ అపూర్వానందం చవిచూచినకొద్దీ మనస్వికి ఆ ఆనందమాధుర్యం అంతా ఎప్పుడో ఒకప్పుడు కల కరిగిపోయినట్లు కరిగిపోతుందేమోనని భయంవేసింది. ఆ మాటే ఒకసారి ఆమెతో అన్నాడు. అది వింటూనే చంద్రముఖి రుసరుసలాడింది. "ఎప్పుడూ ఏవో లేనిపోనిమాటలతోనే కాలక్షేపం చేస్తావు. నీకేం! నేనడివిలోకి వెళ్ళి నీకు పుట్టతేనే, పళ్ళూ తీసుకురావాలి! నన్ను వెళ్ళనీ!"

అని, ఆపైని అతడు చెప్పేమాట తిన్నగా వినిపించుకోకుండా తుర్రుమని అక్కడినించి పరుగెత్తుకుపోయింది. ఆ నాటి రాత్రి గూళ్ళల్లో పక్షులన్నీ నిద్రపోయేదాకా ఆమె అతని దగ్గరికి తిరిగి రాలేదు. అనుక్షణమూ చంద్రముఖి రాకకోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూచిచూచి విసిగి వేసారిన మనస్వి ఆమెను చూస్తూనే మండిపడ్డాడు: "ఇంతరాత్రి దాకా ఏంజేసున్నావు? ఏ పెద్దపులి అయినా హఠాత్తుగా నిన్ను నోట బెట్టుకుపోతేఁ?"

"ఇన్నాళ్లనుంచీ నన్ను నీవే రక్షించావా? నాకేమీ భయం లేదులే!"

ఆ మాటతో మనస్విమనస్సు భగ్గున మండింది:

"నీకేం, నువ్విలాగే మాట్లాడతావు! ఏదైనా అపతు వస్తే మధ్యన యాతన అనుభవించేవాణ్ణి నేను! నీవు రేపటినించీ ఒక్కర్తెవు అడివిలోకి వెళ్ళడానికి వీల్లేదు! తెలిసిందా?"

మనస్వి ఆమెమీద గుడ్లెర్రజేశాడు. చంద్రముఖి మరింత మండి పడింది:

"నన్నాజ్ఞాపించడానికి నీ వెవరవు? నేను వెళ్ళితీరతాను! చూచుకో!"

"వెళ్ళడానికి వీల్లేదు! గుహదాటి ఎక్కడికైనా కదిలిచూడు! నిన్నేంజేస్తానో!"

అని మనస్వి ఆమెను మరింత గట్టిగా బెదిరించాడు. చంద్రముఖి అతని కేమాత్రమూ తీసిపోలేదు:

"అయితే నీ పుట్టతేనె, పళ్ళూ నీవే తెచ్చుకో! ఈ వేళనించీ నే నవి తీసుకురానేరాను! తెలిసిందా?"

ఆపైన అతనికేసి చూసి, పట్టరాని ఉడుకుబోతుతనంతో బుడిబుడి దీర్ఘాలు తియ్యడం మొదలుపెట్టింది. అలా కొంతసేపు బుడిబుడి దీర్ఘాలు తీసి రుసరుసలాడుతూ అక్కడినించి వెళ్ళిపోయింది.

మనస్వి కామె రాగాలు తియ్యడం మొదలుపెడితే మరి నోట మాట పెగలదు. అతడు పెద్ద పెద్ద ఆడపులుల నెన్నిటినో రెండు చెవులూ గట్టిగా పట్టుకుని క్షణంలో లొంగదీశాడు. కాని చంద్రముఖిని బాగా మచ్చిక చెయ్యడంమాత్రం అతనికి సాధ్యపడలేదు.

అప్పటినించీ వారిద్దరిమధ్యా కస్సు బుస్సు లెక్కువైపోయాయి. మనస్వి ఏదిచెప్పినా ఆమె దానికి అడ్డంగా సమాధానం చెబుతుంది. అతడు పుట్టతేనెకోసం బయలుదేరదామంటే ఆమె పళ్ళకోసం బయలు దేరదా మంటుంది. కొంచెం గట్టిగా కసిరితే రాగాలు మొదలు పెడు తుంది. వారిద్దరిమధ్యా బయలుదేరిన చిలిపి కజ్జాలు క్రమంగా చిలికి చిలికి గాలివానలుగా మారిపోయాయి. చివరికి మరి కొంతకాలానికి వారిద్దరిమధ్యా పచ్చగడ్డి వేసినా భగ్గుమని మండింది.

"సుఖంగా అడవిలో ఆకూ, అలమూ తిని తిరిగేవాడికి నాకీ వల్ల మాలిన గుదిబండ దాపురించిందే!"

అని తన దురదృష్టాని కెంతో విచారించాడు. ఎలాగయినా మరి ఆమె కంటికి కనబడకుండా తప్పించుకు తిరగాలని అనుకున్నాడు. కాని ఆ మరునా డెలాగైనా ఆమె నొకమారు చూడకపోతే అతని కంటి కిక కునుకే పట్టేది కాదు!

కాని ఆ మరునాడుదయమే అత డామె కంటికి కనిపించకుండా ఒక కీకారణ్యంలోకి వెళ్ళిపోయాడు.

"అమ్మయ్య! ఇక ఇప్పటినించీ నాకు చంద్రముఖి పీడ వదిలి పోయింది!"

అని ఎగిరి గంతేశాడు. కాని ఎక్కడినించి వచ్చిందో చంద్రముఖి వెనకాలే వచ్చి అతని మెడచుట్టు వాటేసింది:

"నన్ను తప్పించుకుని పారిపోదామని అనుకున్నావా? నీ వెక్కడికి వెళ్ళిందీ నేను కనిపెట్టలేననుకున్నావా? నే నిక్కడే పుట్టి పెరిగాను- నీ వెక్కడ ఉన్నదీ పట్టుకోలేననుకొన్నావా?"

అని కలకల నవ్వడం మొదలుపెట్టింది. మనస్వి ఆమె చాకచక్యాని కెంతైనా సంతోషించాడు. ఇద్దరూ కలిసి మళ్ళీ అడివిలో లేళ్ళజంటలా విహరించారు.

అంతలోనే చంద్రముఖి మళ్ళీ అతనితో చిలిపి కజ్జాలు మొదలు పెట్టింది. క్రమంగా అతన్ని పొద్దస్తమానమూ పుండు సలిపినట్లు సలపడం మొదలుపెట్టింది. దానితో మనస్వి హృదయంలోని సహనశక్తి అంతా నశించిపోయింది. ఆమె నెలాగయినా సరే వదిలించుకు తీరాలని ఒక దృఢ నిశ్చయానికి వచ్చివేశాడు.

## 4

ఆ క్షణంలోనే అతనికి సవిత సంగతి జ్ఞాపకము వచ్చింది. అతని నెలాగయినా ఆ అరణ్యమంతా గాలించి పట్టుకోవాలనీ, అతని చంద్రముఖిని తిరిగీ అతనికి అప్పగించివేసి హాయిగా అడవిలో వేటకు వెళ్ళిపోవాలనీ అనుకొన్నాడు.

అతి కష్టంమీద పగలంతా ఆ మహారణ్యం అంతా వెతికి సాయం కాలంవేళ సవిత నొక గుహలో పట్టుకున్నాడు. వెంటనే అతని పాదాల మీద సాగిలపడ్డాడు. సవిత అతని యోగ క్షేమాల విషయం అడగనే లేదు. పైగా చంద్రముఖి మాటే ముందుగా ప్రసంగించాడు:

"చంద్రముఖి ఏదీ?"

"ఏమో! ఎక్కడికి వెళ్ళిందో తెలియదు. స్వామీ! ఆమె నా మాట బొత్తిగా వినిపించుకోవడమే మానివేసింది."

మనస్వి గుక్క తిప్పుకోకుండా ఆమెకూ, తనకూ మధ్య నడిచిన వ్యవహారం అంతా సవిస్తరంగా విన్నవించాడు. సవిత అదంతా అతి శ్రద్ధగా ఆలకించాడు:

"అయ్యో! పాపం! ఏ పాపమూ ఎరగని అమాయకురాలామె. ఇప్పుడీ అడివిలో ఎక్కడ ఏమి ఇబ్బందులు పడుతూందో!"

సవిత ఒక్క వేడి నిట్టూర్పు విడిచి పెట్టాడు. అప్పటికి మనస్వి తాను తొందరపడ్డానేమో అని కొంచెం పశ్చాత్తాపపడ్డాడు. అంతలోనే సవిత అందుకొన్నాడు:

"నాయనా! చంద్రముఖి ఇంకా ముక్కుపచ్చలారని పసిపిల్ల! ఆమెవల్ల ఏదైనా ఒక చిన్న లోపమే జరిగిందనుకో! అంతమాత్రానికే నీ వింత తొందరపడాలా?"

సవిత మాటిమాటికీ చంద్రముఖినే వెనక వేసుకురావడంతో మనస్వి ప్రాణం విసిగిపోయింది:

"ఏమైనాసరే! నేనిక ఆమెతో ఒక్క క్షణంకూడా వేగలేను! ఆమె నన్ను పెట్టిన యమయాతనలు మీకేం తెలుసు! ఆమె కనక అడివిలో ఎక్కడైనా కనిపిస్తే ఇక తిన్నగా మీ దగ్గిరికే వెళ్ళిపొమ్మని చెప్పేస్తాను. ఇక మీ చంద్రముఖిని మీరే జాగ్రత్త చేసుకోండి!"

మనస్వి ఆపైన మరి సవిత ముఖం చూడలేక తలవంచుకొన్నాడు. సవిత సూటిగా అడిగాడు :

"మనస్వీ! నువ్వొక్కడవూ ఒంటరిగా బతకలేక భయపడినప్పుడే నీకామెను తోడిచ్చాను! అప్పుడే ఆ మాట మరిచిపోయావా?"

"మరిచిపోలేదుగాని నాకిప్పుడామెకేసి కన్నెత్తి చూడడానికే భయంగా ఉంది. ఇప్పుడామె నాకొక ఈనిన పులిలా కనిపిస్తూంది!" అన్నాడు మనస్వి ఖండితంగా. ఆ మాటమీద సవిత సాధికారంగా గట్టిగా నవ్వాడు :

"వెర్రివాడా! ఆ చంద్రముఖి ఎవరో తెలియక నీవిలా మర్యాద అతిక్రమించి మాటాడుతున్నావు! ఆమె ఎవరో తెలుసునా! స్వర్గ లోకంలో దేవకన్యకే తిరిగి ఈ భూలోకంలో సాక్షాత్తూ చంద్రముఖిగా అవతరించింది! తెలిసిందా?"

మనస్వి హృదయం ఆ మాటలతో కొంచెం మెత్తబడింది. కొంచెం తటపటాయిసూ అడిగాడు :

"అయితే నేనెవరిని స్వామీ!"

సవిత పెదవిపై చిన్న చిరునవ్వు వెలిసింది :

"వెర్రివాడా! మీరిద్దరూ పూర్వజన్మంలో స్వర్గ దేవతలే! కేవలం సుఖమయమైన స్వర్గలోకంమీద విరక్తికొద్దీ మీరిద్దరూ సుఖదుఃఖ సమ్మేళనమయమయిన ఈ భూలోకంలో జన్మించారు. మీరే ఇక ఈ సృష్టికంతటికీ ఆకాశ దీపాలు. తెలిసిందా?"

మనస్వి ఆ మాట విని తాను చేసిన పనికి బాగా నొచ్చుకున్నాడు. అంతలో అతనికామె మంకుపట్లు, రుసరుసలు, బుడిబుడి దీర్ఘాలు మొదలైనవన్నీ జ్ఞాపకం వచ్చాయి. వాటిని గురించి సవితతో ఏదో విన్నవించుకోవాలని అనుకున్నాడు. అంతలో కొంచెం తటపటాయించి మాట్లాడకూరుకున్నాడు. సవిత అతని జిజ్ఞాస గ్రహించాడు.

"మనస్వీ, ఈ అంధకార బంధురమైన సంసార మహారణ్యంలో నీకిక బంధుమిత్రులెవరున్నారు? ఈ అరణ్యయాత్రలో నీకు భుక్తిముక్తి ప్రదాయిని ఆ చంద్రముఖే! ఆమె చూపులే నీకీ కీకారణ్యంలో వెలుగు దారులు చూపించగలవు! ఇక ఇప్పటినించి నీవామె కనుసన్నలలో

మనుషులుకో! ఆమె ఎప్పుడైనా కంట తడిపెట్టిందంటే ఇక నీ నట్టింట సిరి ఒక్క క్షణమైనా నిలవదు! తెలిసిందా? మీ కిద్దరికీ అచిరకాలంలోనే ఒక కుమారుడు కలుగుతాడు. ఆ పసివాణ్ణి దివ్యలోకంలోని దేవతలాగే పెంచి పెద్ద చెయ్యండి! వెళ్ళు నాయనా, వెళ్ళు!''

అంతలోనే చంద్రిముఖి కలకల నవ్వుతూ హఠాత్తుగా అక్కడికి వచ్చి ''చూచావా? చివరికి నామాటే నెగ్గింది!'' అన్నట్లు మనస్వివైపు చూచింది. మళ్ళీ చంద్రముఖిని చూడగానే మనస్వి మన స్సానందంతో ఉరకలు వేసింది. ఇద్దరూ సవితకు పాదాభివందనం చేసి గుహ గుమ్మం దాటి కొంతదూరం ఇవతలికి వచ్చారు. మనస్వి ఎంతో ఆప్యాయంగా చంద్రముఖికేసి చూచాడు :

''విన్నావా? ఆయన చెప్పినమాట! ఇక్కడినించీ నీవు నాతో చిలిపికజ్జా లాడడానికి వీలులేదు! ఇకనించీ నేనూ నీమన స్సెప్పుడూ నొప్పించనులే!''

చంద్రముఖి బుంగమూతి పెట్టింది:

''అయితే ఇక అడివిలోకి వెళ్ళి పుట్టతేనె, అడివిపళ్ళూ నీవే తీసుకురావాలి. ఆ సవిత మనకోసం ఒక దేవతై వెలిశాడు. ఆయన మాట లెప్పుడూ జవదాటకూడదు. తెలిసిందా?''

అంతలో మనస్వి కొక విషయం జ్ఞాపకం వచ్చింది. అతడు మొదట సవిత ఎవరో తెలుసుకోవాలని అనుకొన్నాడు. కాని హఠాత్తుగా చంద్రముఖి అక్కడికి రాగానే అత డామాటే మరిచిపోయాడు. తీరా గుహగుమ్మం బాగా దాటి వచ్చిన తరవాతనే అతని కా విషయం జ్ఞాపకం వచ్చింది. తిరిగి వెంటనే లోపలికి వెళ్ళాడు.

కాని అతని కక్కడ సవిత కనబడలేదు! గుహ అంతా అంధకార బంధురంగా కనిపించింది. మనస్వి వెంటనే తిరిగివచ్చి ఆ అద్భుత వృత్తాంతం ఆమెకు తెలియజేశాడు :

''చంద్రిముఖీ! ఆయన నిజంగా దేవతామూర్తే! సందేహంలేదు!''

వెంటనే చంద్రిముఖి మనస్సులో అతనికి చెయ్యెత్తి నమస్కరించింది.

"నిన్ను, నన్ను, ఈ మహాప్రపంచాన్ని సృష్టించిన సృష్టికర్త ఆయనే !" అన్నాడు మనస్వి.

తిరిగి ఇద్దరూ ఆ గుహాముఖంలో నిలబడి అతనికి చెయ్యెత్తి నమస్కరించారు.

అప్పటినించీ అడవిపళ్ళు, పుట్టతేనే తీసుకురావడం మనస్వి కొక అలవాటుగా మారిపోయింది. ఆ పళ్ళు పుట్టతేనెలో పొదిపి అతని కందించడం చంద్రముఖికి మహానంద దాయకంగా పరిణమించింది.

మనస్వి అడివిలో ఎన్ని కష్టాలుపడినా చంద్రముఖి ముఖస్మరణంలో అవన్నీ అతని కవి తీయతీయని కలలుగానే కనిపించాయి.



# సార్వభౌమ సత్కారం

## 1

ఆనాటి అపరాహ్ణవేళ విక్రమాదిత్య చక్రవర్తి ఆస్థానం అంతా ఆనందడోలికలలో ఉయ్యాల లూగిపోయింది! చక్రవర్తి కది లేక లేక కలిగిన సంతానం! అందులోనూ మగశిశువు! ఇక ఆ పసికందే సార్వభౌముని అనంతరం సామ్రాజ్యభారం వహింపబోతున్నాడు! అందువల్ల చక్రవర్తికేకాక సామ్రాజ్యానికంతటికీ మహోత్సవమే! ఇక రాజధాని ఉజ్జయినీనగరమూ, రాజాస్థానమూ ఈ మహోత్సాహంలో తలమునకలై పోవడంలో ఆశ్చర్యం ఏమి ఉంది!

ఆనాటి నిండుపేరోలగంలో చక్రవర్తి విద్వాంసులకు, కవులకు, గాయనీనర్తకీమణులకూ రత్నాంగుళీయకాలు, అమూల్యమైన చీని చీనాంబరాలు, అగ్రహారాలూ కోకొల్లలుగా బహూకరించాడు! ఈ బహూకృతి జరిగిన పిమ్మట సార్వభౌముడు విద్వాంసుల నందరినీ శిశువు జాతకచక్రం పరిశీలించి ఫలితాలు చెప్పవలసిందని ప్రార్థించాడు. విక్రమాదిత్యుడంతటి విద్వత్ప్రభువు 'ప్రార్థన' కంటె విద్వాంసుల కిక వేరే ఏమి కావాలి గనక! అందరూ తమతమ హస్తాల్లో ఉన్న ఆ శిశువు జాతకం పరిశీలనలో మునిగిపోయారు! అవి భూర్జపత్రాలమీద లాక్షారసంతో లిఖించిన జన్మపత్రికలు. పండితులేకాక చక్రవర్తికూడా

స్వయంగా జాతకం పరిశీలిస్తున్నాడు! ఆస్థాన జ్యోతిర్విద్వాంసుడు ఆదిత్యభట్టారకుడు వేళ్లు మడిచి మీనమేషాలు లెక్క పెడుతూ మధ్య మధ్యన చక్రవర్తి ముఖకవళిక లోకకంట కనిపెట్టి చూస్తున్నాడు.

మధ్యాహ్నం మూడుయామాలు గడిచిపోయాయి. దానికి సూచనగా రాజప్రాసాదం గోపురంమీద గంభీరంగా భేరీధ్వనులు మారుమోగాయి. కొంతసేపటికి ఆ సమీపంలో మహాకాళనాథుని దేవాలయం గంటల గణగణలు వినిపించాయి. తరువాత "హర! హర! మహాదేవ శంభో! జయ! మహాకాళనాథా! జయ!" ఇత్యాది జయజయధ్వానా లా గంటల గణగణలలో కొంచెం అస్పష్టంగా వినిపించాయి.

చక్రవర్తి కిరువైపులా ఒయ్యారంగా నిలిచిన చామరగ్రాహిణులు వింజామరాలు వీస్తున్నారు. వారిద్దరికీ కొంచెం వెనక తాంబూల కరండకం బుజంమీద ధరించిన మరి ఒక సుందరి చిత్రప్రతిమలా నిలబడి, విద్వాంసు లెవరికైనా కర్పూర తాంబూలాల అవసరం కలగగల దేమోనని రెప్ప వెయ్యకుండా నిరీక్షిస్తున్నది. గవాక్షాలద్వారా ప్రసరిస్తున్న ఎండపొడలు రాజసభలో పరిచిన రత్నకంబళ్ళమీద పడి వింత వింత రంగులు వెదజల్లుతున్నాయి. అప్పుడప్పుడా కిరణాలుపడి అటు ఇటు కదులుతున్న తాంబూల కరండక వాహిని పైడికుండలాలు తళతళ మెరుస్తున్నాయి. పక్కగా ప్రవహిస్తున్న శిప్రానది తరంగాల రొద ఉజ్జయినీనగరం ఉత్సవ కోలాహలాని కొక మంద్రశ్రుతిగా వినవస్తున్నది.

కొంతవరకు జాతకపరిశీలన జరిగిన తరవాత చక్రవర్తి చూపు లాస్థాన జ్యోతిషికునిమీద పడ్డాయి. ఆ విద్వాంసుడు వెంటనే లేచి నిలబడి సవినయంగా చేతులుజోడించి కొంచెం సంకోచిస్తూ—

"మహాప్రభూ! నా దొక్క మనవి! మొదటినించిన్నీ ముఖస్తుతి చేస్తాననే అపప్రథ ఒకటి నామీద పడిఉన్నది! ఇందువల్ల నా క్షేమన దానికిన్నీ పాలుపోవడం లేదు!" అన్నాడు.

చక్రవర్తి పెదిమలపై ఒక చిన్న చిరునవ్వు చిందులు దొక్కింది! "ఆ సంకోచ మేమీ ఉండనక్కరలేదు! యథేచ్ఛగా మాట్లాడవచ్చు"

అని ఆ చిరునవ్వుల పరమార్థం. జ్యోతిషికుడావైన జాతకచక్ర ఫలితం ఇలా విన్నవించుకొన్నాడు :

"సార్వభౌమా ! రత్నాల గనిలో గులకరాయి బయలుదేరదు గదా ! జాతకం పరిశీలిస్తూంటే 'ఆ దేవేంద్రుడే విలాసార్థమై ఈ ఉజ్జయినిలో అవతరించాడా!' అన్నట్టుగా ఉంది! భాగ్య రాజ్యాధిపతులు పరమోచ్ఛస్థులై ఉన్న శుభసమయంలో యువమహాసార్వభౌము అవతరించారు! ఆపైన బలమైన శుభగ్రహ వీక్షణంకూడా తోడైంది! ఇక వేరుగా విన్నవించవలసిం దేమున్నది ! మహాప్రభూ ! జాతకుడు చతుస్సముద్ర వేలావలయిత భూమండలాని కంతటికీ ఏకచ్ఛత్రాధిపత్యం వహించి, తమ ప్రతాపంకూడా కొంచెం కించపరచ గలడనే అనిపించింది!"

అని చక్రవర్తి ముఖంవైపూ, మిగిలిన సభ్యుల ముఖాలవైపూ చూస్తూ నెమ్మదిగా తన ఉన్నతాసనంమీద ఆసీనుడైనాడు.

చక్రవర్తీ, మిగిలిన సదస్యులూ ఈ శుభ ఫలితాని కెంతో ఆనందించారు. పిమ్మట విక్రమాదిత్యుని కటాక్షవీక్షణం మిహిర పండితుని మీదికి తిరిగింది.

అతడు అత్యంత భయభక్తులతో లేచి నిలుచుని—

"ప్రభూ! నే నెప్పుడూ అశుభ ఫలితాలే చెబుతాననే అపకీర్తి పొందిఉన్నవాణ్ణి! ఈ శుభసమయంలో నా వంటి శకునపక్షి ప్రసంగం సముచితంకాదు. నన్ను మన్నించండి!" అని వెంటనే కూర్చోబోయాడు. కాని చక్రవర్తి దాని కనుమతించలేదు. అందుచేత మిహిర పండితుడు తిరిగి సవినయంగా శిరస్సువంచి—

"జాతకం స్థూలదృష్టికి ఆస్థాన విద్వాంసులు చెప్పినట్టుగానే కనిపిస్తున్నది. కాని ప్రబలమైన బాలారిష్టదోషం ఒకటి పట్టి ఉంది. అది ఉంటే ఎన్ని మహా రాజయోగాలు పట్టినా—అవి ఏమీ ఫలించవు!" అని ముక్తసరిగా మూడు వాక్యాలలో తన ప్రసంగం ముగించివేసి కూర్చున్నాడు. దీనితో జాతక పత్రికలు పరిశీలిస్తున్న మిగిలినవారందరి మీదా ఒక పెద్ద పిడుగు పడ్డట్టయింది! ఆస్థాన జ్యోతిర్విద్వాంసుని కళ్ళు

జేవురించాయి! చక్రవర్తి తొణకా లేదు, బెణకా లేదు! ఆస్థాన విద్వాంసుడు మరి చక్రవర్తి కనుసన్న కోసం వేచి ఉండలేక చర్చ లేచి నిలుచున్నాడు! కాని దానికి విక్రమాదిత్యుని అంగీకార ముద్ర పడలేదు! ఇక చేసేదేమీ లేక నిలుచున్న పళంగానే తన స్థానంలో చతికిలబడిపోయాడు.

మిగిలిన విద్వాంసులంతా ఇక ముందు క్షణంలో ఏమి జరగనున్నదో అన్నంత ఆత్రంతో చక్రవర్తి కనుసన్నలు నిరీక్షిస్తూ ఉద్విగ్నంగా వేచిఉన్నారు.

"ఇంతకీ ఘటకర్పర కవీశ్వరు లేమంటారో!" అన్నాడు విక్రమాదిత్యుడు. అందరూ ఆశ్చర్యపోయారు! ఘటకర్పర కవికి జ్యోతిష శాస్త్రంలో ఉన్నది కేవలం శ్రుతపాండిత్యమే.

ఘటకర్పరకవికూడా ఈ చర్చలో తన ప్రస్తక్తి రాగలదని అనుకో లేదు! అయినా ప్రభువు ఆజ్ఞ అయిన తరవాత మరి మాట్లాడకపోతే బాగుండదనుకొని కంగారుగా లేచి ఇలా విన్నవించాడు:

"నాది శ్రుతపాండిత్యమే నన్నది ప్రభువువారికి తెలియని విషయం కాదు! కేవలం వినోదార్థమై నన్నీవిధంగా ఆజ్ఞాపించి ఉంటారనే అనుకుంటున్నాను. అయితే— ఇన్నాళ్ళనించీ కవితా వధూమణి ఒక్క కవుల సొమ్మేనని భావించేవాణ్ణి! ఈనాడీ విద్వాంసుల ప్రసంగాలు ఆలకించిన తరవాత— ఇక ఆ వధూమణి జ్యోతిష విద్వాంసుల కైవసమైపోయిందని తోచింది! ఇకనించీ నేనీ కవితా పరిశ్రమ విరమించుకొని నాలుగు జాతక చక్రాలు గుణించుకుంటూ కూర్చుంటే జీవితం సుఖంగా వెళ్ళిపోతుందని భావిస్తున్నాను. ఈవేళ వీరి ప్రసంగాలు విని బ్రహ్మానందభరితుణ్ణయినాను."

సభాస్తారులంతా స్థూలంగా కవిచమత్కృతి గ్రహించి కలకల నవ్వారు! చక్రవర్తి కవి వాక్కులోని లోలోపలి వ్యంగ్యాలు, ఈసడింపులు గ్రహించి గుంభనగా ఒకనవ్వు నవ్వి, వెంటనే ఆకవి పక్కనే సుఖాసీనుడై ఉన్న న్యాయశాస్త్ర విద్వాంసుడు భేతాళభట్టు వైపు తిలకించాడు. ఆయన తర్కశాస్త్రంలో నిధి. చక్రవర్తికి ప్రత్యే

శాభిమానం ఉన్న శాస్త్రం కనక జ్యోతిషంలోకూడా బాగా పరిశ్రమ చేశాడు. భేతాళభట్టు దిగ్గునలేచి చక్రవర్తి కిలా విజ్ఞాపన చేసుకొన్నాడు :

"మహారాజా! ఏలినవారొక్క విషయం సావధానంగా దివ్య చిత్తానికి వాత్తించుకోవాలని విన్నవించుకొంటున్నాను. ఆస్థాన జ్యోతిష విద్వాంసులైన ఆదిత్యభట్టారకులు ఆర్ష జ్యోతిషంలోను, లౌకిక జ్యోతిషంలోను దిగ్దంతులు! తమ సువిశాల సామ్రాజ్యంలో వారికి సాటి రాగల మేటివిద్వాంసు లెవ్వరూలేరు. వారివాక్కు సాక్షాత్తువేదవాక్కే. ఇక మిహిరపండితులమాట! వీరికీర్తి దిగ్దిగంతాలవరకు వ్యాపించింది గదా! పశ్చిమదేశాలనించి వచ్చిన యవనవిద్వాంసులుకూడా వీరి పాద సన్నిధిని ఈ శాస్త్రం అభ్యసిస్తున్నారంటే ఇక వీరి ఘనతవిషయం నేను వేరుగా విన్నవించవలసింది ఏమి ఉంది! పైగా వీరు యవనశాస్త్ర వేత్తల అపూర్వ రహస్యాలుకూడా కూలంకషంగా అవగాహన చేసుకొన్న వారాయెను! వీరిద్దరిలోను మనం ఎవరిని కాదనగలం! అయితే ఈ ఇద్దరూ యువసార్వభౌముల జాతకం కూలంకషంగా అవలోడన చేసి కేవలం పరస్పర విరుద్ధమైన ఫలితాలు సెలవిచ్చారు. ఈ శాస్త్రానికి వీరిద్దరూ సూర్యచంద్రుల వంటివారుగదా!...... ఆలోచించగా- ఆలోచించగా నాకు జ్యోతిశ్శాస్త్రంలోనే ఏదో గొప్ప లోపం ఉన్నట్టు భాసిస్తూంది. అసలీ శాస్త్రం తర్కవ్యాకరణాది శాస్త్రాల సరసన కూర్చోబెట్టడానికి తగినశాస్త్రమే కాదని నా అనుమానం. ఈమధ్యన ఈశాస్త్రం లోతులు కొంచెం ఆకళించుకొన్న తరవాత నావంటి అల్పుడికి తోచిన అభిప్రాయం ఇది. ఆపైన మరి దేవరవారి చిత్తం!"

ప్రసంగా లీవిధంగా పాకంలోపడ్డ తరవాత ఆస్థాన విదూషకుని కిక ఉండబట్టలేదు. చక్రవర్తి సెలవులేకుండానే ఆదరా బాదరాగా అర్ధకుసిగా లేచి నుంచుని తనఘోష వెళ్ళబోసుకున్నాడు.

"భూలోక దేవేంద్రా! స్వయంగా శాస్త్రవేత్తలై ఉండిన్నీ తర్కపండితులు జ్యోతిషంవంటి మహాశాస్త్రమే "సర్వం మిథ్య" అని కొట్టిపారేశారు. నిజానికన్నిశాస్త్రాలూ అంతే. కనకనే చిన్ననాడే నేను శాస్త్రాభ్యాసానికి స్వస్తిచెప్పి హాయిగా ఆగమ్మకాకిలా తిరిగాను.

ఈ విజ్ఞానం యావత్తూ నాకు బాగా పసిప్రాయంలోనే అబ్బింది. ఏలిన వారు నన్ను పట్టి హాస్యగాడని కొట్టిపారేస్తారుగాని, ఈ మహాస్థానంలో విద్వద్బిరుదం ఇచ్చి గౌరవింపదగినవాణ్ణి నేనొక్కణ్ణేనని నాకిప్పుడు గట్టి ధీమా కలిగింది.''

విదూషకుని ప్రసంగం ముగిసేసరికి ఆస్థానం అంతా ఒక్కసారిగా విరగబడి నవ్వింది! గభీరముద్ర వహించిన చక్రవర్తికూడా నవ్వకుండా ఉండలేకపోయాడు. చివరికి తాంబూల కరండక గ్రాహిణి, చామర గ్రాహిణులుకూడా తమ సహజవినయం విడిచివేసి కలకల హాసాలు చిలకరించారు.

కాని జ్యోతిషవిద్వాంసు లిద్దరూ ఈ అవహేళన కేమీ చెయ్యలేక వెలవెలబోయారు! మిహిర పండితుడు మాత్రం లేని చిరునవ్వు తెచ్చిపెట్టుకున్నాడు. ఆదిత్య భట్టారకుడు మిహిర పండితుడు మాట్లాడినప్పటి నుంచీ లోలోపల అట్టుడికిపోతున్నట్టుడికి పోతూనే ఉన్నాడు! విదూషకుని ప్రసంగంతో అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది. ఒక్కసారిగా దూసిన కత్తిలా లేచి నిలబడి—''మహాప్రభూ! తమరు ధర్మప్రభువులై ఉండిన్నీ వేదాంగమైన జ్యోతిశ్శాస్త్రానికీ విధంగా అపచారం జరుగుతూంటే సహించి ఊరుకోవడం న్యాయంకాదు. నా విజ్ఞప్తికి కూడా కొంచెం అవకాశం ఇప్పించవలసిందని వేడుకొంటున్నాను.'' అన్నాడు.

దీనితో సభలోనివారంతా ఒక్కసారిగా శిలా ప్రతిమల్లా నిర్ఘాంత పోయారు. చనువిచ్చినంతమాత్రాన ముందు వెనకలు చూసుకోకుండా చక్రవర్తిపై ఈ విధంగా నిందమోపడం సభామర్యాద అత్కుణం కాదని వారిలో వారు గుసగుస లాడుకున్నారు. కాని చక్రవర్తి అల్లాగే ఉల్లాసంగా నవ్వుతూ ఆదిత్యభట్టారకుని ప్రసంగాని కంగీకరించాడు.

దానితో భట్టారకుని కోపం కొంచెం శాంతించింది. అత డిలా అన్నాడు:

''ఈ యవన సంసర్గం ఏర్పడినప్పటినించీ మన ప్రాచీనార్ష సంప్రదాయాలన్నీ గంగలో కలిసిపోతున్నాయి. తత్రాపి వేదాంగజ్యోతిషం మరీ భ్రష్టమైపోయింది. ఈ విషయం తమ దివ్యచిత్తానికి తేవాలని నేనెన్నాళ్ళనించీ తాపత్రయ పడుతున్నాను. ఇక మా ప్రస్తుత వివాద

విషయం! మిహిర పండితులు యువసార్వభౌముల జన్మపత్రికలో ఏదో అస్పష్టమైన బాలారిష్టదోషం ఉన్నదని ఉట్టంకించి ఉన్నారు! ఈ అస్పష్ట ఫలితాలవల్లనే ఈ శాస్త్రం ఈ విధంగా నవ్వులపాలై పోతున్నది. కనక విస్పష్టంగా ఆ బాలారిష్టం సంభవించే సమయము, ఆ అరిష్ట స్వభావము వివరించవలసిందని వారిని సవినయంగా వేడు కొంటున్నాను!''

మిహిర పండితు డిక ప్రసంగించ దలుచుకోలేదు. ఏదో అస్పష్టంగా - ముక్తసరిగా సమాధానం చెప్పవలెనని అనుకున్నాడు. కాని చక్రవర్తి దాని కంగీకరించలేదు. విధిలేక అత డిలా అన్నాడు:

''ఈ మహోత్సవ సమయంలో ఈ విధంగా ప్రసంగించవలసి వచ్చినందుకు ప్రభువులు, సభ్యులు నన్ను మన్నించవలెనని ప్రార్థిస్తున్నాను. నేను యవనవిద్వాంసులచేత ఆర్ష జ్యోతిషం అధ్యయనం చేయించినమాట యథార్థమే. వారివద్ద స్వయంగా కొన్ని శాస్త్ర రహస్యాలు గ్రహించిన మాటా యథార్థమే. కాని అంతమాత్రంచేత ఆర్ష శాస్త్ర సంప్రదాయానికి నేను చేసిన అపచారమేమో నా కవగతం కాలేదు! ఇక నేను చెప్పిన జోస్యంవిషయం మనవి చేస్తున్నాను. ఈ జాతకుని ఆయుర్దాయం మరి రెండు సంవత్సరాలే. మూడవ సంవత్సరం ప్రారంభంలోనే వనవరాహం వల్ల అరిష్టం సంభవించగలదు. అప్రియం చెప్పినందుకు నన్ను మన్నించ వలసిందని తిరిగీ విన్నవించుకొంటున్నాను.''

మిహిర పండితు డీ మాట లనగానే సభలో మళ్ళీ పిడుగు పడ్డట్టయింది. సభాస్తారులంతా నిర్ఘాంతపోయారు. చక్రవర్తి కేమీ పాలు పోక విచారంగా మౌనముద్ర వహించాడు.

'ఆదిత్య భట్టారకులకు నా దొక్క మనవి'' అన్నాడు విహూష కుడు హఠాత్తుగా లేచి నిలబడి. చక్రవర్తి ప్రశ్నార్థకంగా కనుబొమలు ముడిచాడు.

''మరి యువసార్వభౌముల పట్టాభిషేకం ఏ సంవత్సరంలో జరగ గలదో విస్పష్టంగా తెలియజెయ్యవలసిందని నా ప్రార్థన'' అన్నాడు విదూషకుడు.

భట్టారకుడు ఠీవిగా నిలబడి "సరీగా నేటికి 20 సంవత్సరాల అనంతరం ఈ సభామంటపంలోనే — చక్రవర్తి స్వయంగా యువ మహారాజులుంగారికి సామ్రాజ్యాభిషేకం జరపగలరు! ఇది ముమ్మాటికీ నిశ్చయం! యువసార్వభౌమునికి జయం! జయం!" అన్నాడు.

సభ్యులందరూ ఆనందంతో ఒక్కసారిగా 'జయం! జయం!' అన్నారు. ఆ హర్షధ్వానాలతో సభలో హఠాత్తుగా వర్షం కురిసి వెలిసినట్లయింది.

విదూషకుడు తిరిగి లేచి నిలబడి చక్రవర్తి కెదురుగా దీనంగా ముఖంపెట్టి అతివినయంగా చేతులుకట్టుకుని "ప్రభూ, ఆనాటికైనా నన్ను తమ ఆస్థాన విద్వాంసుణ్ణిగా ఏర్పాటు చేయించవలిసిందని నాప్రార్థన!" అన్నాడు. సభలో వెంటనే ఉవ్వెత్తుగా కలకలహాసం చెలరేగింది. నాటికి పరిషత్తు ముగిసిపోయింది.

## 2

ప్పిమ్మట కాలక్రమంలో రెండుసంవత్సరాలు రెండు దివసాలుగా గడిచిపోయాయి. చక్రవర్తికీజ్యోతిర్విద్యమీద గాఢాభిమానం ఉన్న మాట వాస్తవమే! అయితే గొప్ప గొప్ప విద్వాంసులు చెప్పిన భావి ఫలితాలు కూడా ఒకొక్కప్పుడు తప్పిపోతూండడంవల్ల ఆ శాస్త్రం మీద నయితేనేమి - శాస్త్రజ్ఞులమీద నయితేనేమి కొంత కొంత అవిశ్వాసం ఏర్పడినమాట వాస్తవమే!

కాని భవిష్యత్తు విషయంలో తహతహ పడని మహామహులు చాలా అరుదుగా ఉంటారు! అందులోను చక్రవర్తికి లేకలేక కలిగిన కుమారుడు! అతడు సామ్రాజ్యానికంతటికీ ఒక్కే ఒక వారసుడు! అవధి సమీపించినకొద్దీ-ఎంతగా జ్యోతిశ్శాస్త్రం కాదనుకొన్నా - చక్రవర్తికి లోలోపల కుమారుని భవిష్యత్తు విషయమై కొంచెం భయం ప్రారంభమైనది! ఆదిత్యభట్టారకుడు, మిహిరపండితుడు ఇద్దరూ కొన్ని శాంతిక్రియలవల్ల భావిదుష్ఫలితాలు కొంతవరకు ఉపశమించవచ్చునని అంగీకరించారు! అందువల్ల చక్రవర్తి రాజపురోహితుణ్ణి పిలిపించి -

అనేకమైన అరిష్టశాంతిహోమాలు, దానధర్మాలు, యజ్ఞయాగాలు చేయించవలసిందని ఆజ్ఞాపించాడు. మొట్టమొదట రెండేళ్లయినా నిండీ నిండని పసిబాలుని వనవరాహం మూలకంగా మృత్యువు సంభవించ గలదంటే ఎవరికీ విశ్వాసం కలగలేదు. చక్రవర్తికి ఈ మాటల్లో ఉన్న ఔచిత్యం గోచరించకపోలేదు! అయినా అంతఃపురం ఉద్యానవనాల పరిసరాలలో ఎక్కడా అడవిపందుల పసికూనలు కూడా కనబడకూడ దని గట్టిగా కట్టడిచేశాడు. మొదట అరణ్యాల్లో వనవరాహాల నామ రూపాలు లేకుండా రూపుమాపి వెయ్యాలని సంకల్పించాడు గాని— యజ్ఞవరాహమూర్తి ప్రాచీనకాలంనుంచీ చక్రవర్తి వంశీయుల కుల దైవం. వారి పతాక చిహ్నంకూడా యజ్ఞ వరాహమే! అందువల్ల ఆ ప్రయత్నం విరమించి అరణ్యాల్లో వనవరాహాలు సంచరించే ప్రాం తాలకు గట్టి పరిమితులు ఏర్పాటుచేయించాడు. రాజకుమారునికి ఏ విధమైన అపాయమూ సంభవించకుండా అహోరాత్రిలూ కంటికి రెప్పలా కాపాడవలసిందని ఆజ్ఞాపించాడు.

మూడవ సంవత్సరం ప్రారంభంలోనే అరిష్టం సంభవించగలదని మిహిర పండితుడు జోస్యం చెప్పాడుగదా! ఆ ప్రారంభం అంటే ఎంతకాలమో విస్పష్టంగా తేల్చి చెప్పవలసిందని చక్రవర్తి పండితుణ్ణి ప్రశ్నించాడు.

“మహాప్రభూ! మూడో సంవత్సరంలో మొదటి మాసంలోనే ఆ అరిష్టం సంభవింపగలదు.”

“శాంతిక్రియలవల్ల ఈ అరిష్టం శాంతించదా?”

“అది కొంతవరకే శాంతిసుంది. కాని జాతకుని కంతకంటె ఒక్క క్షణంకూడా ఆయుర్దాయంలేదు!”

“అది ఆ మాసంలో ఏ క్షణంలో జరగ గలదో తెలియదా?”

మిహిరుడు కొంచెంసేపాలోచించి, “తెలుసుకోవచ్చునుగాని— నా శాస్త్రజ్ఞానం బహు పరిమితం! అదిన్నిగాక గ్రహగతిని బట్టి శాస్త్రజ్ఞులు భవిష్యత్తు సూచనాప్రాయంగానే నిర్ణయిస్తారు. అంతే

గాని అల్పాల్పమైన తారతమ్యా లెవరు నిర్ణయించి చెప్పగలరు! అది తెలిసినవా డా దైవం ఒక్కడే!'' అన్నాడు.

ఆ పిమ్మట ఆమూడోమాసంకూడా చాలా వరకు గడచిపోయింది. క్రమంగా వసంతం ముదిరి గ్రీష్మం ప్రారంభమైనది. ఆ మాసావధి సమీపించినకొద్దీ పుత్రప్రేమవల్ల విక్రమార్కుని హృదయంలో భయాందోళన లెక్కువైనాయి. ఆస్థాన జ్యోతిషపండితుడు, అమాత్యులు ఇక ప్రాణాపాయం దాటిపోయినట్లేనని చక్రవర్తి కనేక విధాలుగా ధైర్యం చెప్పారు! అయినా చక్రవర్తి హృదయంలో నిత్యమూ అరణ్యవరాహాలు గాండ్రిస్తూన్నట్లే ఉండేది!

మానవ హృదయంలో బీభత్సంగా పెల్లుబికిన భయాందోళనలే ఒక్కొక్కప్పుడు భౌతిక రూపాలు ధరిస్తూంటాయి. ఆనాటి రాత్రి గ్రీష్మాధిక్యంవల్ల బాగా ఉక్కపోసింది. చక్రవర్తి రాజప్రాసాదం మీద శిశువుశయ్య కనతిదూరంలోనే హంసతూలికాతల్పంపై పవ్వళించి కలత నిద్రలో ఏదో కలవరించాడు. దిగ్గున లేచి కూర్చున్నాడు. అతనికి అరణ్యవరాహం మేడమీదికి దూకివచ్చి యువసార్వభౌముని హృదయం వాడి కోరలతో చీల్చివేసినట్లు కల వచ్చింది. కాని లేచి చూచిన తరవాత అదంతా భ్రాంతి మాత్రమే అని స్పష్టపడింది.

చక్రవర్తి దైవధ్యానంచేసి తిరిగి పవ్వళించాడు. ఎక్కడా ఆకల్లాడడంలేదు. గాలి స్తంభించింది. నల్లనల్లగా కారుమబ్బులు కమ్ముకున్నాయి. ఉండి ఉండి హఠాత్తుగా జంఝామారుతం వీచింది. ఫెళ ఫెళ ధ్వనులతో పిడుగుపడింది. కెవ్వని కేక వినిపించింది. చక్రవర్తి లేచి ఒక్క అంగలో శిశువు శయ్యదగ్గరికి చేరుకున్నాడు. ఎదురుగా రక్తసిక్తమైపోయిన శయ్య! పరిజనులంతా పరుగెత్తుకువచ్చారు. మొదట ఈ ఘోర దారుణానికి కారణమేమో ఎవరికీ తెలియలేదు. కొందరు పిడుగుపడి ఉండవచ్చు ననుకొన్నారు. రాజప్రాసాదంపై ప్రతిష్ఠించిన పతాకంపై నిలిపిన లోహ వరాహమూర్తి వాడికోరలు శిశువు హృదయం చీల్చివేశాయి. గాలి తాకిడికి ఆ పతాకం విరిగి నేలపై ఒరిగి అక్కడే పడిపోయింది. వేగరులు రాజవైద్యుల కోసం పరుగులు పెట్టారు. వారంతా శాయశక్తులా చికిత్సలు చేశారు. కాని విధి బలీయమైపోయింది.

## ౨

ఈ వార్త ఉజ్జయినీ నగరం అంతటా కార్చిచ్చులా వ్యాపించింది. ఈ సంఘటనపై విద్వాంసులు తమలో తామనేక విధాలుగా వాదోపవాదాలు సాగించారు. కొందరు మిహిరుని జోస్యం అక్షరాలా ఫలించిందన్నారు. మరికొందరది వనవరాహం కాకపోవడం వల్ల జోస్యం పూర్తిగా తప్పిపోయినట్లే అని చప్పరించేశారు.

అటుతరవాత రెండుమూడు నెలలవరకూ చక్రవర్తి ఆస్థానంముఖమే చూడలేదు! సన్నిహితులైన వారెవరికోగాని, చక్రవర్తిదర్శనమే కాలేదు!

ఆదిత్యభట్టారకుడు తన జోస్యం తప్పినా మిహిరుడు చెప్పినట్లు జరగలేదుగదా అని చాలా ఆనందించాడు! ఈ దెబ్బతో అతనికి దేవిడీమన్నా జరిగిపోగలదని లోలోపల చాలా ఉవ్విళ్ళూరాడు. కాని విద్వాంసుల్లో చాలామంది ఆ విధంగానైనా మిహిరుని జోస్యం ఫలించిందికదా అని పరమానంద భరితులైనారు. ఇంతకీ చక్రవర్తి లోలోపలి నిర్ణయమేమో ఎవరికీ అంతుదొరకలేదు. చక్రవర్తిని ఎంతమంది దర్శించినా - ఆయనతో ఆ విషయం ప్రస్తావించడానికే బెదిరిపోయేవారు. అటు చక్రవర్తి, ఇటు మిహిరుడు-ఈ విషయంలో కేవలం ఔదాసీన్యం వహించి ఊరుకున్నారు. అలాగలాగ ఆరు మాసాలు గడిచిపోయాయి.

హఠాత్తుగా విద్వాంసులందరికీ ఆస్థానానికి రావలసిందని ఆహ్వానాలందాయి అందరూ తిరిగి చక్రవర్తి రాజకార్యాలు పరిశీలిస్తున్నారు గదా అని సంతోషించారు.

విద్వాంసులందరూ పల్లకీ లెక్కి ఆస్థానద్వారం చేరుకునేసరికి ఆస్థానం అంతా నూతనాలంకారాలతో కలకలలాడుతూంది! అందరూ ఆశ్చర్యపోయారు! లోపలికి వెళ్ళి తమతమ సమున్నతాసనాలపై సుఖాసీనులయినారు. చక్రవర్తి చాలా ఉల్లాసంగా ఉన్నాడు; ఆ ముఖంలో ఎక్కడా విషాదచ్ఛాయే కనిపించలేదు. కొంతసేపటికి చక్రవర్తి మిహిరుని సమ్ముఖాని కాహ్వానించాడు. ఆయన మెల్లిగా అడుగులు వేసుకుంటూ చక్రవర్తి సింహాసన సమీపంలో నిలుచున్నాడు.

చక్రవర్తి బంగారు పళ్లెరంలో ఉంచిన నవరత్న ఖచితమైన సువర్ణవరాహం ఆయన కందించబోయాడు. మిహిరుడు తన కన్నులే నమ్మలేకపోయాడు! అటువంటి మహాగౌరవం ఇదివరకెన్నడూ ఆ ఆస్థానంలో జరిగి ఉండలేదు! సదస్యులందరూ క్షణంలో ఇది గ్రహించు కొని జయజయధ్వానాలు చేశారు!

మిహిరుడు సవినయంగా శిరస్సువంచి, "మహాప్రభూ! దీనికి నేననర్హుణ్ణి! నేనన్నది ఫలించ లేదు! ఒక వేళ ఏదోవిధంగా ఫలించినా దేవరవారి కది శుభఫలితం కాలేదు!" అన్నాడు.

"శుభాశుభాలతో నిమిత్తంలేదు! మీ వైదుష్యానికీ, వాక్శుద్ధికీ మాత్రమే ఈ సన్మానం. అదీ గాక మీరన్నది అక్షరాలా యథార్థ మైనది. వనవరాహమని మీ రన్నారు! అది లోహ ప్రతిమే అయినా వనవరాహమే! అది సజీవమా, నిర్జీవమా అన్న మీమాంస కీ వివాదంలో ప్రసక్తే లేదు!" అన్నాడు సార్వభౌముడు.

ఇక మిహిరుని కా సన్మానం అంగీకరించక తప్పలేదు.

"మహాప్రభూ! ఇది మీ అపారమైన ఔదార్యానికి మాత్రమే తార్కాణం" అన్నాడు మిహిరుడు, సువర్ణవరాహ బహూకృతి స్వీకరిస్తూ.

ఆస్థాన విద్వాంసు లందరూ ముక్త కంఠాలతో తిరిగీ జయ జయ ధ్వానాలు చేశారు.

పిమ్మట చక్రవర్తి సవినయంగా మిహిరునికి నమస్కరించాడు.

"సుపుత్రావాప్తిరస్తు" అన్నాడు మిహిరుడు చేతులెత్తి.

"ఇది మీ అమోఘాశీర్వచనం" అన్నాడు చక్రవర్తి.

"ఆశీర్వదించడానికి సమర్థులైన మహనీయులెందరో ఈ ఆస్థానంలో ఉన్నారు. ఆ అర్హత నాకు లేదు. నేను కేవలం తమ జాతక చక్రఫలితం దృష్టితోనే ఈ మాట అన్నాను" అన్నాడు మిహిరుడు.

ఆస్థాన విద్వాంసుల జయ జయ ధ్వానాలు తిరిగీ ఇంకొకసారి మిన్నందుకొన్నాయి.

ఆ నాటినించీ మిహిరుడు వరాహ మిహిరు డనే విశ్వ విఖ్యాతి సంపాదించుకొన్నాడు.

# అవహేళన

## 1

"అదిగో! ఆ వృక్షాగ్రంమీది పక్షి శిరస్సు నీకు స్పష్టంగా ప్రత్యక్షమయిందా?"

"అయింది."

"పరిసరంలో ఉన్న మేమంతా నీకు స్పష్టంగా కనిపిస్తున్నామా?"

"ఆఁ, స్పష్టంగా కనిపిస్తున్నారు!"

"ఇంకా ఆ చెట్టుమీది శాఖోపశాఖలన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయా?"

ధర్మరాజు 'ఔ' నన్నట్టు తల ఊగించాడు. ద్రోణాచార్యుడు పక్కుమని నవ్వాడు:

'ధర్మరాజా! ఇక ఈ లక్ష్య భేదనం నీవల్ల అయ్యే పనికాదు! నీ విక తొలగిపో!" అని ఆజ్ఞాపించాడు.

ధర్మరాజు వెంటనే తన వింట సంధించిన బాణం ఉపసంహరించి వేసి తిరిగీ అది తన అమ్ముల పొదిలో పెట్టుకొన్నాడు. తలవంచుకొని పక్కకు తొలగిపోయి నిలుచున్నాడు. ఆ విధంగా ఆచార్యుడు హాశా

తుగా తొలగిపొమ్మనడానికి కారణమేమో అతనికి బోధపడలేదు. ధర్మరాజలాగే నిర్ఘాంతపోయి నిలుచున్నాడు.

ఆనాటి ప్రాతఃకాలవేళ కౌరవ పాండవ కుమారుల అస్త్రవిద్యా కౌశల పరీక్ష జరుగుతూంది. ద్రోణాచార్యుడు తన శిష్యగణం లక్ష్యశుద్ధి కౌశలం పరీక్షించే అభిలాషతో వారి నందరినీ అక్కడ సమావేశపరిచాడు. కౌరవ పాండవ కుమారులందరూ బారులుదీర్చి నిలుచున్నారు. విల్లమ్ములు చేత ధరించి ఆచార్యుని అనుమతికోసం నిరీక్షిస్తున్నారు. భీష్మాచార్యాది కురువృద్ధులంతా అనతిదూరంలోనే తమ తమ సుఖాసనాలపై సమాసీనులై ఏకాగ్ర దృష్టితో ఆ కౌశల పరీక్షా వ్యవహారమంతా చూచి ఆనందిస్తున్నారు.

ద్రోణాచార్యుడు రాజశిల్పులచేత ఒక కృత్రిమ పక్షి శిల్పం తయారు చేయించాడు. అది వారి కనతిదూరంలో ఉన్న వటవృక్షం చిట్టచివరి కొమ్మమీద ప్రతిష్ఠించారు. ఆచార్యుడు తన శిష్యుల కా పక్షి శిరస్సు నిర్దేశించి చూపించి ఏవేవో ప్రశ్న లడుగుతున్నాడు. వారి సమాధానాలు విని 'ఇక ఇది నీవల్లగాదు, నీవు తొలగిపో!' అని ఆజ్ఞాపిస్తున్నాడు. అంతేగాని వింట సంధించిన బాణంతో ఆ పక్షి శిరస్సు ఖండించివెయ్యవలసినదని ఆజ్ఞాపించడంలేదు. అలా ధర్మరాజు, భీముడు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు మొదలైన వారెందరో ద్రోణాచార్యుని ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరా లివ్వలేక తలలు వంచుకొని పక్కపక్కలకు తొలిగిపోయి నిలుచున్నారు. అంతలో అర్జునుని వంతు వచ్చింది. ఆచార్యు డతన్ని కూడా పరీక్షించాడు:

"నీ కా పక్షిశిరస్సు స్పష్టంగా కనిపించిందా?"

అర్జునుడు తన ఏకాగ్రదృష్టి మరల్చకుండా 'ఔ'నని సమాధానం చెప్పాడు. ఆచార్యుడు మళ్ళీ ప్రశ్నించాడు:

"ఇంకా మిగిలిన మేమంతా కనిపిస్తున్నామా?"

"లేదు."

"ఇంకా ఆ చెట్టుమీది శాఖోపశాఖలు?"

"ఏమీ కనిపించడం లేదు! ఆ పక్షి శిరస్సొక్కటే కనిపిస్తూంది."

"అయితే వెంటనే బాణం ప్రయోగించు!" అన్నాడాచార్యుడు.

అర్జునుడు వెంటనే బాణం ప్రయోగించాడు. ఉత్తరక్షణంలో ఆ కృత్రిమపక్షి శిరస్సు తెగి నేలమీద పడిపోయింది. వెనువెంటనే ఆ మహాసదస్సులో అంతటా సాధువాదాలు చెలరేగి మిన్నుముట్టాయి.

ద్రోణాచార్యుడపార వాత్సల్యంతో అర్జునుణ్ణి గాఢంగా కౌగిలించుకొన్నాడు. అతని శిరస్సు మూర్కొన్నాడు. ఆచార్యుని ఆనందబాష్పాలతో అర్జునుని శిరస్సు ఆర్ద్రమైపోయింది.

కొంతకాలానికి పూర్వం ద్రోణాచార్యుడు హస్తినాపురానికి రాగానే భీష్ముడతని విచిత్ర చరిత్ర అంతా సమగ్రంగా విని ఎంతో సంతోషించి కౌరవ పాండవ కుమారులందరికీ ధనుర్వేదం సాంగోపాంగంగా బోధించవలసిందని ప్రార్థించాడు.

ద్రోణాచార్యుడు ధనుర్వేదం ఉపదేశించే ప్రారంభంలోనే వారందరినీ ప్రశ్నించాడు :

"ధనుర్వేదం అభ్యసించిన అనంతరం నా అభీష్టం నెరవేర్పగలవారు మీలో ఎవరైనా ఉన్నారా ?"

ఆ ప్రశ్న విని కౌరవ పాండవకుమారులందరూ నిరుత్తరులై నిలబడ్డారు. అర్జునుడొక్కడే ధైర్యంగా ముందుకువచ్చి నిలుచున్నాడు :

"మీ అభీష్టమేదైనా సరే! అది నేనవశ్యం నెరవేర్చగలను!" అతడు తన చిరకాల మనోరథం నెరవేర్చగలడని ఆచార్యుడానాడే అనుకొన్నాడు.

ఈనాడవలీలగా పక్షిశిరస్సు ఖండించి వెయ్యడంతో ఆచార్యునికి మరింత ధైర్యం కలిగింది. కౌరవ పాండవులందరిలోనూ అర్జునుడొక్కడే ధనుర్వేదం అంతా సాంగోపాంగంగా క్షుణ్ణంగా అభ్యసించినవాడు. అతని శ్రద్ధాభక్తుల కానందించి ఆచార్యుడతని కెన్నెన్నో మహాస్త్ర ప్రయోగోపసంహారాలుపదేశించాడు.

## 2

అస్త్రవిద్యా పరీక్ష ముగిసిన క్షణంనుంచీ అర్జును డాచార్యుని కత్యంతాప్తుడైన అంతేవాసి అయినాడు. ఆ నాటినుంచీ ఆచార్యుని దగ్గర ఎన్నెన్నో ధనుర్వేదరహస్యా లవగాహన చేసుకొన్నాడు.

క్రమంగా కౌరవ పాండవకుమారుల ధనుర్విద్యాభ్యాసం సమాప్తమై పోయింది. వారందరూ ఆచార్యునికి గురుదక్షిణ సమర్పించే సమయం ఆసన్నమయింది. వారిలో కొంద రాచార్యునికి వేలకొలదీ ఆలమందలు గురుదక్షిణగా సమర్పింపవలెనని అనుకొన్నారు.

కాని ఆచార్యు డలాంటి గురుదక్షిణ లేవీ స్వీకరించలేదు. కౌరవ పాండవ కుమారు లందరికేసీ పరిశీలనగా చూసి తన మనోరథం వారి కెరిగించాడు:

"పాంచాలాధీశ్వరుడు ద్రుపదరాజు ఐశ్వర్య దురహంకారంతో కన్నుమిన్ను కానకుండా సంచరిస్తున్నాడు. మీలో ఎవరైనాసరే, అతన్ని పెడరెక్కలు విరిచికట్టి నా యెదట నిలబెట్టగలరా? ఇదే నేను మీ వల్ల కోరుకునే గురుదక్షిణ."

ఆచార్యుని అభీష్టం విని కౌరవ పాండవ కుమారులు క్షణకాలం నిర్ఘాంతపోయారు. వెంటనే ద్రుపదుణ్ని బంధించి తీసుకురావాలనే దృఢ నిశ్చయంతో సైన్యాలతో సహా పాంచాల రాజ్యానికి బయలుదేరి వెళ్ళి పోయారు. అయితే ఆచార్యు డా విధంగా ప్రార్థించడానికి హేతు వేమో వా రెవరికీ తెలియలేదు.

కౌరవులంతా మున్ముందుగా పాంచాల రాజధానీనగరం కాంపిల్య పురంమీదికి దండెత్తి వెళ్ళిపోయారు. వారి వెంటవెంటనే పాండవులు, ద్రోణాచార్యుడూ బయలుదేరి వెళ్ళారు.

ద్రుపదుణ్ణి జయించడం మాటలతో పనిగాదని అర్జును డెరుగును. అయినా కౌరవ కుమారుల శౌర్యం పరిశీలించ వలెననే కౌతూహలంతో అత డలాగే ఆచార్యుని సన్నిధినే నిలిచి పోయాడు.

కౌరవ కుమారులు చతురంగ సేనలతో తనపై దండెత్తివచ్చారని వినగానే ద్రుపదుడు తోకతొక్కిన తాచులా మండిపడ్డాడు. తన

అపార సేనావాహినితో కౌరవ కుమారుల నెదుర్కొన్నాడు. వారి మీద శరపరంపరలు ప్రయోగించాడు. కౌరవ కుమారు లా శరధాటికి తోర్వలేక పలాయన మంత్రం పఠించారు. ఆ కుమారు లావిధంగా పరాజితులై వెనుదిరిగి రాగానే ద్రోణాచార్యుని ముఖంలో విషాదరేఖ లలముకొన్నాయి.

అర్జును డది చూచి వెంటనే ద్రుపదునితో యుద్ధం చెయ్యడానికి బయలుదేరాడు. అచిరకాలంలోనే ద్రుపదుణ్ణి బంధించి తీసుకురాగల నని ప్రతిజ్ఞ చేశాడు.

అర్జునుడు అనతిదూరంలో కనిపించే పాంచాలరాజధానికి బయలు దేరగానే ద్రోణుని హృదయంలో కొంచెం ఊరట కలిగింది.

కాని అర్జునుడైనా ద్రుపదుణ్ణి బంధించి తీసుకురాలేడేమో అన్న సంశయంమాత్రం అతన్ని వేధించడం మానలేదు. ఆ డోలాందోళనతో ఆచార్యుని హృదయం అట్టుడికిపోయిన ట్టుడికి పోయింది. ద్రుపదుని నామధేయం స్మరించగానే ఆచార్యుని హృదయం అవమానభారంతో కుంగిపోయింది.

ఆ రాజాధముని నిండు పేరోలగంలో తనకు జరిగిన మహావమానం అంతా ఆ క్షణంలో మళ్ళీ అతనికి కన్నులకు కట్టినట్టుగా ప్రత్యక్షమైంది.

ఐశ్వర్యం ఎంతటి సత్పురుషులనైనా కేవలం అంధులుగాను, బధిరులుగాను, అధమాధములుగాను మార్చి వెయ్యగలదని అనుకొని ఆచార్యు డుగ్రుడైపోయాడు. ఆ క్షణంలో అతనికి బాల్యంలో అగ్నివేశుని దగ్గర చేసిన ధనుర్విద్యాభ్యాసము, ద్రుపదుని సహాధ్యాయిత్వము, అనంతరం అతని దురహంకారము మొదలైన విషయాలన్నీ ఒక్కమారుగా స్ఫురణకు వచ్చాయి.

అగ్నివేశునిదగ్గర ధనుర్వేదం అభ్యసించిన పిమ్మట ఆయన అభ్యనుజ్ఞ స్వీకరించి ద్రోణాచార్యుడు కృపాచార్యుని చెల్లెలు కృపిని వివాహం చేసుకొన్నాడు. తరవాత కొంతకాలానికి వారిద్దరికీ అశ్వత్థామ జన్మించాడు.

ద్రోణాచార్యు డా సమయంలో పాంచాల రాజ్యంలో ఒక అగ్రహారంలో నివసిస్తూ ఏ పూట కా పూట గడవక కష్టపడుతున్నాడు. ఆ సమయంలోనే అశ్వత్థామ జన్మించడం జరిగింది.

క్రమంగా కొంత కాలానికి అశ్వత్థామకు రెండేళ్ళు నిండాయి. ద్రోణాచార్యుని కిరుగు పొరుగున ఉన్న వారందరూ ఏ లోటూ లేకుండా పాడి పంటలతో హాయిగా కాలక్షేపం చేస్తున్నారు. వారి శిశువులందరూ ముప్పొద్దులా గోక్షీరం సేవిస్తూ ఆడుకుంటూంటే అశ్వత్థామ అది చూచి తనకు కూడా ఆవుపాలు కావాలని మారాము చెయ్యడం మొదలుపెట్టాడు.

ద్రోణుని గృహిణి రెండు మూడు మారులు భర్తతో ఆ విషయం విన్నవించింది. కాని ద్రోణు డేమి చెయ్యగలడు? అతని కా పూట గడవడమే కష్టంగా ఉంది. ఇక ఏమి చెయ్యడానికీ పాలుపోక దారిద్ర్యం వంటి మహా పాపం లేదనుకొని లోలోపలే కించపడుతూ మాట్లాడ కూరుకొన్నాడు.

ఒకనాడు కృపి అతనికి ద్రుపద మహారాజు విషయం జ్ఞాపకం చేసింది. ఆ మాటతో అతనికి పెన్నిధి సన్నిధినే ప్రత్యక్షమయి నట్లయింది.

ద్రోణుడు, ద్రుపదుడు సహాధ్యాయులై అగ్నివేశమహర్షి వద్ద ధనుర్వేదం యావత్తూ సమగ్రంగా అభ్యసించారు. వారిద్దరూ ఆ రోజుల్లో సాక్షాత్తూ అన్నదమ్ముల్లాగే మసులుకుంటూ అగ్నివేశమహర్షి అపార వాత్సల్యం చూరగొన్నారు.

ద్రుపదు డాగర్భ శ్రీమంతుడు కాడు. అతడు చిన్నప్పటినించీ భరద్వాజ మహర్షి ఆశ్రమంలోనే పెరిగి పెద్దవాడైనాడు. ద్రుపదుడు పాంచాల మహారాజు పృషతుని కుమారుడని వినబడీ వినబడనట్లుగా ఆశ్రమంలోని బ్రహ్మచారులంతా గుసగుసలాడుకొనేవారు. ద్రుపదునికి తల్లిలేదనీ, అతడు పృషతునికి మరుదంశంవల్ల జన్మించిన కుమారుడనీ కొంతకాలానికి ద్రోణునికి తెలిసింది. అప్పటినించీ ద్రోణు డతనియెడల ఎంతో సౌహార్దం వ్యక్తీకరిస్తూ ధనుర్వేదాభ్యాసంలో అతనికి చేదోడు వాదోడుగా ఉండేవాడు.

కొంతకాలానికి పాంచాలాధిపతి పృషత మహారాజు కాలధర్మం చేశాడు. ద్రుపదునికి పాంచాల రాజ్యాధికారం సంక్రమించింది. పట్టాభిషేక మహోత్సవంకోసం పాంచాల రాజధాని కాంపిల్యనగరానికి బయలుదేరే వేళ ద్రుపదుడు ద్రోణాచార్యుని దగ్గర సెలవు తీసుకొన్నాడు.

"ద్రోణా! నేను పాంచాలరాజ్య పట్టాభిషేకార్థమై వెళ్ళిపోతున్నాను. నీవు ధనుర్వేదం సాంగోపాంగంగా అభ్యసించిన బ్రహ్మణ్యుడవు! నాతో సమానంగా మహారాజభోగా లనుభవించడాని కన్నివిధాలా అర్హుడవు! ఎప్పుడైనా అవసరం వచ్చినప్పుడు కాంపిల్య నగరానికి విచ్చేయవలసింది." అని అత్యాదరంతో ఆహ్వానించి, వెనువెంటనే కాంపిల్య నగరానికి వెళ్ళిపోయాడు.

ద్రోణుని కా విషయం అంతా ఆక్షణంలో జ్ఞాపకం వచ్చింది. "అంతటి మహారాజుకదా! అశ్వత్థామ పాలకోసమని చెయ్యిచాచితే నాలుగు గోవులైనా ఇయ్యలేకపోతాడా?" అనుకున్నాడు. వెంటనే కాంపిల్యనగరానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. కాని ఆ నగరానికి వెళ్ళినతరవాత అతని కెంతకాలానికీ రాజదర్శనం కాలేదు! ప్రతీహారుల దగ్గిర మొరపెట్టుకోగా మొరపెట్టుకోగా ఎలాగో అలాగ కొంతకాలానికి ద్రోణునికి మహారాజదర్శనం లభించింది ద్రోణుడు నిండు పేరోలగంలో అడుగుపెట్టాడు. కాని ద్రుపదు డతన్ని గుర్తించినట్టయినా కనబడలేదు. దానితో ద్రోణాచార్యుని ప్రాణం చచ్చిపోయింది. అయినా ఓరిమివహించి ద్రుపదునికి తన కులగోత్రాలు, అగ్నివేశ మహర్షి దగ్గర తాము చేసిన ధనుర్విద్యాభ్యాసము మొదలైన విషయాలన్నీ వరసగా ఏకరువుపెట్టాడు. ఆ మాటలు విని ద్రుపదుడు వెటకారంగా విరగబడి నవ్వాడు:

"వెర్రివాడా! నీకేమైనా మతిభ్రమణంగాని కలిగిందా? పేద బ్రాహ్మణునికీ, ధారుణీశ్వరునికీ మధ్యన స్నేహమేమిటయ్యా! పో! పో!"

అని కసిరివేశాడు. ద్రోణు డది విని పాషాణ ప్రతిమలా నిర్ఘాంతపోయాడు. మళ్ళీ ద్రుపదు డందుకున్నాడు:

"కయ్యము, వియ్యము సమానులకే! దరిద్రులకు, ధనవంతులకు మధ్యన స్నేహమేమిటి?

"అదీగాక రాజులైనవారికి కేవలం ప్రయోజనంవల్లనే శత్రుత్వ మిత్రత్వాలేర్పడుతూ వుంటాయి. నీవంటి పేదబ్రాహ్మణునివల్ల మావంటి పృథివీశ్వరులకు ప్రయోజనం ఏమిఉంది? నీకూ, నాకూ స్నేహమేమిటయ్యా! తారతమ్యాలు తెలుసుకోకుండా నీ ఇష్టంవచ్చినట్లిలాగ మాట్లాడడమేనా? పో! పో!"

ఆ పరుషభాషణం వినగానే ద్రోణునికి తన పాదాలకింద భూమి పాతాళలోకం లోనికి దిగిపోయినట్లనిపించింది. అతని హృదయంలోని క్రోధాగ్నిజ్వాల నఖ శిఖ పర్యంతం వ్యాపించింది. కాని కేవలం నిరు పేద బ్రాహ్మణు డేమిచెయ్యగలడు?

అటుపిమ్మట ద్రోణు డగ్నిహోత్రం చేత ధరించి, భార్యాపుత్రుల తోను, శిష్యగణంతోను కలిసి హస్తినాపురానికి ప్రయాణమై వెళ్ళి పోయాడు.

అదృష్టవశాత్తూ నగర సమీపంలోనే అతని కొక మహద్భాగ్యం కలిసి వచ్చింది. ఒక దిగుడు బావిలో పడిపోయిన కందుకం పైకితీసే మార్గం తెలియక కౌరవ కుమారులందరూ బావినీటిలో తేలుతూన్న కందుకంవైపు చూస్తూ నిలుచున్నారు. ద్రోణుడు ఆ కందకం పై కొక చిన్నబాణం ప్రయోగించాడు. ఆ బాణంపై ఇంకొక బాణం ప్రయోగించాడు. ఆ విధంగా అవలీలగా ఆ కందకం పైకితీసి కౌరవ కుమారుల కందిచ్చాడు.

ఆ కుమారు లా అద్భుత వృత్తాంతం భీష్మునికి తెలియజేశారు. ద్రోణాచార్యు డా క్షణంనించీ కౌరవ పాండవులకు ధనుర్విద్యాచార్యు డైనాడు.

ఆ స్మరణతో ద్రోణుని హృదయంలో ద్రుపదుడు రగిల్చిన పరాభ వాగ్నిజ్వాల అలాగే అవిచ్ఛిన్నాగ్నిహోత్రంలా ప్రజ్వలించింది. ద్రుప దుని శరధాటి కోర్వలేక కౌరవులందరూ భయపడి పారిపోయిరావడం చూడగానే ఆ అగ్ని ఒక్కమాయగా భగ్గుమని మండింది. అహో

రాత్రాలు కళ్లలో వత్తులు పెట్టుకుని ద్రోణుడు శిష్యులందరికీ ధనుర్వేద రహస్యా లుపదేశించాడు. కాని అతని పరిశ్రమ అంతా వాడు బూడిదలోపోసిన పన్నీరై పోయింది! ఇక ఆచార్యునికి అభిమతమైన గురుదక్షిణ సమర్పించగలవా డర్జును డొక్కడే! ఆచార్యుని కింకా అతనిమీది ఆశ నశించిపోలేదు. అలాగే అర్జునుని పునరాగమనం ఎదురు చూస్తూ నిలుచున్నాడు.

# 4

ఆచార్యుని కనతిదూరంలో ఒక మహా కలకలం చెలరేగింది కౌరవ సైనికులందరూ గొంతెత్తి అర్జునుణ్ణి జయజయ ధ్వానాలతో అభినందిస్తున్నారు. ద్రోణు డటువైపు చూచాడు.

కొంత సేపటి కర్జునుని రథం ద్రోణుని కల్లంతదూరంలో నిలిచింది. అర్జునుడు ద్రోణునికి సాష్టాంగ నమస్కారం చేశాడు. రథానికి పెడరెక్కలు విరిచి కట్టిన ద్రుపదుణ్ణి నిర్దేశించి చూపించి, ఆ గురుదక్షిణ స్వీకరించవలసిందని ప్రార్థించాడు. అసలే ద్రుపదుడా అపజయంతో జీవచ్ఛవమైపోయాడు. ఆపైన ద్రోణాచార్యుని చూడగానే అతని ముఖం వివర్ణమై వెలవెలబోయింది. ద్రోణాచార్యుని రోషావేశం చూడగానే కౌరవులందరూ ద్రుపదుని కాక్షణంతో ఆయుర్దాయం తీరిపోయిందనే అనుకున్నారు. ఆచార్యు డతన్ని యజ్ఞపశువును సంహరించివేసినట్లు సంహరించి వెయ్యగలడని అనుకున్నారు.

కాని ద్రోణు డటువంటి క్రౌర్యానికి పాల్పడలేదు. అర్జునుడు సమర్పించిన గురుదక్షిణ కెంతో సంతోషించాడు. పిమ్మట ద్రుపదుని దగ్గరికి వెళ్ళి నవ్వుతూ చల్లచల్లగా అంటించాడు:

‘‘వీ రెవరు? పాంచాల రాజ్యాధీశ్వరులు ద్రుపదమహారాజులా? పాపం! వీరి కీవిధంగా పట్టుబడిపోవలసినంత దుర్గతి పట్టిందే? ఈ క్షణంతోనైనా వీరికి మహారాజ్య మదాంధకారం తొలగిపోయిందా?’’

అని ద్రోణు డతని కింకా దగ్గిరికి వెళ్ళిపోయాడు.

"మహారాజా! ఇప్పటికైనా నేనెవరినో మీకు గుర్తువచ్చిందా? కొంచెం కన్నులు తెరిచి చూడండి!"

అని గట్టిగా ఎత్తిపొడిచి పిమ్మట ద్రుపదుని బంధనాలన్నీ విప్పించివేశాడు. ఆచార్యుడావిధంగా వ్యంగ్యధోరణిలో ప్రసంగిస్తూంటే కౌరవపాండవ కుమారుల కెంతైనా ఆశ్చర్యం వేసింది. ఎందుకగడిమంటకూ, బ్రాహ్మణ క్రోధానికీ భేదమేమీ లేదనీ, ద్రుపదుణ్ణి అంత తేలికగా విడిచిపెట్టడం ఒక్క ఆచార్యునికే తగినదనీ అనుకొన్నారు.

కాని క్షత్రియుని క్రోధంమాత్రం వట్టి గడ్డిమంట కాదు. ద్రుపదుడు తనకు బంధవిముక్తి లభించిన ఆ క్షణంనించీ ఆచార్యుడు చేయించిన అవమానానికి తగిన ప్రతీకారం చెయ్యాలని శపథంచేశాడు.